BATHING HABITS OF INDIA—1

# SHIKAI *in South India*



విశాల భరతఖండములోని వివిధరాష్ట్రీయులు వారి వారి స్నాన
ములకు అనేకపద్ధతుల నవలంబించుచున్నారు. తమిళనాడు
వారు (దక్షిణభారతము) శికాయపొడి వాడుదురు, ఈ అల
వాటు క్రమముగా తగ్గుచున్నది. వేలకొలది గృహములలో
'శికాయపొడి' మున్నగువానికి బదులుగా, స్వస్తిక్
'కాంతి' సోపు నేడు వాడబడుచున్నది.




స్వస్తిక్‌వారి యితరవస్తువులలో, సువాసన ఆముదము. స్వస్తిక్
షేవింగ్‌స్టిక్, బట్టలసబ్బులు, గోవాలిన్ బ్రాండ్ వనస్పతి
మున్నగునవి చేరియున్నవి,

# SWASTIK
# KANTI SOAP

UNMATCHED FOR QUALITY

SWASTIK OIL MILLS LIMITED BOMBAY.

SOM 4 SHILPI

BE INDIAN – BUY INDIAN!

సేల్సు డిపో, మద్రాసు నెం. 14, జి. స్ట్రింగర్‌వీధి, లోక్‌స్క్వేర్, మద్రాసు.
సేల్సు డిపో, బెంగుళూరు ఆర్కాట్ శ్రీనివాసాచారి వీధి, బెంగుళూరు సిటి.

# Godrej గోద్రెజ్ 

తా శ ం
చె వి మా ర్కు

# సబ్బుల
# సరసమైన ధరలు

చిల్లరగా అమ్మబడు ఒక్కొక్క సబ్బు ఖరీదు ఈ క్రింద చూపిన చిత్రముల క్రింద ఇవ్వఁబడినవి. (ఎక్కడ సుంకము, అక్ట్రాయ్, టర్మినల్ టాక్సుతోపాటు లేక ఇతర పన్నులు ఇవ్వవలసి వుండునో అచ్చట ఖరీదు కొంచెము ఎక్కువగా నుండును.) సబ్బులు తయారుచేయుటకు అవసరమైన ముడిపదార్థముల ధరలు పెరుగుటచే, 10-4-1947 నుంచి మాసబ్బుల ఖరీదు పెంచవలసిన ఆవశ్యకత కలిగినది.



నెం. 1—11 అణాలు.



నెం. 2—$8\frac{1}{2}$ అణాలు.



'వత్ని'—6 అణాలు.
'వత్ని' (చిన్నసైజు)—$1\frac{3}{4}$ అణాలు.



శాండల్—7 అణాలు.



లిండా (వేప)—7 అణాలు.



కస్—7 అణాలు.




టర్కిష్‌బాత్-$4\frac{1}{2}$ అణాలు.



షేవింగ్‌స్టిక్(కార్టన్)-$7\frac{1}{2}$ అణాలు.
(ఖరీదులో మార్పులేదు)
షేవింగ్‌స్టిక్ (టిన్)—10 అణాలు.




షేవింగ్ 'రౌండ్'-$4\frac{1}{2}$ అణాలు.
(ఖరీదులో మార్పులేదు)

గోద్రెజ్ సోప్సు, లిమిటెడ్.

భారతదేశంలోవృక్షతైలములతోటాయిలెట్(స్నాన)సబ్బులను తయారుచేయుటకుప్రప్రథములు.

సింధునదీ పశ్చిమ ప్రాంతమునందుండు అజానుబాహువైన పఠాను తన పూర్వీకుల టీ త్రాగే ఆచారమును ఇప్పటికి మెచ్చుకొనుచున్నాడు.

బ్రూక్ బాండ్ తేయాకు తాజాగా కమ్మని వాసనగలిగి యుండబట్టి భారతదేశమందు ఇతర ప్రదేశములయందువలె సరిహద్దురాష్ట్రములో కూడా ఎక్కువగా కోరబడుచున్నది.




# బ్రూక్ బాండ్

రెండాకులు ఒక మొగ.



## జూన్, 1947

## సవరణ

గత సంచిక (మే)లోని త్రివర్ణచిత్రము శ్రీ సుధాంశుకుమార రాయిదిగా పొరపాటున అచ్చయినది. అది వారిదికాదు; శ్రీ వైద్యనాథదాసుగారిది.

ఈ సంచికలో ౫౫౦-వ పుటతర్వాత ౫౫౧ గా పడవలసిన వరుససంఖ్య పొరపాటున పదినంబర్లు కప్పదాటు వేసి అదేవరసన చివరంటసాగినది. మధ్యలోని ఆ లోటును పాఠకులు అసలు పుటలలోటుగా పరిగణించరాదు.

# భారతి ఇరువదినాల్గవ సంపుటము, భా-౧

## అకారాది విషయ సూచిక





మొయిలు రేక

చిత్రకారుడు: శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి



సంపుటము 24
సంచిక 6

# భారతి

జూలై 1947
సర్వజిత్తు, జ్యేష్ఠము

# ద్వేషవహ్ని

= శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి =

౧

ఆతని వాడి బాకుకొన నడ్డుగ చీల్పగబడ్డ గుండెపై
నీతని వేడినెత్తురు లదేవనిగా ప్రవహించెడున్ — ప్రభూ !
ఆత డితండు నీకు సుతు లౌదురుగా, పగ మాన్పవేటికో !
రాతియెడందవాడవా, పరాకొ, అసత్యమొ నీకు మన్కియే !

రాముడవో, రహీమువో, విలాసమయప్రకృతిన్ సృజించినా
వేమిటి కీమనుష్యుల? సృజించితిబో, దయసేసి తేటి క
య్యా మతమన్నపేరి సుర నన్నలు దమ్ములు కత్తిబట్టగా ?
ప్రేమలతన్ దహించు పగవేడిపొగల్ నిను జుట్టవా ప్రభూ !

తనప్రక్కింటి కుమారు లేబెదవి నత్యంతాభిమానాన ని
న్ననె ముద్దుల్ గురిపించినట్టి నరు డీనా డేసురం ద్రావెనో,
కనులన్ గెంపు నటింప కుంతమున బుగ్గల్ జీల్చి ఆపాప వె
చ్చని క్రొన్నెత్తురు గ్రోలె తృప్తిగను: ఆశ్చర్యమ్ము గాదా ప్రభూ !

సీరుగ తీర్చికట్టిన మసీదుల నిన్దలపోయనిమ్ము — మం
దారసుమాల మాలల కనత్కనకప్రతిమఁ నితాంతశృం
గారము సేసి వేవిధపు నామములఁ నిను గొల్వనిమ్ము — చ
ల్లారని ద్వేష మేల యెదలందు పరస్పర మోర్మి నిల్వదా ?

౫

నీకయి వాదులాడి మరణించిన ఈ దురదృష్టమానవా
నీకము ద్వేషముఁ విడిచి నేరిచికొన్నది రాతినేలపై
ఏకత ! ప్రక్కప్రక్కల శయించిన వీరి కళేబరమ్ములఁ
సోకవు పూర్వపుఁ మతపు సూడుల నీడలు సంజచీకటిఁ !

౬

అదె ధూళిఁ బొరలాడు జన్నిదపు బ్రహ్మస్నిగ్ధ వర్చస్సుతో
గదిసెఁ తీయని నెయ్యముల్ నెరపగా గడ్డంపు ధావళ్యముల్ !
ఇదె గాలిఁ గదలాడు మేల్ముసుగు కంటించెఁ స్వరక్తచ్ఛవుల్
నుదుటఁ శోభిలుచున్న శోణతమసింధూరార్ద్ర రేఖాంకముల్ !

చచ్చినవారి జూచియు నిపాపయి నుండుట మానవాళికిఁ
నచ్చదు స్నేహాజీవనఘనత్వము : కత్తులు దూసి నిల్చి రీ
పచ్చని నేల నెత్తురుల వాగులు బారగజేయగా — ప్రభూ !
ఎచ్చట దాగినావు ? కరుణింపవ ? మాన్పవ సర్వనాశముఁ ?



# ఆంధ్రసాహిత్యంలోని స్త్రీపర్యాయాలు



= శ్రీ టి. రామచంద్ర =

మానవజాతికలిక విజ్ఞానంతో వికసించడంతో పాటు భాషాసుగంధంకూడ నలుదిక్కులా వెనలువారసాగింది. ఆదిమానవుడు తన భౌగోళిక పరిస్థితినిబట్టి, అవసరాలనుబట్టి సంకేతించుకొన్న శబ్దాలు క్రమంగా కొంత మార్పుతో నానార్థాలనూ సంతరించుకొనినవి. ఒక సంఘం మరోసంఘంతో చేరుటతోనూ భావశబ్దార్థవినిమయమూ విశేషించింది.

మానవుడు పరిసరవస్తుపరిశీలనతో సంచితాలయిన భావాలను సంకేతించుకొని అనుభవపుమూసలో పోసి వాటికి శబ్దరూప మిచ్చినాడు. కమ్మదనంతో కళకళలాడే ప్రకృతిని పరిశీలించినాడు. ఆయమఅందానికి అమ్ముడుపోయినాడు. తన సమీపవస్తువులకు వానిపేరు పెట్టడంతో సంతోషించినాడు. కొవ్వెక్కి ఆకసమంతా అలముకొని గుండెలు గుభేలుమన గర్జించే మేఘరాజునుండీ, అడవిఅంతా తనదే అన్నట్లుగా జూలు జాలువార్చుకొని పొదలూ నదులూ దూరి వీరవిహారం చేసే మృగరాజునుండీ, పురిని విరియబోసుకొని పరవళ్లు తొక్కే శిఖిరాజునుండీ అందమూ, ఆత్మవిశ్వాసమూ అలవరచుకొన్నాడు. వాటిని తన భాషలో జీర్ణించుకొన్నాడు. చక్కని చిలుకచెలితో తన సహచరిని సరిపోల్చుకొని మురిసినాడు. నదుల ఒడ్డుల సికతాశయ్యలపై ఎకసక్కెములాడే అంచరాణుల మెలమెల్లని నడకలను తన చెలియందే భావించుకొని సంతృప్తిపడినాడు. ప్రకృతిలోని సోయగాన్నంతా ఒకేమారు ఆకళించుకొన అఱ్ఱులు సాచినాడు.

ప్రకృతిసౌందర్యాలుబ్ధయిన మానవుని ప్రప్రథమ సంకేతసమూహమే సాహిత్యంగా సాకారమయే కాలానికి తన సంకేతితార్థాన్ని సడలించుకొని మరో అర్థంలో రూఢస్థితికి వచ్చినది. కొన్ని సంకేతాలు మానవజాతి మారినకొలది తమ వేషాన్నే మార్చుకొన్నవి. మరికొన్ని అసలే అడుగంటినవి. ఇక కొన్ని తమ వ్యక్తిత్వాన్నే కోలుపోయినవి.

మన భాషలోని స్త్రీవాచకపర్యాయపదాల పరిశీలన ఈ సిద్ధాంతనిరూపణకు మనకు కొంత సాధకం.

ప్రపంచంలోని అన్ని భాషల స్త్రీపర్యాయపదాలూ గుచ్చెత్తినాకూడ ఒక తెనుగులోని స్త్రీపర్యాయపదాల సంఖ్యకు సరిపోవని నామిత్రు డొక డన్నాడు. ఇది పూర్తిగా నిజం. ఆంధ్రనామసంగ్రహాన్ని బట్టి స్త్రీకి ౨౫ తెలుగుపర్యాయపదాలూ, సాంబనిఘంటువును బట్టి ౫౨ పదాలూ మనకు లభిస్తున్నాయి. వీనికి ఏలాటి వ్యుత్పత్త్యర్థాన్నీ మన నిఘంటుకారులు నిరూపించలేదు. ఆ ప్రయత్నంకూడ చేయలేదన్నా తప్పులేదనుకుంటాను.

ఏ చికిలికండ్ల ఆమెనో చూచి మనం కమలాక్షీ, ఇందీవరాక్షీ మొదలయిన సుందరశబ్దాలతో సంబోధించవచ్చు. ఒక పవిత్రబ్రాహ్మణిని 'పాలతీ' అనవచ్చు. పేదరాలు పెద్దమ్మనుకూడ 'ప్రోయాలా' అని పిలువవచ్చు. ఇల్లు చక్కబెట్టజాలని యిల్లాలినికూడ 'గరితా' అనవచ్చు. కన్యాశుల్కమేమీ లేకనే కరగ్రహణం చేసిన కాంతనుత్రొక్కుపాటు తొలగదోచుకొని తెరవా

అని పిలువవచ్చు. మరోవిధంగా సంక్రమించిన ఆమెను 'పడతీ, మడతీ' అని అనవచ్చు. మోటుగా, మొరకుగా మనకు దర్శనమిస్తున్న హస్తినినికూడ 'ఎలనాగా, నెలతా' అని ఎలుగెత్తి పలుకవచ్చు. అగ్నిసాక్షిగా వివాహమాడినదాన్ని 'చేడియా' అనడం అభావ్యంకాదు.

తెలుగునాట సాహిత్యం సొబగులువారే కాలానికే వీని సంకేతితవాచ్యార్థం విలయమై రూఢమయిపోయినది. తెలుగుసాహిత్యం సంస్కృత వాఙ్మయ శిథిలాలలో మొలకెత్తిన మల్లెతీగ. దాని పూవుల తావులలో సంస్కృతశవ పూతిగంధం పొరలువారడం అసహజమూకాదు, అన్యాయ మంతకంటెనూ కాదు. నన్నయభట్టు రాజరాజనరేంద్రుని మన్ననలతో భారత రచనకు గంటం పన్నిన కాలానికే సంస్కృతసాహిత్య సౌధం నేలమట్టమయి, పునాదికూడ బీటలువారినది. కొనఊపిరితో ఉన్న సంస్కృతపదజాలం దేశభాషలపై కడపటి దాడి జరిపినది. క్రమంగా సంస్కృతశబ్దాలు కూడ రూఢమయిపోయినవి. ఆ సంస్కారమే గల తెనుగుకవులు వానినే గ్రహించినారు. శబ్దప్రయోగ సారస్యంలో ఏమరినారు. "స్త్రీ రితి నామాపి మధురం" అని చొంగలుకార్చే రాజాస్థానపండితులూ, కవులూ వాని వ్యుత్పత్తివిమర్శకే వెనుకాడినారు.

నన్నయమొదలు చిన్నయవరకూ గల కవుల ప్రయోగాలే ఈ వాదానికి తార్కాణ. భారతం ఆది, సభాపర్వాలలోని ఈ క్రింది ప్రయోగాలను పరామర్శించండి. (ఇది నన్నయ నాక్షేపించడమే మాత్రమూ కాదని మనవి.)

వాసుకి తన చెల్లెలు జరత్కారువును 'అంబుజనేత్రా' అని పిలుస్తాడు. దుష్యంతుడు కొత్తగా ఆశ్రమంలో ప్రవేశించినవాడు అక్కడి ఆశ్రమ కన్యను మర్యాదగా పిలువద్దూ ? శకుంతలను 'వనజనేత్రా' అని సంబోధిస్తాడు. సభలో శకుంతలపై కోపం వచ్చినప్పుడుకూడ 'అంబురుహానసా' అని అనడం మానడు. ఒళ్లు మండుతున్నా ఒడలి అందాన్ని విడనాడ దలచుకోలేదుకాబోలు ?

ప్రతీపుడు తాను గంగిఒడ్డులో ఒక అందకత్తెను (గంగను) చూచి, దానిని తనకు కుదిర్చిపెట్టుమని తన కుమారుని కోరుతూ, 'కన్యను' చూచినా నంటాడు. ఆయమ కన్య అని ఈయనగారికి ఎలా తెలిసింది ?

దీర్ఘతముడు 'సతులకు' శాపమిస్తాడు. మాద్రి కుంతిని 'అక్కా' అని పిలవడానికి మారుగా 'కమలాక్షీ' అని పిలుస్తుంది.

అన్నిటికంటే నవ్వుపుట్టించే దేమంటే హిడింబుడు తన చెల్లెలు హిడింబను 'కోమలి' అనడం, భీముని చంపి తీసుకొనిరమ్మని ఘర్మాయించడం. వెంటనే నన్నయగారి కంటికి హిడింబి 'రమణి' అయింది. భీమునికికూడ అంతేలెండి. లేకపోతే 'వనజనేత్రా' అంటూ సరసాలాడుతాడా ? ప్రేమ గుడ్డిదంటారుకదూ ! హిడింబి భీముని రూపబలాలకు లొంగి తన ఆనతి అతిక్రమిస్తుంటే, నన్నయ దానిని" పతిస్నేహము 'కామినులకు' బలవంతము, పెరనెయ్యములు వేయుదత్సదృశములే" అని సమర్థిస్తాడు. కామిను లనే శబ్ద ప్రయోగం ఎంతవరకు ఉచితమో ఏమో ?

స్వయంవరంలో తెచ్చిన ద్రౌపది 'బాలిక' అట. అర్జునుడు ఉలూపిని "తామరస నేత్ర ఎవ్వరవు?" అని పలుకరిస్తాడు. 'ఎవరమ్మా నీవు?' అని కనుక్కోలేడూ? అర్జునుని సుభద్ర కుశలప్రశ్న వేస్తూ "మాయత్త 'యంభోరుహాక్షి' కుంతీమహాదేవి కుశలయే?" అని ప్రశ్నిస్తుంది. బృహద్రథుడు 'జరను' 'వారిరుహాయతచారులోచనా !' అంటాడు.

ద్రౌపదిని సభకు తేబోయి, ప్రాతికామి 'వనజాక్షీ ! వెంటర'మ్మంటాడు. దుశ్శాసనుడుమాత్రం 'ప్రాత్రీ' అని హెచ్చరిస్తాడు. (ఇది యాదృచ్ఛికంగా పడిన మాట. ద్రౌపది అప్పుడు రజస్వలగనుక ఈ మాట అచ్చంగా సరిపోయింది.) సభలో ద్రౌపదిపై జరిగే అత్యాచారాన్ని వికర్ణుడు ఖండిస్తూ ఈ 'కోమలికి' అన్యాయం జరిగిందని అంటాడు. పెద్దమ్మకదా మర్యాదగా పిలువలేడూ ? పెద్దమ్మ అని తనకు తెలీదనుకుందాము. కోమలి అనే మాటకంటే గంభీరమయిన మాట అనలేడూ ? పుట్టుకబోది ధృతరాష్ట్రుడు

ద్రౌపదిని సమాశ్వాసిస్తూ, 'సుందరీ, ఇందుముఖీ' అంటూ దగ్గరకు పిలుచుకుంటాడు. ఆ అంధుని నోట ఇవేటి మాటలు ? కోడలు బిడ్డవంటిదగదా? ఆయమసౌందర్యాన్ని ఎన్నగూడదని శాస్త్రకారుల కట్టుదిట్టాలు కదా ! అమ్మాయి, బిడ్డా అని పిలువలేదూ ? భీష్ముడొకడే పెద్దమనిషిలా కనిపిస్తాడు. ద్రౌపదిని ఊరడించేప్పుడు 'అవ్వా' (అమ్మా) అని సంబోధిస్తాడు.

అచ్చులో పోసిన ఆకారాలులాగ, రవివర్మ రంగుబొమ్మల్లాగ నన్నయగారి ఆడవారు పిన్నా పెద్దా అంతా ఒకటే. నన్నయగారేకాదు, తెనుగు కవుల జనానా అంతా ఒకటే. అందరూ వారిరుహాననలే వారిరుహనేత్రలే; కన్యలే కమలాక్షులే; సతులే సీమంతినులే; ఇంతులే గొంతులే; భామినులే బాలికలే; తరుణులే తనుమధ్యలే; లలనలే లలితాంగులే; మానినులే మృగాక్షులే.

తిక్కనకూడ నన్నయ కేమాత్రమూ తీసిపోలేదు లెండి. చూడండి మచ్చుకు ఒక ప్రయోగం. విరాటుడు తన కుమార్తెను బృహన్నలకు పరిచయంచేస్తూ 'ఇచ్చేడియ' అంటూ చెంతకు పిలుస్తాడు. ఉత్తరకు ఈ శబ్దార్థం తెలిసేవుంటే "నీనాట్యమూవద్దు, నాణ్యమూవద్దు" అని తండ్రిని నానాచీవాట్లూ పెట్టి తొలగిపోయేదే. ఇలాగే తక్కిన ప్రయోగాలూను.

విలాసినీ విలాసాలు వఱదలై పారిన ప్రబంధాల కాలంలో వావి, వరుస లేకుండ స్త్రీ పర్యాయశబ్దాలు ప్రయోగింపబడినాయి. పెద్దన వరూధినివిలాసాలకు లొంగలిగాక నైష్ఠికుడయిన ప్రవరుని చరిత్రను ప్రశంసిస్తూ "కలంచునే 'సతుల' మాయల్ ధీరచిత్తంబులన్" అని సమర్థిస్తాడు. సతీశబ్దార్థగౌరవంపై పెద్దన దృష్టి బరపివుంటే ఇలాటి ప్రయోగంతో ఎందుకు తన చిన్నతనాన్ని చాటుకుంటాడు? (శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు దీనివిషయమై ఎంతో చర్చించారుకూడ.)

కొన్నిశబ్దాల సంకేతితార్థం కాలప్రవాహంలో పడి కొంత, కవుల స్వైరప్రయోగాలవల్ల కొంత సమసిపోయిం దనడమే పై నిదర్శనప్రదర్శనంలోని పరమార్థం. కాని, భారత కాలంనాటికీ, అంతకు ముందునుంచీకూడ వాఙ్మయసౌరభాలు విరజిమ్మే కర్ణాట తమిళభాషలలోని పదాలకుమాత్రం ఇప్పటికీ వ్యుత్పత్తి సౌలభ్యం లభిస్తూండడం తెనుగు పదాలలోని చిక్కును తెమల్చడానికి కొంత తెరవవుతూన్నది. ఒక సంఘానికి చెందిన వనగలిగి, కాలప్రవాహంలో వేర్వేరు ఒడ్డుల బడి, అన్ని సంఘర్షణలనూ ఎదుర్కొని, నానా సాంకర్యాలనూ సంతరించుకొని, ప్రస్తుతం తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటున్న అన్ని భాషలూ ఒకే అజ్ఞాతఅక్షరేఖపై అంజవేస్తున్నాయి.

మూలశబ్దాలే కొంతమార్పుతో నానార్థాలలో, నానుడులలో నాటుకొనిపోవడం భాషాప్రధానలక్షణమని చెప్పడం చర్వితచర్వణం. ఈ దృష్టితో పరిశీలన అన్నిశబ్దాల వ్యుత్పత్తినిరూపణకూ నిర్ణాయక మవుతుంది. ప్రస్తుతం స్త్రీపర్యాయపదాలను పరామర్శిద్దాం.

నెలత :

నెలత, నెలతుక, మెలత, ఎలనాగశబ్దాలు ధ్వనిలోనేకాక అర్థంలోనూ సమానాలే. మూలభాషలోని ఇళం, ఎళం అనే శబ్దాలు లేత, చిన్న అనే అర్థాన్ని ఇచ్చేవి తెలుగుతనం తెచ్చుకొని (వర్ణ వ్యత్యయం కాగా) లే, లేత అని మారినవి. కొన్నిట 'ఎల' గానే నిలిచినవి. ఎలనాగ, ఎలమావి మొదలయినవి మనకు దృష్టాంతం. కాగా : నెలతను చిన్న ఆడుది, పసిది, బాలిక, కోమలి అనవచ్చు. నెలతశబ్దానికే బహువచన ప్రత్యయంలోని 'క'వర్ణం చేరగా 'నెలతక' అయి, పదాంత్య ఉకారప్రభావంతో 'నెలతుక' అయిందని మనం సరిపెట్టుకొనవచ్చు. లేమశబ్దానికూడ 'ఇళం' అనేదే మూలరూపం.

పొలతి :—

పొల,పొలసు శబ్దాలు అశుచి అనే అర్థంలోనూ, క్రమంగా మాంసానికీ(మాంసాన్ని అపవిత్రమని భావించినారుగనుక) తెనుగులో ప్రయుక్తం. ('పొలతుక కాంతియింత పొలివోవగ నీక' తిక్కనప్రయోగం.) కన్నడంలో పొలి, పొలెశబ్దాలు అశుచి, రజోరక్తం అనే

అర్థంలో వాడబడినవి. ఈలాటి అశుద్ధకార్యం చేసేవారు పొలసులు, పొలయతి-హొలయతి, పొలంతి, పొల యచ్చి-రజస్వల, మాదిగది, అశుచిఅయిన స్త్రీ.

పడతి :-

పడతి, మడంతి వివాహిత స్త్రీవాచకాలు. 'మణం' తమిళంలో వివాహార్థకం. ఈ 'మణం' వల్ల లభించిన స్త్రీ మడందై-మడంది క్రమంగా పడంతి, మడంతి మారింది. 'మణం' నుంచే మనువుకూడ పుట్టింది.

——

ఇక్ ధాతువు అందమూ, రుచీ ప్రకటించేది. ఇన్ పు=అందము. ఇంతి=సుందరి-ఇంపైనది.

ఈశబ్దంలోని 'లి' కూడ ఇల్లాలు మొదలయిన వాటిలోలాగనే 'ఆళ్' శబ్దభాగమనేది స్పష్టం. తొణ్, తొళ్ ధాతువు సేవార్థకంగా సమకాలిక తమిళ్ భాషలో కనిపిస్తున్నది. తొళ్ + ఆళ్=సేవిక, పరిచారిక అనే అర్థంలో వాడబడి క్రమంగా తొళ్ ఆళ్-తొళ్ యాళ్-తొయ్యలి అయివుండవచ్చునేమో!

నాతి, నాచి :—

నాయకస్త్రీ. ప్రాకృతంలో నాయకయిత్తి నాయకత్తి అయి, తవర్గం చవర్గం కావడం (దంపతీ,జంపతీ) సహజమేగనుక నాయకచ్చిగా మారి క్రమంగా నాచ్చి, మరల నాతి అయివుంటుంది. నంగనాచిశబ్దానికి మూలం 'నంగానాచ్' అనే హిందుస్తానీపదం కాదనుకుంటాను. దిసమొలగా నాట్యంచేసేంతటి సాహసికురాలని శ్రీ ప్రతాపరెడ్డిగారు సెలవిచ్చారు. కాని చేసేదంతా చేసి ఏమీ తెలీనట్లు అమాయికవలె ప్రవర్తించే ఆడది అనే అర్థమే లోకప్రసిద్ధం గనుక దీని మూలం వేరని నా ఊహ. నగ్నిక చిన్నపిల్ల-దిసమొలతో తిరిగేది. నగ్నికలాగ అమాయికంగా, నిష్కపటంగా ప్రవర్తిస్తున్నట్లు అభినయించే నాతి-నాయకుని స్త్రీ (చతురురాలు) నంగనాచి. నగ్నికాశబ్దం తమిళంలోని నంగై, మంగై, మడందై అనే అవస్థాత్రయం తెలిపే సంప్రదాయ వాక్యంనుంచికూడ పసిపాప అనే నిర్ధారితమవుతూంది. నంగై=నగ్నిక. దిసమొలతో తిరిగే పసిపాప. మంగై=అంతకంటే పెద్దది. మడందై=వివాహిత.

ప్రోయాలు :—

శ్రీమతి, ఐశ్వర్యవంతురాలు. పురళ్=ధనం + ఆళ్=పురళాళ్. క్రమంగా, కురళ్-క్రోవి, తొరవు-త్రోవ, పురవ్-ప్రోవి మొదలయినవాటిలోలాగ (వర్ణవ్యత్యయంతో) ప్రోయాళ్-ప్రోయాలు అయివుంటుంది ఈశబ్దంలోని లువర్ణం ఆళ్ శబ్దభాగమని చెప్పడం చర్వితచర్వణం.

'చేడియ' చేటికాశబ్దభవం. పరిచారిక అని అర్థం గనుక తిక్కనయినాసరే, ఎవరయినాసరే యిష్టంవచ్చినట్లు ప్రయోగించడానికి వీలులేదు. 'బోటి' వధూటిశబ్దం నుంచి వచ్చింది. 'బోటి' సామాన్యస్త్రీపర్యాయం కాదు పెరయింటినుంచి వచ్చిన స్త్రీ. కోడలు కావచ్చు, మరదలు కావచ్చు. 'చామ' శ్యామనుంచి పుట్టిన శబ్దం. 'చాన' జాణ-చతురురాలయిన స్త్రీ. జ్ఞానశబ్దం ప్రాకృతంలో నాణొ, జాణలుగా మారింది. జాణయే చాన.

చెలువ :—

సుందరి. చెలువు సౌందర్యం. సెల్వం తమిళ కన్నడాలలో సౌందర్యవాచకం. చెలువు, చెలువము గలది చెలువ.

వెలది, వెలందు, వెలంది. వెళ్ ధాతువునుంచి నిష్పన్నమయిన శబ్ద మిది. వెళ్-వెలుగు. కాంతి, తెలుపు. వెలంది=కాంతిగలది, సుందరి, గౌరి.

గరిత :—

గర్తి అని కన్నడరూపం. గృహస్త్రీ అనే శబ్దం ప్రాకృతంలో ఘరత్తి అయి, గరత్తి, గర్తి, గరితగా మారింది. గరిత=గృహిణి, ఇల్లు చక్కబెట్టుకొనగలది.

తెఱవ :—

ఈ పదం మన ప్రాచీనసాంఘికాచారాలకు సాక్షి. 'కన్యాశుల్కం' పాతపుంతల్లో నడచిందనడా

నికి నిదర్శనం. తెఱవ=శుల్కంతో కొన్న స్త్రీ. క్రింది జాతుల స్త్రీలు మారుమనువు చేసుకొనునప్పుడు కుల స్థులకు చెల్లించే దండుగ తెఱువు. కన్యకిచ్చే శుల్కమని కన్నడనిఘంటుకారులు. తెఱువు చెల్లించే ఆచారం ఆంధ్రదేశంలోని బళ్లారిజిల్లాలో యింకా పాతుకొనిఉంది.

## అన్న, అన్నవ :—

అన్నై అని తమిళంలో మాతృవాచకం. ప్రకృతం వ్యవహారంలోనూ ఉంది. భాష అభివృద్ధి కాని కాలంలో అనునాసికాలకు అట్టే భేదం లేకుండా వుండడం సహజం. పిల్లలు అమ్మ, అన్న శబ్దాలే మొదట పలుక నేరుస్తారు. ఈ రెండు అనునాసికాలకూ పరస్పరవినిమయం వాఙ్మయంలో ఉపలభ్యమవుతూంది. "లోకవంద్యయమ్మని నప్పరాశరు" అని భారతానుశాసనిక పర్వంలో తిక్కన ప్రయోగించినాడు. కాన అన్నై-అన్న-అన్నవ=అమ్మ.

## ఆఁడది, ఆఁటది :—

తమిళ, కన్నడ, మళయాళ, తుళుభాషలలో పురుషవాచకమయిన ఆణ్, ఆళ్ శబ్దాలకూ, తెలుగులోని స్త్రీవాచకమయిన ఆడశబ్దానికీ ఏమీ సంబంధం కనిపించదు. 'ఆఁడది'లోని అరసున్ననుబట్టి మనం ఆణ్ శబ్దంనుంచే యిది నిష్పన్నమయివుండవచ్చునని ఊహించవచ్చు.

ఆణ్ - ఆళ్ శబ్దం మనుష్యసామాన్యవాచకం, ఉభయలింగం. ఈశబ్దం మనిషి అనే అర్థంలో లింగభేదమేమీ లేకుండా పూర్వం ప్రయోగింపబడివుంటుంది. ఉదాహరణంగా ఇల్లాలు శబ్దాన్ని పరిశీలించండి. ఇల్=ఇంటిలోని, ఆళ్=మనిషి - ఇంటిని చక్కబెట్టే వ్యక్తి అని అర్థం. ఇల్లాలులోని ఇల్ శబ్దం క్రమంగా వాడుకలో లోపించి ఆలుశబ్దంమాత్రమే మిగిలినది. గృహిణీ వాచకంగా రూఢమయినది.

ఆళ్-ఆణ్ శబ్దం ఒకచోట ఆలుగా మారి మరొకచోట ఆణ్ణు అయి, పదాంత్యణకారం క్రమంగా 'ండు' అయింది. ఆండది, ఆంటది అనే రూపాలు ఇప్పటికిని దక్షిణదేశంలోని తెలుగువారి నిత్యవ్యవహృతాలు. పదాంత్యనకారం 'ండు'గా అయిన పరిణామం శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ 'సంధి' అనే పుస్తకంలో అవన్, రామన్ మొదలయిన శబ్దాల పదాంత్య నకారం అవండు, వాండు, రామండు అని ఎలా మారిందో నిరూపించడం పరిశీలిస్తే అవగతమవుతుంది.

పై శబ్దాల వ్యుత్పత్తిలోని దోసగులను తెలియ బరుప పాఠకలోకానికి మనవి. ప్రాచీనుల ప్రయోగ కాలానికే వాని సంకేతితార్థం సమసిపోయిం దనడమే నా అభిప్రాయం కాని, వారి ప్రయోగౌచితిని పూర్వపక్షం చేయడం కానేకాదు.



# తొలుకారుశోభ



శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

రాలిచిపోయె నీ పరిసరంబులలో నొక కొన్ని శుష్క-ప
త్రాలు సమీరనందనుడు రమ్యవనీస్థలమెల్ల పల్లవ
శ్రీలలితంబుగా ప్రకృతిరీతులు మారెడు, నే వినూత్నభా
వాలా స్పృశించు నాయెడద పైకొని యీ మధుమాసవేళలన్.

కడచిన వేదనాభరము కన్నుల నీరు దొలంచివైచి యీ
యెడ నెలమావిమోకపయి నింపుగ బాడెడి కోకిలంబుతో
విడువని నేస్తమున్ సలిపి విశ్వమనోహరగీతికావళిన్
దడుపుదు నాజగంబు, నొక తన్మయభావములో సుఖించుచున్.

ఈరమ్ముల్ కుసుమించె పాంథహృదయం బేకాగ్రతం జెంద, వి
స్తారంబౌ తొలుకారు మేఘముల నాచ్ఛాదించె వ్యోమమ్ము, హృ
ద్భారంబున్ దొలగించి యీ నవఋతుప్రారంభమున్ గాంచి నే
నారాధింతున—నా తపోగతులలో నానందమున్ బొందుచున్.

విరహములో కృశించి పలవించిన ప్రేయసియున్ ప్రియుండు మో
దరసవశాత్ములైరి, నడుదారుల సంఘటనంబు గూర్చు నీ
శ్వరుని కృతజ్ఞతాంజలుల భావన సేసి, వసంతదివ్యవై
ఖరు లిటు జూచి నామధురగానములో నిముసంబు బుత్తునా.



# అనంతామాత్యుని అమృతశైలి



శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

ఉత్తమపరిణతి నందిన హస్తమునకే గాని యుత్తమ శైలి యలవడదు. రచనావిధానమునఁ జక్కని మెలఁకువ లెఱిఁగి కవి యెంతపరిపాకము గాంచిన నంత సహజసుందరము, మృదుమధురము నగు శైలి యాతని హస్తమున కలవడును. శైలి విషయమున ననంతామాత్యుని భోజరాజీయ మొక విశిష్టస్థానము గడించుకొన్నది. దీనికిఁ గారణము చక్కని శైలికిఁ గావలసిన సద్గుణము లన్నియు నీ కృతియందుఁ దలదాఁగి యుండుటే. ఉత్తమశైలికిఁ గల ప్రధానగుణములను దలపోసి యాయాగుణములు భోజరాజీయమున కెంత శోభ నొనగూర్చినవో స్థాలీపులాకన్యాయమునఁ గనఁ గొందము.

సాధారణముగా గానమాధుర్యము, అర్థసౌలభ్యము, నవరసోచితపదప్రయోగము, సహజగాంభీర్యము, మార్దవము, ఔపదేశికసంపన్నత మున్నగునవి మన ముత్తమశైలికిఁ బ్రధానగుణము లని యంగీకరింపవచ్చును. వీనిని గ్రమముగాఁ బరిశీలింతము.

## గాన మాధుర్యము

పద్యమునకును, రాగమునకును సంబంధ మున్నదా యనుప్రశ్న ముదయించుటకే తావు లేదు. వాగర్థములకు, భార్యాభర్తలకు సంబంధము లేదని యంగీకరించిననాఁడు పద్యరాగములకు సంబంధము లేదని యంగీకరింపవచ్చును. ఛందశ్శాస్త్రముయొక్క ప్రధాన లక్ష్యములలో నిది యొక టగుటయే యందులకుఁ దార్కాణము. ఈ విషయ మనుభవయోగ్యమే కాని యనుటకు యోగ్యము కానిది. ఎంత నీరసమైన పద్యమైనను జక్కని రాగముతోఁ బాడిన నెంతవారినైన సమ్మోహితులఁ జేయుటఁ జాతుము. వేయేల, మన త్యాగరాజకీర్తనములే యిందులకు సాక్ష్యములు. సామాన్యములగు మాటలనే మంత్ర మొనరించి యుత్తమగానమున మేళవించుటచేతనే శిలలనైనఁ గరఁగించి భక్తహృదయములతోపాటు భగవంతుని హృదయమును గూడ శ్రీ త్యాగరాజస్వామి వశపఱచుకొనలేదా! మన తెలుఁగు పలుకులలో నీగానలహరి యంతర్వ్యాప్తమై యున్నది. అది జాణ యగు కవిచేత నెల్లరకు హృదయగ్రాహియై మాధుర్యము నించుచున్నది. ఈ గుణము భోజరాజీయమునఁ గల దనుటకు రెండుమూఁ డుదాహరణములు మాత్రము చూచి ముందుగుణముఁ జర్చింతము:

"చిగురుటాకులలోని జిగి గూర్చి యాబాల
యఱకాళ్లఁ జేతుల నలఁది రొక్కొ
పసిఁడితీఁగెలమీఁది ప్రభ దెచ్చి యాకాంత
మెయిదీఁగె యంతట మేది రొక్కొ
చంద్రబింబము కాంతి పవరించి యాలేమ
మోమున ననుపుగాఁ దోమిరొక్కొ
క్రొమ్మెఱుంగుల మించు గొనివచ్చి యాయింతి
కలికికన్నులఁ గీలుకొలిపిరొక్కొ...

"ఆమదిరాక్షి నేత్రరుచు లావనజావన ముద్దుగవ్వలా
భామిని మందమందస్మృతు భాషితరీతులు డెందమందఁ బే
రామనియై తనర్చుటయు..."

"ఆలోలమందానిలాధూత లతమాడ్కి ..."

ఆయా తావులయం దొక్క సునిశితమగు గానమాధుర్య ముండుటచేఁ జదువరులకుఁ బద్యపఠనమున నాసక్తి యినుమడించుచుండును.

## అర్థ సౌలభ్యము

అర్థసౌలభ్య మను గుణ మిందుఁ గలదనుటకుఁ గావ్యమంతయుఁ దార్కాణముగాఁ జూపవచ్చును. అన్వయక్లిష్టత లేక పాఠకునకుఁ జదివినంతనే పద

మునోఁ బా టర్థము వెంటనే స్ఫురించుటయే యర్థసౌలభ్యము. ఈగుణము నీక్రిందిపద్యములఁ జక్కఁగాఁ గననగును :

"కావున నిన్నుఁ జూచి కడఁ
గంటిమి మా దురితాబ్ధి కంచు సం
భావనచేసి యావనిత
భర్తయుఁ దాను నిషిద్ధభావముల్
పోవఁగఁ ద్రోచి శుద్ధమగు
పూర్వపు మేనులు దాల్చి సెమ్మదిం
బోవఁగ విప్రకాంతయును
బోయె నకల్మషవృత్తి నింటికిన్."

"చెప్పఁగఁ జూచి సిగ్గువడుఁ
జెప్పఁగఁ; జెప్పకయున్నఁ దీర, దేఁ
జెప్పెదఁగాక; యంచుఁ దెగి
చెప్పఁదలంచు; నిదేమి మాటగాఁ
జెప్పుదుఁ? జెప్పినం బతియుఁ
జిత్తమునం గలుషించునో పరుల్
చెప్పెడు వార్త కాదనుచుఁ
జెప్పఁగఁబూనును జెప్పఁగా దనున్."

"కన్నకడుపుగానఁ, గడుఁ బిన్నగాన, నే
నతనిఁ బాసి దూరమరుగునట్టి
వేళగాన, వాని వీక్షించిరాకున్న
వలపుమాన దనిన వదలనైతి."

ఇట్టి సులభమగు రచన పరిణతహస్తునకే కాని సామాన్యునకు సాధ్యముకాదు. పెద్దల సూక్తులు సూత్రప్రాయములు, విస్పష్టార్థద్యోతకములు, అక్లిష్టములు; అందువలననే మధురములు. ఈ కృతియంతయు నిట్లుండుట విశేషములకెల్ల విశేషము.

## నవరసోచిత పదప్రయోగము

రసోచితము లగు పదములు కావ్యదేహమునకుఁ బ్రాణవాయువులు. భోజరాజీయమున నవరసవర్ణనములు నాయాతావుల నుచితపదజాలములతో విరాజిల్లుచుండుట యనంతామాత్యుని శైలి కమృతత్వ మాపాదించె ననుటలో సందేహము లేదు. శృంగారరసోచితమగు పదజాలముతోడి యీక్రిందివర్ణనఁ గనుఁడు :

"పుష్పచాపముక్తమై చనుదెంచునట్టి మో
హనసాయకంబో యీ వనజగంధి
హరుజూటమున నుండి యరుగుదెంచిన యట్టి
చంద్రబింబమొకో యీ జలజనయన
యంబరస్థలినుండి యరుగుదెంచినయట్టి
క్రొమ్మెఱుంగొకొ యీ కోమలాంగి
యుద్యానతరులలో నుండి వచ్చినయట్టి
యెలదీఁగయొకొ యీ యిగురుబోఁడి
యనఁగ నత్యంతసౌకుమార్యమునఁ బేర్చి
చిత్తమున కింపునించు నచ్చెలువఁ జూచి."

ఆచెలి సౌకుమార్యము మన కేలకాని యీ పదసౌకుమార్యముమాత్రము మనలను సమ్మోహితులఁ జేయుచున్నదికదా!

కరుణరసోచితమగు నీక్రిందిపద్యము ఱాతినైనఁ గరఁగించుఁగదా!

"పిడుగు గడచినక్రియ నీమెం
బొడిచినగతి గుండె పగిలి భూస్థలిమీఁదన్
బడి పొరలుఁ దన్నుఁ దాను ను
గ్గడువుగఁ గన్నీరు నించు గడగడ వడఁకున్."
"బే యనుఁ దల్లీ నీ వెట
పోయెద వను నన్నుఁ డించి పులివాతఁ బడన్
బోయెదవే యనుఁ జెల్లం
బోయను నింకేటి బ్రతుకు పో నాకు ననున్."

ఇందలి 'బే' 'పో' యను పదములు కరుణరసస్ఫోరకములు. ఇట్లే యితరములగు బీభత్స, భయానక, వీర, హాస్య, రౌద్రాద్భుతశాంతరసములను వర్ణించు సందర్భముల నాయాతావుల నాయారసములు సుస్పష్టముగా ద్యోతకము లగుచుండును.

"స్రుక్కిన యంగుళములు దళి
మెక్కిన దేహమును గాంతియెడలిన మొగమున్
మక్కిన చెవులును ముడిఁగిన
ముక్కునునై వచ్చుచుహాఁడు ముద్దియఁ గనియెన్"

అనుచోట బీభత్సమును,

"వచ్చిన నమ్మహాత్ముఁడును
వావిరిఁ దత్తరుశాఖ డిగ్గి వే

వచ్చి నృపాత్మజుం గదిసి
    వాని శిరోరుహరాశి యొక్కచేఁ
జెచ్చెరఁ జుట్టి పట్టి యొక
    చో మొగమెత్తి గళంబుచాయకున్
దెచ్చి మొగంబు దంష్ట్రికలు
    దీటుచు నుత్కటసంభ్రమంబునన్."

అనుచో భయానకరసమును,

"...ఆకుక్కుమారకంఠీరవుం డకుంఠితసత్త్వంబున...సత్త్వహీనంబగు మూషకంబు నెగురవైచి యాడు మార్జాలంబునుం బోలెఁ గొంతతడవు వీరవినోదంబు సలిపి యధికరోషంబున నాదోషకారిం గడకొలువట్టి ఖేచరప్రీతిగా బలిసెవైచు చొప్పునం ద్రిప్పి..."

మున్నగు తావుల వీరరసంబును,

"చంపంగవచ్చిన జమునిదూతలకు లం
    చము పెట్టి వచ్చెనో చావు నోల్లఁ
బొమ్మని మోఱకంబునఁ ద్రోచి వచ్చెనో
    యింటివారికిఁ జెప్ప కిచటఁ జచ్చి
నట్లైనఁ గోపింతురని చెప్పవచ్చెనో..."
    మున్నగుచోట్ల హాస్యరసమును,

"చెలఁగి కాల్ద్రివ్విన నిలవ్రక్కలై భుజం
    గమరాజుతలల రత్నములు దోఁప
వెస అంకెవైచిన వసుధాధరేంద్రగ
    హ్వరముల హరులు బిట్టదరి పడఁగఁ
గొమ్ములఁ గోరాడి చిమ్ముచో నెగసిన
    ఘనగండశిలలు మేఘములు దాఁకఁ
జీఁదఱగొని పాఱుచోఁ దరుశ్రేణులు
    దుర్వాతహతిఁబోలెఁ దుమురుగాఁగ."

ఇత్యాదితావుల రౌద్రరసమును,

"తెరు విమ్మని యటు లడుగుము
సరభసగతి నుదక మిరుదెసలఁ బాయఁ గడుం
బరువునఁ బోవఁగనయ్యెడుఁ
దరుణీ యరుగు మఱకాలు తడిగాకుండన్.
అనిన వసిష్ఠుఁడు మున్న
ట్లనుటకుఁ దోడిదియు నొక్క యాశ్చర్యము పా
మ్మని తలఁచుచు గౌతమికిం
జని యట్టుల పల్క నది వెసం దెరు విచ్చెన్."

అనుచో నద్భుతరసమును,

"ఇవ్విధమున శోకింపఁగ
నవ్వత్సశిరంబుమీఁద నానన మిడి నీ
వెవ్వరికిఁ గాఁగ వగచెద
విప్పాపని జాలిపడఁగ నేటికిఁ బుత్త్రీ.
"పుట్టిన పిమ్మటఁ జావును
గట్టి వృథామరణ మొందుకంటె బుధులకున్
దట్టమగు కీర్తి సుకృతము
లిట్టలముగఁ గల్గు చావు లింపులు గావే."

మున్నగుతావుల గోమాత పులివాఁతఁ బడుటకై పుత్త్రి నొప్పించి పోవుసమయమున శాంతరసమును సార్థక పదజాలముతోఁ జక్కఁగ నొప్పారియున్నది.

## సహజ గాంభీర్యము

సహజ గంభీరమగు శైలి యలవడుట కవిపూర్వ పుణ్యవశముననే కాని యలవఱచుకొందమన్న నలవడునది కాదు. ఈ సుగుణ మున్న దనుటకు నిదర్శనము పద్యములలోఁ గుంటినడక కాని, వ్యర్థపదములుగాని పాదపూరకములై యుండక యొకే ప్రవాహముగాఁ బద్యమంతయు నడచునే. ఇందుల కుదాహరణముగా రెండు మూఁడు పద్యముల గమనించినఁ జాలును.

"మమకారంబు నహంకా
రము సంసారానుబంధరజ్జువు లనిచి
త్తముల వివర్జింతురు సం
యము లీవును నడుపుమా తదాచారంబున్.
ఆడకు మసత్యభాషలు
గూడకు కొఱగానివానిఁ గొంకక యొరు లె
గ్గాడిన నెదురుత్తర మీఁ
జూడకు విని విననివాని చొప్పునఁ జనుమీ.
చులుకన జలరుహజంతువు
చులుకన తృణకణము దూది చుల్కనసుమీ
యిల నెగయు ధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుఁడు కుమారా!"

ఇట్లే కృతి యామూలాగ్రముగా సహజ గంభీర శైలికి నిలయమై యున్నది.

## మా ర్ద వ ము

ఇఁక మార్దవ మను సుగుణ మెట్లొప్పినదో చూతము. కవి తా నేరికొను పదములు సుమసదృశములై యుండునట్లు చూచుకొనును. నిఘంటువుఁ జూచుకొన్న నర్థము సరిపడునుగదా యన్న సంతృప్తితో సత్కవి యే పదమును వాడఁడు. మాధుర్యమునకుఁ దోడు మృదుపదజాలముఁ గవి యెన్ని యొక సుమహారమువలెఁ గావ్యహారమును నిర్మించును. అనంతామాత్యుని మార్దవగుణమున కీ క్రింది పద్యము లెట్టి చక్కని తార్కాణలో పరికింపుఁడు.

"తావిగొనని పుష్పదామంబు విధమునఁ
జిదుమఁబడని మావిచిగురు భంగిఁ
ద్రావఁబడని నవసుధాధారపగిదిని
జెలువఁ జూడ సురతచిహ్న లేదు."

"పెదవులు గదలెం గదలవు
రదనంబులు గానవచ్చె రా వనుపాటిన్
మృదువచనరచన లెసఁగఁగ
ముదిత యతని హృదయకమలముం గరఁగించెన్."

"జపములకుఁ జొరక మఱి తపములకుఁ జనక మదిఁ
గపటములు విడిచి నినుఁ గృపణులయి వేఁడన్
విపులతరమగు పరమకృప చిగురు నిగుడఁ బెఱ
నెపములకుఁ దొడిపఱవ కపుడు నిజరూపం
బుపమలకు మిగిలి యతినిపుణగతిఁ బొరలు మృదు
లపితముల నెసఁగ నధికపుమహిమ చూపన్
సుపథ మగు సుగతి గని యపగతదురితు లగుదు
రపరిమితవిధములను ద్రిపురదనుజారీ."

ఇట్టి మృదువచనములచేతనే పైపద్యమున ముదిత పతిహృదయమును, దుదిపద్యమున భక్తుఁడు భగవంతుని హృదయమును గరఁగించి వశపఱచుకొనుట వర్ణించి యనంతామాత్యుఁ డాకారణముననే పాఠకహృదయముల నపహరించియున్నాఁడు.

## ఔ దే శి క సం ప న్న త

ఋషి యగువాఁడే కవి యగును. ఆతని ప్రధాన లక్ష్యము శాస్త్రములలో విధిరూపముననుండి భీతిని గలిగించు పరమధర్మములను దాను కాంతాసమ్మితము చేసి మృదుమధురముగఁ జెప్పి పాఠకులను సన్మార్గమునకుఁ ద్రిప్పఁజూచును. ఈ శక్తి మానవాతీతము. విషయము ప్రాఁతదే యైనను జెప్పువానికిఁ గల యీ శక్తి కతముననే యది మహామంత్రమై పలువుర కాదర్శప్రాయమగును. ఈవిషయమున ననంతామాత్యుని దండ వేసిన చేయియే. ఈ విషయమునను రెండు మూఁడు పట్టులే పరికించి యనంతామాత్యుని యతిశయనిపుణత కానందింతము.

పావకరోముఁడును, సోదరియు నొకే గురువు నొద్ద కావ్యనాటకాదు లభ్యసించుచున్న దినములలో నొకనాఁడు పావకరోముని సోదరిని:

"గురుతనూజుండు మనమునఁ గోర్కె నిగుడఁ
దోడిశిష్యుల నందఱ వీడుకొల్పి
వనిత నేకాంతమందిరంబునకుఁ దెచ్చి
కదియవచ్చిన నది వాని కళ లెఱింగి"

యిట్లు బోధించినది.

"ఇటు తగునయ్య విప్రుఁడవు
విహీనగుణాఢ్యుఁడ వీవు నీకు నే
మిటి కిటువంటి దౌష్ట్యము
శమించుమనె మజ్జనకుండు విన్నఁ ద
క్కటి జను లేమి యం్రదు
మదిఁ గాంక్షయె గల్గిన నగ్నిసాక్షిగాఁ
జిటికెన వట్టి కాక
వృథ సేయుట ధర్మమె కన్యకాత్వమున్?

పడఁతికిఁ గన్యాధర్మం
బెడలినఁ గొఱ యగునె వెండి యెవ్వరికైనం
గడివోయిన పుష్పంబు మఱి
ముడుచునె రసికుఁ డగువాఁ డమోఘవిచారా!"

ఇట్టి బోధనముచేతనే పిమ్మట నాతని హృదయము పవిత్రమై యీమెను మాతృభావముతో సంస్తుతించినాఁడు. ఈమెయే మహాక్రూరరాక్షసుని హృదయమును దన సత్యవాక్పరిపాలనముచే మార్చివైచి యాతని కిట్లుపదేశించినది:

"బొంకకు మెన్నఁడున్ దనుజపుంగవ
శాంతివహించియుండు మే

పంకను జీవబాధ లనువాని నొనర్పకు
శౌచివై గతా
హంకరణుండవై ఘనదయామతివై
విజితేంద్రియుండవై
పంకజనాభ దివ్యపదపంకజ
భక్తి పరాయణుండవై."

తన సత్యవాక్పరిపాలనమునఁ బులి కాహార ముగాఁ బోవు గోవు తన వత్సము నెట్లు బోధించి బుజ్జగించుచున్నదో కనుఁడు.

"నిన్నుఁ గని యిన్ని దినములు
చన్నిచ్చితి నేను ఋణవశంబున నిఁక నీ
వెన్నఁడు నన్నుఁ దలంపకు
మన్న మమత్వంబు విడువుమన్న మనమునన్...
"ఒంటిఁ జరింపకు పొలముల
నింటికిఁ గడు ప్రొద్దుగలుగ నేతెంచుచు రా
వెంటఁబడి పొదుచు గోవుల
చంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్.
"చులుకన జలరుహ జంతువు
చులుకన తృణకణము మీది చుల్కనసుమ్మీ
యిల నెగయు ధూళి చుల్కన
చులుకన మఱి తల్లి లేని సుతుఁడు కుమారా.
కావున నిట్టి లాఘవము గానుపకుండఁ
బ్రభుత్వతాగుణ
శ్రీ వెలయంగ సజ్జనులఁ జెంది
తదీయహితోపదేశముల్
నీవిమలాంతరంగమున నిల్పుము గాని
నిరర్గళోక్తికిం
బోవకుమయ్య దుర్గములఁ బొందకుమయ్య
వివేకహీనతన్."

ఈ విధముగా సందర్భోచితముగ సహృదయ హృదయ రంజకముగా నాయా సుగుణముల నలవఱచుకొన్న యనంతామాత్యుని యమృతహస్త మమృత శైలినే ప్రవర్తించినది. ఇంకను నాయాపట్టులఁ గల సంభాషణ చాతుర్యము, హితోపదేశము, ధర్మబోధ హృదయంగమముగా పలితల నోలలాడించుచుండును. ఇట్లనంతామాత్యుఁడు సులభ సుందరమగు భాషలో సుజన స్తవనీయమగు భోజరాజీయము నాంధ్ర భాష కొసఁగి చిరస్థాయి యైనాఁడు. పసిబిడ్డలకైన నర్థమగు నీతని మృదుమధుర భాషయు, నాతని రచనా విధానము నెల్లరకు నాదర్శప్రాయము లనుటలో సందేహము లేదు.

# ఆడవే పురివిచ్చి ఆడవే నెమలి!

"సంప

ఆడవే పురివిచ్చి ఆడవే నెమలీ,
వాడిపోయిన మనసు వీడి వెన్నెల గాయ-
ఏడాదిగా నీవు ఎదురుచూచిన మొగిలు
కొండదరిలో తాను గొడుగల్లె వాలింది-
ఏ చెట్టు, ఏ గుట్ట, ఏది చూచినగాని
కనుమూసుకొని లోన కలలు కంటున్నాయి-
ఎలుగిచ్చి, తలకుచ్చు ఎత్తి చూశావంటె
పులకించి, పన్నీరు చిలకరించును మబ్బు
నీరనేసరికల్ల నోరు తెరిచే భూమి
తీరుగా నాగుండె తెరచి నుంచున్నాను.

# కృష్ణలీల

లీలాశుకుని కృష్ణకర్ణామృతములోని యొక శ్లోక మిది:—

"కృష్ణేనాంబ! గతేన రన్తు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
సత్యం కృష్ణ!, క ఏవ మాహ? ముసలీ, మిథ్యాఽమ్బ పశ్యాననమ్,
వ్యాధేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వా సమస్తం జగత్
మాతా యస్య జగామ విస్మయపదం కృష్ణ స్స పుష్ణాతు నః"

ఇందు 'అమ్మా! కృష్ణుఁ డాటకు వచ్చి మన్ను తిన్నాఁడమ్మా' యని బలరాముఁడు యశోదతో చెప్పినంతనే ఆమె వెంటనే 'నిజమేనా కృష్ణా!' యని యడుగుటనుబట్టి కృష్ణుఁడు దగ్గఱ నుండఁగానే బలరాముఁడు చెప్పినట్లు స్పష్టమగును. అపుడు కృష్ణుఁడు 'నీ కెవరు చెప్పినారమ్మా' యని యడుగుటయు, 'బలరాముఁడు చెప్పినాఁ'డని యామె బదులాడుటయు సుసంగతములు కాఁజాలవు. అందుచే బలరాముఁడు ఫిర్యాదు చేసిన కొంతసేపటికి కృష్ణుఁ డింటికి వచ్చినట్లును, అపుడు "మన్ను తిన్నా వఁట నిజమేనా కృష్ణా!" అని తల్లి యడిగినట్లును అధ్యాహార్యము చేర్చి సమన్వయించుకొనవలసి యున్నది. అట్లర్థస్ఫూర్తి యగునట్లు పై శ్లోక మా ముగ్గురి మాటలలో ననువదింపఁబడినది. ఈ క్రింది మాటలు సంధులు కలిపి చదివినచో సీసపద్య మగును:—

బల—అమ్మోయి! కృష్ణుఁడేం!! ఆడుతూ మన్ను తిన్నాఁడు—
యశో—ఏమిటే? ఏఁడి వాఁడు? రాని!

... ... ...

యశో—ఏమిరా కృష్ణ! మ న్నెందుకు తిన్నావు? చెప్పవేం?
కృ—ఎవ రమ్మ చెప్పినారు?
యశో—రాముఁడన్నయ్య.
కృ—అయ్యో! మన్ను తిన్నాన? అది యబద్ధము, చూడవమ్మ నోరు.
యశో—తెఱవరా నోరు!
కృ—సందేహము తీర్చుకో, తెఱచుచున్నా

నని తెఱచిపట్టి, తన ముఖంబున జగ మెల్ల కనిన తల్లి-కద్భుతానందములు గూర్చినట్టి యఖిల-భువన గర్భుండు పద్మనాభుండు లోక-కారణుం డగు కృష్ణుండు గాచు మనల.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి.






# పాండియన్

## ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

(ఇండియాలో స్థాపితము)

ఉన్నత సేవచేయుచున్నది

**అగ్ని, మోటారు, ప్రమాదములు**

మొదలగు భీమాలను నిర్వహించును

**మొత్తం ఆస్తులు రూ. 62,00,000 దాటినవి.**

హెడ్డాఫీసు :

**మధుర**

బ్రాంచీలు :

**బొంబాయి, అహమ్మదాబాద్**
**కలకత్తా, రావల్‌పిండి.**

ప్రిన్సిపల్ ఏజంట్లు :

**మెసర్సు ఏ. & ఎఫ్. హార్వీ లిమిటెడ్.**
**మధుర వగైరా.**

**మెసర్సు కే. ఎం. ఎస్. లక్ష్మణయ్యర్ అండ్ సన్సు,**
మధుర, తిండివనం, మద్రాసు, నగరి, బెజవాడ,

కాకినాడ, విజయనగరం సిటీ.

రిజిస్టరు చేయబడి    సర్టిఫికెట్లు పొందిన

# పాలసుగంధిలేహ్యం

ఇది రక్తశుద్ధిచేయు అనేకమూలికలతో తయారుచేయబడినది. స,వా మేహములు, మేహపొడలు, మచ్చలు, కురుపులు, చర్మవ్యాధులు, కుష్ఠు, మలబద్ధము, కీళ్లవాపులు మొదలగు అనేకవిధములగు వ్యాధులను ఖండించుటలో అద్భుతమైనది. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు. 2-0-0.
పోస్టేజి ప్రత్యేకము.

## పి. సి. ఏ. అండ్ కంపెని,

పెరిదేపి, (నెల్లూరు జిల్లా).

మదరాసు బ్రాంచి:
7. సీనుమొదలి వీధి. (మిద్దెమీద)
వెలెకు టాకీస్ ఎదురుగా, జార్జిటవున్.





# కాశ్లీర్

అన్నివిధములగు దగ్గులు, ఉబ్బసము, ఆయాసము మొదలగు శ్లేష్మవ్యాధులకు అమోఘమైనది. సీసా రు.1-12-0. అన్ని మందుల షాపులలో అమ్మబడును.

## గిరిజా అండ్ కో,

దానవాయిపేట, రాజమండ్రి.

మద్రాసుస్టాకిస్టులు: జె. బాలాభాయి & కో,
చెనాబజార్ రోడ్.



గాలియాత గ్రంథకర్తగారి

# దివ్య చూర్ణాలు

**మొండి వ్యాధులను ఖండించును.**

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబుల్‌కలాంఅజాద్, ప్రభృతుల యెదుట రాంఘరు కాంగ్రెసులో నీటిలో యీదినట్లు గాలిలోకూడా యీదవచ్చునని రుజువు చేసినట్టియు, సర్. రాధాకృష్ణ మొదలగు వారిచే కొనియాడబడిన "గాలియాత" గ్రంథమును రచించిన యోగిగారిచే యోగశాస్త్ర రీత్యా తయారుచేయబడినవి.

ప్రాచీన యోగీశ్వరులు వ్యాధి నివారణమునకు, నిత్య యౌవనమునకు, పూర్ణాయుర్దాయమునకు వాడుచూ వచ్చినట్టివియు, మానవదేహమునకు అత్యావసరమైనట్టివియు, సులభముగా జీర్ణమగునట్టివియునైన, అత్యధిక పోషక పదార్థములతో నిండియున్న ఔషధ రాజములు.

## యోగి, యస్. వి. ఆచార్య,

సింగరాయకొండ (నెల్లూరు జిల్లా).

M. S. M. Ry.


# సాహిత్యమునందు పోటీలు

1947 జులై, 19, 20, 21 తేదీలలో జరుపబడు **శ్రీ తిక్కన జయంతి** ఉత్సవముల సందర్భమున **వక్తృత్వం, వ్యాసరచన, చిన్నకథలు,** ఈ మూడింటిలో పోటీలు జరుపబడును. నియమాది వివరములకై కార్యదర్శి, శ్రీతిక్కన విద్యాలయము, పాత గుంటూరు, గుంటూరు, అని వ్రాయవలయును.




[క థా ని క]

*

= శ్రీ పద్మరాజు

కొత్త ఇంటికి గోడలు పూర్తిగా లేచాయి. దూలాలు పరిచేసి ఎక్కిస్తున్నారు. ఒక పక్క పెద్ద పందిరికింద పెద్దగొయ్యి తవ్వి కఱ్ఱ కోస్తున్నారు. కొంత మంది కూలివాళ్లు ఇటుకలు మోస్తున్నారు. కొంతమంది బొందడి మోస్తున్నారు.

ఇన్ని పనులమీద దృష్టినిలిపి చూడలేక సుబ్బారావుకి నీరసం వొస్తుంది. ఇంత మంది కూలివాళ్ళలో ఎవడు బద్ధకిస్తున్నాడో కనిపెట్టడం ఎంత కష్టం! ఒక కూలివాడు తట్ట కిందబెట్టి చెట్టుకి చేరబడి చుట్ట వెలిగిస్తాడు. సుబ్బారావుకి ఆ సమయంలో చాలా కోపం వస్తుంది. కాని అతను ఏదో అందా మనుకునేసరికి కూలివాడు తట్ట తీసుకొని మళ్ళీ బయలుదేరుతాడు. తీరా తట్టతీసుకు నడుస్తుంటే వాడు పని చేస్తున్నట్టేగా? అంచేత సుబ్బారావు వాడిని ఏమీ అనలేక పోతాడు. కూలివాడు పైగా అతనివేపుచూచి చిరునవ్వునవ్వుతాడు.

సుబ్బారావుకి పదిహేను సంవత్సరాలు. మేనమామ గారి ఇంట్లోవుండి చదువుకుంటున్నాడు. అతని మేనమామపేరు రామశాస్త్రి. కట్టే కొత్త ఇల్లు రామశాస్త్రిది. అతను సుబ్బారావుని పిలిచి ఒకనాడు అన్నాడు:

"ఒరే సుబ్బన్నా! నువ్వు ఈ శలవలకి ఇంటికి ఎందుకు పోవడం? నీకు సంగతులన్నీ బాగా తెలుస్తాయి. మన కొత్త ఇంటి దగ్గరకు పోయి కనిపెట్టి చూస్తుండు. ఇటువంటి వన్నీ నేర్చుకోవాలి. ఒరేయి, ఆ కూలివాళ్లు దొంగవెధవలుసుమా! జాగ్రత్తగా కనిపెట్టి చూస్తుండాలి. బోలెడంత యినపసామాను, కఱ్ఱ ఉంది. ప్రతీరోజూ లెక్క వేస్తుండు సామాను. చెప్పడం మరిచిపోయాను. ఆ రంగయ్యా వొట్టి బద్ధకస్తుడు. వాడిని పొడుస్తుండాలి."

కాని సుబ్బారావుకి రంగయ్యని చూస్తే అమిత భయం.

రంగయ్యా ఎప్పుడోకాని పనిచెయ్యడు. ఊరికే చుట్టకాలుస్తూ తిరుగుతుంటాడు. మెలి తిరిగిన మీసాలు, ఎఱ్ఱటి కొంటెకళ్లు—అతన్ని చూస్తూ లొంగదీయలేరు. అతను తిరుగుతూ కబుర్లు చెప్తుకుంటాడు. పనివాళ్ళు విని నవ్వుకుంటారు. ఆ నవ్వులలో కొంతసేపు పని ఆగిపోతుంది.

సుబ్బారావుకి పనిచేసినదానికంటే నవ్వడంలోనే ఎక్కువకాలం వినియోగపడుతున్నట్టు అనుమానం. అంచేత అతను ఒకనాడు ధైర్యంచేసి రంగయ్యవద్దరకు వెళ్ళి సగం జంకుతూనే అన్నాడు:

"రంగయ్యా! నువ్వు బొత్తిగా పనిచెయ్యడం లేదు. మామయ్యతో చెపుతాను."

రంగయ్యా విరగబడినవ్వాడు. పక్కని ఉన్న ఒక పెద్ద దూలంమీద కూర్చుని చుట్టకసి రాల్చాడు.

"ఇలా రా పంతులూ! కూకో. సూశా! మేస్త్రీ అంటే ఏటనుకుంటన్నా? కూలోళ్ళశాత పని సేయించాలన్నమాట. ఇల్లా వొచ్చి కూకో. కాళ్లు లాగుతయి."

సుబ్బారావుకి లోపల-చాలా అసహనంగా ఉంది గాని ఏమీ అనలేకపోయాడు. దూలంమీద కూర్చుని ఈ పని విషయంలో నిబంధన లేమిటోనని ఆలోచిస్తున్నాడు. రంగయ్యా ఏవో చెపుతున్నాడు. కూలీలు వింటున్నారు సరదాగా.

రంగయ్యా నలభయి సంవత్సరాల నల్లటి మనిషి. అతను పుట్టుకతోటే సోమరిగా పుట్టి వుంటాడు. కబుర్లలో అతన్ని కాదనగలవాడెవడూ అతనికి ఇంత వరకూ తగలలేదు. అతనికి పని అప్పగించేవారందరూ

అతన్ని ఎరుగుండే అప్పగిస్తారు. అతను పని చెయ్యడం లేదని ఎదురుగుండావచ్చి ఎవరూ అనగలేరు. అతను నిజానికి అంత మోటుమనిషీ కాడు. మాటకి మాట ఫెడేమని అంటాడు. అంచేత అతనంటే అందరికీ జంకు.

ఒకనాడు పొద్దున్న సుబ్బారావు పెద్ద గొడవ చేశాడు. మేకులబుట్టలో రెండు మరమేకుల పొట్లాలు పోయాయి. కూలీలంతా అతనిమీద జాలి దలిచినట్టు చుట్టూచేరి చూస్తున్నారు. అతను ఏం చెయ్యడానికీ తోచని గొంతుకలో అంటున్నాడు:

"చెప్పండి, ఎవరు తీశారో. మా మామయ్యతో చెప్పుతాను లేకపోతే"

ఇంతలో రంగయ్య వచ్చాడు. "పొంద్రా పని లోకి. అల్లా సూత్తారేటి?...ఏం పంతులూ?"

"మరమేకుల పొట్లాలు రెండు పోయాయి."

రంగయ్య చుట్ట కొస పంటితో కొరుకుతూ అన్నాడు: "అంతేగందా. రెండేనా? పోతే పోనాయిలే యెంకన్నగారిల్లు కట్టేటప్పుడు దూలాలు దూలాలే పోనయి"

"మా మామయ్యతో చెప్తాను"

"చెప్పు......చెప్పేం లాబం?"

"ఎవరు తీశారో చెప్పడం లేదు"

"ఏం గాపకంవుంటదీ? నిన్న రేత్రి ఏ కల్లుపాక లోకో పోయుంటయి. ఎవడికి గుర్తుంటది?"

"అల్లా దొంగతనంగా పట్టుకుపోతే ఎల్లాగమరి?"

"తమ్ముడూ, నువ్వు దొంగతన మంటున్నావా? నిజంగా దొంగతనం కాదు. మీ మామ ఎంత దొంగో నీకు తెల్చా? వొడ్డీలమీదవొడ్డీలు కూడేసి ఎన్ని కొంపలు మట్టం చేశాడు మరి? పోనీ, ఈళ్ళకి రోజుకి రూపాయన్నా లేకపోతే తాగుడుకీ తిండికీ ఎల్లా సరిపోద్ది?"

"అందుకోసం దొంగతనం చేసారా?"

"మళ్లీ దొంగతన మంటావేంటి? సూశా! సందేల అలిసిపోయి దావతగా కుంటది. సేతులో మీ మామ డమ్మిడీ పెట్టడు. ఏదో సేతికొచ్చింది పట్టుకుపోకపోతే సత్తారా? నువ్వే చెప్పు. ఏమంటా?"

సుబ్బారావు మాట్లాడలేదు. ఇంత దొంగముండావాడు ఈలోకంలో ఇంకొకడు ఉండడనుకున్నాడు. కాని రంగయ్యనిచూస్తే అతనికి లోపల ఏదో ఆందోళన కలుగుతుంది.

"సూడు తమ్ముడూ! మీమామతో ఇట్టాంటివన్నీ సెప్పి ఏం లాబం? పోయిన సరుకు ఎల్లాగా రాదు. పైగా ఎందుకు పోయిందని నిన్నే తంతాడు. మీమామ మంచోడు గాడు"

రంగయ్య లేచి కూలివాళ్ళని హెచ్చరించడానికి వెళ్ళాడు.

సుబ్బారావు "ఈ విషయాన్ని మేనమామకు చెప్పాలా? అక్కరలేదా" అని చాలాసేపు తర్కించుకున్నాడు. అతని మనసు ఏ నిశ్చయానికి రాలేదు.

ఇల్లా రెండురోజులు గడిచిపోయింది. రెండు రోజులు గడిచిన తరువాత విషయం పాతబడిపోయింది. ఇప్పుడింక చెప్పడంలో అర్థంలేదని సుబ్బారావు మాట్లాడక ఊరుకున్నాడు.

ఆవేళ ఎండ తీవ్రంగా ఉంది. పని కొంచెం ఇంచుమించుగా సాగటం లేదు. గోడలమీద లేచిన వాసాలు ఇంటి అస్థిపంజరంలాగ ఉన్నాయి. సుబ్బారావు కునికిపాట్లు పడుతూ పెద్ద చింతచెట్టు కింద తాటాకు చాప పరుచుకుని పడుకున్నాడు. సగం మగతలో అనేక దృశ్యాలు అతని మనస్సులోనించి నడిచి పోతున్నాయి. ఈ కూలి పనివాళ్లు, వాళ్ళమీద ఈ రంగయ్య, మామయ్య, యిల్లు, దూలాలు, వాసాలు— ఇవన్నీ అతని మనస్సులో గాబరా చేసున్నాయి. ఇవన్నీ ఉన్న లోకంలో తనబోటి అమాయకులు నివసించడానికి వీలున్నట్టు అతనికి తోచలేదు.

రంగయ్యని ఏరకంగా అర్థంచేసుకోవాలో అతనికి ఎంత ఆలోచించినా తెగలేదు. అతన్ని చూసినప్పుడల్లా అతనికి మామయ్యగారింట్లో కోడెదూడ జ్ఞాపకం వస్తుంది. అది ఒక్కొక్కసారి అతను గోకితే అతని చేతిని నాకుతుంది. ఒక్కొక్కసారి గబుక్కుని గంతువేసి ముఖం ఓరగాపెట్టి నానా అల్లరీ చేసుంది. ఒక్కొక్కసారి పొడవడానికి తల వంచుకుంది. అంచేత దాన్నెల్లా బుజ్జగించాలో అతనికి తెలియడం లేదు. రంగయ్యకూడా అంతే.

ఆ కలత నిద్రలో అతనికి టపటపమని ధ్వని వినబడింది. మొదట బద్ధకించి ఇంకో పక్కకి తిరిగి కళ్లు మూశాడు. కాని టపటపశబ్దం మళ్లీ వినబడింది. ఈ సారి కొంచెం గట్టిగా వినబడింది. సుబ్బారావు లేచి కూర్చున్నాడు. అతనికి మొదట్లో ఏదో పెద్దజంతువు చుట్ట కాలుస్తున్నట్టు ఆకాశంలో పొగలు కనిపిస్తున్నాయి. పనివాళ్ళు పరుగెత్తుకున్నారు. వడ్రంగులు దూలాలమీద నిలబడి చూసున్నారు.

ఒక వందగజాల అవతల ఇళ్లు అంటుకున్నాయి.

రంగయ్య గబగబ వచ్చాడు. గట్టిగా అరుస్తూ ఆజ్ఞాపించాడు

"ఒరేయ్, ఆ వాసాలు, గెడలు ఊడపీకెయ్యండి. దూలాలు కూడా కిందకు తప్పించెయ్యండి"

"గాలి అటుందిరా. దీనికి పరవాలేదు" అన్నాడొక వ్రడంగి.

"ఊడపీకేత్తే ఇంకో నెల పని పెరుగుద్ది. ఎర్రి నాయాలా!...ఏమో ఎవరు సూడొచ్చారు? గాలి ఉన్నట్టుండి ఇటు తిరిగితే! ఇప్పెయ్యండి గెబగబ."

సుబ్బారావుకి నోట మాట లేదు. అప్పుడే వ్రడంగులు వాసాలు పీకేస్తున్నారు. రంగయ్య కాలిన ఇళ్ళవేపు గబగబ పరిగెత్తాడు. సుబ్బారావు అతన్ని పిలుస్తూ అతని వెనకాలే వెళ్లాడు.

రెండు ఇళ్లు జంటగా కాలుతున్నాయి. ఇవతల ఇద్దరు మగవాళ్లు, ఇద్దరు ఆడవాళ్లూ నెత్తీ నోరూ మొత్తుకుని ఏడుస్తున్నారు. చాలామంది దూరంగా నిలబడి చోద్యం చూస్తున్నారు. కొంతమంది మాత్రం చంద్రుడికి ఒక నూలుపోగన్నట్టు ఒక బిందెడు బిందెడు నీళ్లు ఆ పెద్ద మంటల్లోకి చల్లుతున్నారు.

రంగయ్య నిలబడి చూశాడు. ఒక ర్రి మొగంవాడు రంగయ్యదగ్గరకు వచ్చి అన్నాడు:

"ఇంట్లో నలుగురు పిల్లలూ, ఒక ముసిలీ ఉండిపోయారు. గుమ్మాలు అంటుకుపోనాయి. పాపం, ఆళ్లు ఏడుత్తున్నారు."

"ఏ గదిలో ఉన్నారు?"

ఏడుస్తున్న మగవాళ్లలో ఒకడు దీనంగా దగ్గరకు వచ్చి అన్నాడు:

"ఇద్దరు పిల్లలు దచ్చినంగదులో పండుకున్నారు. ఇద్దరు పిల్లలూ, ముసలమ్మా పడమటింట్లో ఉన్నారు. అయ్యొమ్మో! కాలి మసయిపోతారు. నా తల్లులోయ్. కుర్రోడు ఒక్కగాను ఒక్క కుర్రోడు బాబోయ్...."

"నోరు మూసుకో. సిగ్గులేదూ. మొగోడివి!"

రంగయ్య తొడుక్కున్న బనీను విప్పాడు. ఇంతలో సుబ్బారావు అతని దగ్గరకు చేరుకున్నాడు. రంగయ్య బనీను అతనిచేతిలో పెట్టాడు. ఇంటి అరుగు దగ్గరకు వెళ్లి పరిశీలించి చూస్తున్నాడు. సుబ్బారావు కోపంగా అతన్ని సమీపించి అన్నాడు:

"ఇల్లంతా మళ్ళీ విప్పెయ్యమంటావా? మామ చెప్పుతానండు. అంతదూరాన్నుంది."

ఒక కాలినదూలం కింద పడబోయింది. రంగయ్య సుబ్బారావుని ఒక చేత్తో ఎత్తి అవతలకి విసిరాడు. తను ఒక్క గంతువేసి తప్పుకున్నాడు. దూలం పెద్దగా మండుతూ అరుగు మీద పడి కిందకి పడిపోయింది. రంగయ్య పక్కనున్న మనిషి తలకి చుట్టుకున్న తువ్వాలు పీకి గోచీపెట్టి పంచి సుబ్బారావుచేతికిచ్చాడు.

"మాట్లాడావంటే మక్క లిరుగుతాయి. కూడా కూడా తిరిగావా సత్తావు."

సుబ్బారావు బెదురు దిమ్మెక్కి నమిలాడటే జవాబు ఏమీ చెప్పలేదు. రంగయ్యని పెద్దకళ్లతో అమాయకంగా చూశాడు. రంగయ్య పెద్ద కొత్త వాసాలు రెండు తెప్పించాడు. రెండు చేతుల్లోనూ రెండు పట్టుకుని మండుతున్న ద్వారబంధం దగ్గరకు వెళ్లాడు. అరుగుమీద కప్పు ఇంకా కాలుతోంది. రెండు వాసాలను కింద కొసలకు ఆన్చి శక్తికొద్దీ కాలుతున్న ద్వారబంధాన్ని నెట్టాడు. సగం కాలిన కర్ర పట్టుతప్పి ద్వారబంధం దభేలుమని మండుతూ ముందుకు పడింది. రంగయ్య పట్టుతప్పి కొంచెం తూలాడు. మీద పడబోయే ద్వారబంధాన్ని చేతుల్లో ఉన్న వాసంతో అరుగుకిందకి నెట్టాడు. పెద్ద మంట మండుతూ ద్వారబంధం కింద పడిపోయింది. రంగయ్య ఇంట్లో ప్రవేశించాడు. నిప్పువేడి తగలకుండా దూరంగా నిలబడి అందరూ చూస్తున్నారు. ఇంట్లో అంతా మంటలు, పొగ. అన్ని తలుపులూ అంటుకున్నాయి. రంగయ్య శరీరం ఉడుకుతోంది. ఊపిరి ఆడటంలేదు. తిన్నగా పొగ, మంటలమధ్యనించి పడమటి వసారాలోకి దూకాడు. భుజం కాలింది. చేత్తో కాలిన చోట రాసుకుంటూ ఇటూ అటూ వెదికాడు. ఇద్దరు పిల్లలు ముఖాలు జేవురించి కిందపడి ఇటూ అటూ దొర్లుతున్నారు. ముసిలి ఒక పక్కని గోడకి చేర్లబడి కొన వూపిరితో స్పృహ తప్పివుంది. ఇద్దరు పిల్లలూ అతన్ని చూశారు. కాని లేవలేకపోయారు. బయటికి రావడానికి మార్గంలేదు. గుమ్మం పెద్దగా మండుతోంది. సావడిలోంచి పోవాలంటే మంటల మధ్యనించి వెళ్లాలి. పిల్లలు తట్టుకోలేరు. కిటికీలోంచి అవతలికి చూశాడు. వసారా అవతల దొడ్డే. అయితే దొడ్డిలోకి దారి పక్క కొంజాలోంచి ఉంది. కొంజా పెద్దగా మండుతోంది. రంగయ్య కిటికీమీద పని ప్రారంభించాడు. కిటికీ ఇంకా అంటుకోలేదు. ఇనప

ఊసలు పాతవయినా గట్టిగా ఉన్నాయి. ఒక క్షణం పాటు అతనికి ఆలోచన పోలేదు. మంటపొగలు పక్క కొంజాలోంచి వసారాలోకి పాకుతున్నాయి. చటుక్కుని అతనికి ఆలోచన తట్టింది. చేతిలో వాసాల్ని చివర పట్టుకుని రెండో కొసలు కిటికీ ఊసలమధ్య తగిలించి దూరంగా నిలబడి శక్తికొద్దీ వంచాడు. ఊసలు కొంచెం పెంకితనంచేసి వొంగిపోయాయి. ఒక్కొక్క ఊసనీ రెండు చేతుల్లోనూ పట్టుకుని తన బరువంతా గోడకు తన్నిపట్టి లాగాడు. ఊసలు కమ్ముల్లోంచి ఊడిపోయాయి. ఆ ఊపుకి రంగయ్య వెనక్కి పడిపోయాడు. పైనించి దూలం కాలి పడబోతోంది. గబుక్కుని లేచి ఇద్దరు పిల్లల్ని చెరొక చేత్తోనూ పట్టుకుని గోడపక్కకి లాగాడు. దూలం పడిపోయింది. మంట దగ్గరగా దేహాన్ని ఉడికిస్తోంది. కడుపులో అతనికి త్రిప్పు ప్రారంభమయింది కళ్లు మూసుకుని ఇద్దరు పిల్లల్నీ కిటికీ దగ్గరగా తీసుకువచ్చి కిటికీలోంచి దొడ్డిలోకి దింపాడు. దొడ్డివేపు కొంతమంది జనం వచ్చి రంగయ్య ప్రయత్నాలన్నీ చూస్తున్నారు. వాళ్లు తొందరగా పిల్లల్ని అందుకున్నారు. రంగయ్య ముసలమ్మనిగూడా కిటికీలోంచి అందిచ్చాడు. అవతల్నించి ఎంతోమంది కేకలు వేశారు.

"నువ్వు కూడా దిగొచ్చెయ్యి రంగయ్యా! ...సచ్చిపోతావు రంగయ్యా!... ఇంకొచ్చెయ్యి!..." ఒకక్షణం కిటికీకి చేర్లబడి నిలబడ్డాడు. అతనికి స్పృహ తప్పి మళ్ళీ వచ్చింది. అతని మనస్సులో ఏదో ప్రవేశించింది. కాలుతున్న ఇంట్లోకి నిర్లక్ష్యంగా నడిచి వెళ్లాడు. అందరూ సగం సందేహంతో, సగం భయంతో అతను కనిపించినంతవరకూ చూశారు.

సుబ్బారావు అందరినీ తప్పించుకొని ముందుకు వచ్చి చూశాడు. రంగయ్య ముసలమ్మని ఇవతలికి అందిచ్చి లోపలికి వెడుతున్నాడు. రంగయ్య ముఖంలో చావును జయించిన వెలుగేదో సుబ్బారావుకి కనిపించింది. నోరు తెరుచుకొని రంగయ్యముఖాన్ని జ్ఞాపకం చేసుకుంటూ నిలబడ్డాడు.

దక్షిణపు వేపు దొడ్డిలోనించి రంగయ్య గొంతుక వినబడింది. దొడ్డి గోడకి తలుపులేదు. నిచ్చెన వేసుకొని ఇద్దరు ఎక్కారు. దొడ్డిలో స్పృహతప్పిన ఇద్దరు పిల్లలూ, రంగయ్యా ఉన్నారు. సుబ్బారావు కూడా చటుకుని గోడ ఎక్కాడు. రంగయ్య మామూలు రంగయ్యలాగ లేడు. ముఖం మాడిపోయింది. రెండుమూడు చోట్ల చర్మం కాలిపోయింది. కళ్లు ఎర్రగా గొప్పగా వెలుగుతున్నాయి.

ఇద్దరు పిల్లల్నీ, రంగయ్యనీ ఇవతలికి చేర్చారు. సుబ్బారావు రంగయ్యని భక్తిగా చూశాడు. పిల్లల తల్లిదండ్రులు రంగయ్య రెండుచేతులూ పట్టుకుని సంతోషం, కృతజ్ఞతా వెలిబుచ్చుతూ ఏడ్చారు. రంగయ్య పచ్చికమీద వెల్లకిల పడుకున్నాడు. నలుగురయిదుగురు చుట్టూ చేరారు. తక్కినవాళ్లు చుట్టూ గుడికట్టి అతని ధైర్యస్థైర్యాలని పొగుడుకున్నారు.

"కల్లు రెండుముంతలు తేండ్రా!" అన్నాడు కళ్లుమూస్తూ రంగయ్య. సుబ్బా అతని తలయెత్తి అతని పంచి, బనీను లుంగచుట్టి తలగడకింద పెట్టి పక్కని కూర్చున్నాడు

కల్లుతాగిన అరగంటదాకా రంగయ్యకి స్పృహ రాలేదు. తరవాత కళ్లు తెరిచాడు. వంటికంతకీ ఇద్దరు ఆముదం పట్టిస్తున్నారు. రంగయ్య సుబ్బారావుని చూశాడు. వెనకటి కొంటెతనం అతని చూపుల్లో ప్రవేశించింది.

"ఏం పంతులూ, ఇల్లంతా ఇప్పేశారా?"

"నేను చూడలేదు."

"సూశావు పంతులూ! మనిసయిపుట్టినందుకు నలుగురికి నాలుగురాళ్ళొచ్చేటట్టు సూడాల. మీ మామ ఇల్లు పూర్తి అయిపోతే ఇంక మాకు పనేది? ఇప్పుడింకో రెండునెల్లు ఇంకా పనుంటది."

సుబ్బారావు దానికేమీ సమాధానం చెప్పలేదు. అతని వేపు ఒక క్షణం చూచి అన్నాడు:

"నువ్వు ముందూవెనకా చూసుకోకుండా అల్లా మండుతున్న ఇంట్లోకి వెళ్లిపోయావుగదా, వొళ్ళంతా కాలి చచ్చిపోతే?"

"సచ్చిపోతే రేపటికి రెండు" అంటూ రంగయ్య బాధతో కళ్లుమూస్తూనే పెదవులతో నవ్వాడు.

# తళ్లికోట యుద్ధము : సాహిత్య పరిణామము

శ్రీ చింతగుంట రామకృష్ణరావు =

క్రీ. శ. ౧౫౬౫ సం.న జరిగిన తళ్లికోట యుద్ధమునకు ఆంధ్రచారిత్ర ప్రాధాన్యమే గాక, ఆంధ్ర సాహిత్య ప్రాధాన్యమును గలదు ఆ వత్సరముననే శ్రీ కృష్ణదేవరాయలచే స్థాపింపబడిన విజయనగర సామ్రాజ్యము ఛిన్నభిన్నమాయెను; అతనిచే ప్రారంభింపబడిన సాహిత్యోద్యమములును క్షీణింప మొదలిడెను. అతని రాజకీయ పతనానంతరము ౫౦ సంవత్సరముల వఱకు కావ్యోద్యమము సజీవముగనే యుండెను. ఏలన, ఆ కవిపుంగవుని కాలమున పుట్టి పెరిగిన కవులు ఆ యుద్యమమందే పాటుపడి దానిని ఉన్నతపథమున నుంచ ప్రయత్నించిరి. కాని ౧౬ వ శతాబ్దమునందలి మూడవదశాబ్దమునుండి ౧౮వ శతాబ్దము వఱకు అంధకారబంధురమే. ఈ కాలమున పద్యము లల్లెడువారు మెండుగనే యున్నారు గాని కవులు మాత్రము అరుదు; సాహిత్య రచనలు మిక్కుటమేగాని అవి మేలితెగకు చెందినవి మాత్రము కావు. క్రీ. శ. ౧౬౩౦ నుండి ౧౭౫౦ వఱకుగల కాలమును సాంద్రముగను, నిస్సారముగను పెరిగియుండుటకు ఉన్నత వృక్ష మేదియు నగుపడని వనమునకు పోల్చుట మిక్కిలి సమంజసము. కాని ఈ కాలమున సాహిత్య ప్రవాహ మరికట్టబడియు ఆంధ్ర వాఙ్మయము దక్షిణముదాక వ్యాపించిన విషయమును గమనించి మనము సంతసింపవలెను. ప్రత్యేకాంశములతోను, క్రొత్త పోకడలతోను గూడిన నవ్యగ్రంథోత్పత్తి తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరులనుండే వచ్చినది. ప్రధాన ప్రవాహమైన ఉత్తరాపథము (Northern School) నకు చుక్కాని రగకన్పట్టుచు దక్షిణాపథము (S.uthern School) అని ఇది పేరు గాంచినది.

ఉత్తరాపథము క్షీణించుటకు కారణముల నరయుదము. విజయనగర సామ్రాజ్యము చిరుపాళ్యముల క్రింద విడిపోయెను. ఈ పాళ్యాధికారులు విద్యావిజ్ఞానములు లేనివారగుటచేత సాహిత్యోద్యమములను పెంపొందింప లేకపోయిరి. అల్పపోషకులు అల్ప కవిత్వమునే వెలికి తేగల్గిరి. అందుచే కవులకు ప్రేరేపణ, దృష్టి, ఉత్సాహము, ఔన్నత్యవాంఛ లేకపోయినవి.

పురాణ యుగమునాటి గొప్పకవులు వ్యాకరణ వ్యాసాలంకార శాస్త్రముల సృష్టికర్తలు. కాని ౧౭, ౧౮ శతాబ్దములకు చెందిన రచయితల విషయము వేరు. ఏలన, కావ్యరచనావిధానమందలి కవితశిల్పము క్లిష్టమై యొప్పినందున కవివరుడు ఈ క్రొ త్తపద్ధతి యందు రచన లొనర్ప వ్యాకరణ వ్యాసాలంకార శాస్త్రములందు తర్ఫీదు కావలసివచ్చెను. కవితాస్వేచ్ఛ శాస్త్రశృంఖలములచే బంధింపబడెను. స్వచ్ఛంద రహితమైనట్టి, మధ్యతెగకు చెందినట్టి కవిత్వకృషికి శాస్త్రజ్ఞుల నియంతృత్వమే కారణ మనవచ్చును.

సాహిత్యానుకరణమునకు కావ్యము తగినపద్ధతి కాదు. ఆంధ్రకవుల నాళములందు 'అనుకరణ' రక్తము ప్రవహించుచునే యుండెను. కావ్యములందు నిబిడీకృతమైన మంచి యంశములను అనుకరణముచే గ్రహింపలేక తేటతెల్లమగు చెడువిషయములను మాత్రమే చూడగల్గెను. కావ్యరచనా విధానమందు జీవితమునుండి కళ వేరుపరుపబడెను. ఎట్లన, కావ్యమునందు వర్ణనలు మెండు; వర్ణనలకు ఉపమానోత్ప్రేక్షలు ప్రధానము; కాని కావ్యయుగము నాటి గొప్పకవులు జీవితమును,

కళను శ్రద్ధతో అనుసంధించిరి. వారి ననుసరించినవారు జీవితముతో సంబంధము వీడి వ్రాయసాగిరి. వారు అష్టదిగ్గజముల వరవడినే వ్రాయుటచే వారి ఇతివృత్తములను, వారి అభిప్రాయములనే మరల మరల గ్రహించెడివారు. ఈ కాలపు రచనలు మధ్యతరకమునకు చెందినవే కాక ఏకరీతినే సాగినవి. కావ్యశైలియందలి లోపమే ఉత్తరాపథ క్షీణదశకు మూడవ ముఖ్యకారణము.

ఇక దక్షిణాపథ మెట్లుద్భవించినదో చూతము. కృష్ణదేవరాయలచే దక్షిణమున జయింపబడిన ప్రతి దేశమునకు అతడు అధికారులను నియమించెను. ఆ సామ్రాజ్య పతనానంతరము వారి యధీనమందలి దేశములకు వారే స్వతంత్రులైరి. ఆ శతాబ్దమునందలి చాల భాగము వారు రాజకీయపరిస్థితిని పదిలపరచుకొనుటతో సాగిపోయినది. రాజకీయబాధలు తొలగినపిదప వారు శాంతియుతముగ సారస్వతసేవకు దొడగిరి. రాయలచే నియమింపబడిన రాజప్రతినిధులు అతనివలెనే సారస్వతాభిమానులై, వారి ననుసరించినవారును కళారాధకులై, మాతృభాషాసక్తులై, దేశాంతరమున నివాసమేర్పరుచుకొనిన తన తోడి సోదరులకు ఆంధ్ర నాగరికతను జాగ్రత్తగా కాపాడదలచినవారై యుండుట నిజముగ మన అదృష్టమే! స్వదేశ నాగరికతను వారిచే స్వీకరింపబడిన దేశమున ప్రతిష్ఠ చేయవలెనను దొడ్డ ప్రయత్నమే దక్షిణాపథోత్పత్తికి కారణము. దక్షిణ సాహిత్యము కొంత ౧౭ వ శతాబ్దమునకు, ఎక్కువగా ౧౮ వ శతాబ్దమునకు చెందినది. తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరులు అందుకు సహాయభూతములైనవి.

రాయలచే నియమింపబడిన తంజావూరు అధినేత చవ్వరాజు. ఇతని కుమారుడు అచ్యుత నాయకుడు గోవిందదీక్షితులను తెనుగు పండితుని తన మంత్రిగ నుంచుకొనెను. క్రీ.శ. ౧౬౩౦-౪౦సం.ల నడుమ అచ్యుతుని కుమారుడు రఘునాథుని ఆస్థానమున క్రొత్త పంట కోతకు వచ్చెను. "వాల్మీకి చరిత్ర" అను గద్య కావ్యమును రాజు స్వయముగ రచించెను. ఆస్థానకవియగు చేమకూర వేంకటకవి "సారంగధర", "విజయవిలాసము" అను గ్రంథములను రచించెను. భావలోనిగ్గు, భావములలో మృదుత్వము, పద్యములలో మాధుర్యము—ఈకవివరుని రచనలలో చక్కగ సమ్మేళనమైనవి. ఈతని శైలి ప్రత్యేకతను బట్టి దానికి "చేమకూర పాక"మని పేరువచ్చెను. కవిచౌడప్ప ఈ కాలపువాడని కొందరందురు. అనంతరము క్రీ.శ. ౧౭౬౫సం.న తంజావూరుకు చెందిన ప్రతాపసింహుని వేశ్య ముద్దుపళని "రాధికాసాంత్వనము"అను కావ్యమును తెనుగున రచించెను. కాని తంజావూరువలన ఆంధ్రవాఙ్మయము పొందిన గొప్ప బహుమానము త్యాగరాజకృతులని ఘంటాపథముగ చెప్పవచ్చును. త్యాగయ్యకృతులు దక్షిణమున అంతట వ్యాపించినవి. ప్రతిగృహమునను వీటి ప్రతిధ్వనులు విననగును. వారి గానామృతమును తనివితీర గ్రోలనివారు లేరు.

కాని ౧౮ వ శతాబ్దమున నిగమ నాయకుని తరమువాడు, రాయలచే నియమింపబడినవాడు నగు మధురరాజు విజయరంగచొక్కనాథుని ఆస్థానమున దక్షిణాపథము పరిపూర్ణ వికాసము నొందెను. చొక్కనాథుని తండ్రి విశ్వనాథ నాయకుడు ఉత్తరదేశముల నుండి పండిత బృందములను తెచ్చి వారికి భూదానములొసగి వారిని దక్షిణముననే స్థిరవాస మేర్పరుచుకొనునట్లు చేసెను. విశ్వనాథుని దూరదృష్టిఫలములు అతని కొడుకు చొక్కనాథుని కాలమున పరిపక్వము నొందెను. పెక్కు గ్రంథములను రచించి దక్షిణసాహిత్యమునకు పుష్టినొసగిన కవులలో సముఖము వెంకటకృష్ణప్పనాయకుడు ప్రథముడు. ఇతనిచే వ్రాయబడిన 'జైమినిభారతము' నాటి దక్షిణాపథశ్రేష్ఠరచనకు తార్కాణము. అహల్యాసంక్రందనము, సారంగధర చరిత్ర, రాధికాసాంత్వనము—ఇతని ఇతరరచనలు. ఇతని రచనలు శృంగారప్రధానములు. శేషం వెంకటపతి 'తారాశశాంకము'కూడ ఆట్టితెగకు చెందినదే. ఈ కాలమున కొన్ని మతవిషయగ్రంథములును వెలువడినవి. శ్యామకవి రామాయణమును వచనమున వ్రాసెను. తుపాకుల అనంతరాజు విష్ణుపురాణము, భగవద్గీత రచించెను. సుమతి రామభద్రకవి హాలాస్యమాహాత్మ్యమును, వెలగపూడి కృష్ణకవి వేదాంతసారమును వ్రాసిరి.

పుదుక్కోటలో క్రీ. శ. ౧౭౬౯-౮౯ మధ్య రాజా రాఘవతొండమాన్ ఆధ్వర్యమున కొన్ని శబ్ద

రత్నాకరములు, పద్యమంజరులు క్రోడీకరింపబడినవి. నదురుపాటి వెంకటనారాయుడి భాషార్ణవము పేర్కొన దగినది. అతని కొడుకు 'బిల్హణీయ' కారుడు.

క్రీ. శ. ౧౬౫౦, ౧౭౦౦ సం.ల మధ్య వీర రాజుచే రచింపబడిన ప్రథమగద్యకావ్య మగు భారతము, మైసూరు నృపుని మంత్రి నంజరాజువిరచితమగు లింగపురాణము, హాలాస్యమాహాత్మ్యము దక్షిణసాహిత్యము మైసూరువలన పొందిన సహాయము.

ఈకాలమునందలి సారస్వతమును పరిశీలించినచో మనకు కొన్ని ప్రత్యేకాంశములు గోచరమగును. గద్య రచనలను పాఠకలోకమునకు అందజేయుటచే దక్షిణాపథము ప్రశంసాపాత్రమైనది. పురాణయుగమున నన్నయతిక్కనలు కథను క్లుప్తపరచుటకు, చదువరుల కొకింత విరామ మొసగుటకు మాత్రమే వచనముపై ఆధారపడెడివారు. కాని వారి ననుసరించినవారు చాల మంది అన్నితావులందు శ్లేషయనుకొని అలంకారములను జొప్పించి, వచనము వ్రాయసాగిరి. ఇంతకన్న రచన పూర్తిగ గద్యమైయొప్పిన బాగుండునని దక్షిణాపథము గుర్తించుటచే అది వాసికెక్కినది.

ఉత్తర పథముయొక్క రచనలన్నియు చంపూ పద్ధతినే అవలంబించినవి. "పద్యములు అల్లగలిగినవాడే కవిగాని గద్యము వ్రాసెడివాడు కాడని నాటి అభిప్రాయ మనుటకు కవిబ్రహ్మనిర్వచనోత్తర రామాయణమే నిదర్శనము. సంస్కృతమున దండి 'దశకుమారచరిత్ర' వచనమున వ్రాసెను. ఆ గ్రంథమును కేతన వచనమందే తెనిగింపక చంపూపద్ధతిని అవలంబించుట మరియొక ఉదాహరణము. ప్రబంధకవితాలత ఎట్టి వాతావరణమున చిగిర్చి పుష్పించునో ఆంధ్ర కవితాపితామహుడు రాయలకు తెల్పియున్నాడుగదా.

"నిరుపహతిస్థలంబు రమ
ణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన
భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలి
యంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినగాక, యూరక కృతి
తుల్ రచియింపుమనంగ శక్యమే ?"

తల్లికోట యుద్ధానంతరము అంతట అశాంతి నెలకొనెను. కవులకు కావలసిన విశ్రాంతి, విరామము లేకపోయెను. అయినను నాగరికత నశింపకుండుటకై రచయితలు వచనరచన సాగించిరి.

ఉత్తరాపథము నాటకరచన కెట్టి ప్రోత్సాహము నీయలేదు. సంస్కృతమున కాళిదాసుని నాటకము ననుసరించిన పినవీరభద్రుని రచన కావ్యపద్ధతినే సాగినది. ఉత్తరాపథకవులకుగాని, నాటి పోషకులకుగాని, నాటి ప్రజకుగాని నాటకమున అభిలాష ఎక్కువగ నుండలేదని తెలియుచున్నది. వారికి దృశ్య ప్రబంధములకన్న శ్రవ్యప్రబంధములపై అభిరుచిగలిగి యుండెనోపును. వారు నాటకరచనను సగౌరవముగ చూచియుండరేమోకూడ. కాని దక్షిణాపథకవులు నాటకమునకుగల ప్రయోజనమును బాగుగా గుర్తించిరి.

మతసంబంధరచనలు కొన్నితప్ప తక్కిన ఉత్తర దక్షిణ సాహిత్యరచన లన్నియు వివాహసంబంధమైనవే. నాటికి తొంభైపుస్తకములు పరిణయమును గురించి వ్రాయబడిన వనుట సత్యమునకు దూరముకాదు. వివాహమే కథకు కీలుగ నుండెను. స్త్రీ పురుషుల అన్యోన్యాకర్షణయందలి మర్మమే కవిత్వవిషయమై యొప్పినది. కాని కవితాదృష్టి ఒక కాలముయొక్క నాగరికతను సూచింపకమానదు పురాణయుగకవులు ఈ సందర్భమున అతినునిశితముగను, ఆముష్మికార్థము నెఱిగియు వ్రాసియుండిరి. నాయకుడు అర్థాంగిని రణరంగమునకాని, పరాక్రమపోటీయందుకాని గెల్చి పొందెడివాడు. కావ్యయుగకవులు ఈ ఆదర్శమునకు చాల కొఱతబడిరి. వారు శృంగారరసమునకే మితి మీరిన ప్రాముఖ్య మిచ్చిరి. శారీరికాకర్షణలను విపులముగ వర్ణించి చదువరులకు వెగటుగొల్పించిరి.

ఈ సందర్భమున కొందరు విమర్శకులు ఉత్తర దక్షిణ సాహిత్యరచనలకు గల భేదమును నిరూపించుచు ఈ క్రిందివిధముగ అభిప్రాయపడుచున్నారు: "దక్షిణాపథము నీతినియమములను పూర్తిగ త్యజించినది. అది దుర్నీతిని ప్రోత్సహించినది. ఉత్తరాపథమున స్త్రీ పురుషుల అన్యోన్యాకర్షణ వివాహాంతముగ నుండెడిది

కాని దక్షిణసాహిత్యరచయితలు వివాహమునకన్న పాతివ్రత్యభంగమునే కథావస్తువుగ గైకొనిరి. నాటి రచనలైన సారంగధర, తారాశశాంకము ఇత్యాదులు నాటి కవులు దుర్నీతినే మతముగ ప్రచురించిరను విషయమును బలపరుచుచున్నవి."

వీరి వాదము సరియని తోచుటలేదు. కథ వివాహాంతమైనను సరే, కాకపోయినను సరే, కవులు పచ్చి శృంగారమును చిత్రించి, చదువరులకు అసహ్యమొనర్చి రనుట నిర్వివాదాంశము. ఉత్తరాపథ కవులు వివాహాంతముగల నాటకములను చాలవఱకు గ్రహించియుండుటచే దక్షిణాపథకవులు క్రొత్త ఇతివృత్తములను పాఠకలోకమునకు అందజేయవలెనని పురాణములనుండి ఇట్టి కథలను గైకొని యుండవచ్చును. అంతమాత్రమున వారు దుర్నీతిని ప్రోత్సహించి రనుకొనుట పొరబాటు. విషాదాంతములగు కథలు చదువరులకు నీతిని బోధించుచున్నవి. 'సారంగధర' చూచినంతమాత్రమున ఎవరును పెడత్రోవ తొక్కరు సరిగదా, నిర్బంధ వివాహముల వలన గల్గెడు చెఱుపు అందరికిని ప్రస్ఫుట మొనర్చుచున్నది. ప్రాత మద్యమునే క్రొత్త సీసాలలో నింపుటకన్న క్రొత్త మద్యము పాఠకుల కీవలెనను సదుద్దేశ్యమే ఇట్టి రచనలకు కారణ మనుకొనుట యుక్తముగ నుండును.

వస్తుతః కథ చెడుదైనను కవిప్రతిభ దానిని మంచిదిగ మార్చగలదని మనము గ్రహింపవలెను.

పాశ్చాత్య వాఙ్మయమున రెండవ ఛార్లెస్ కాలమున, అనగా Restoration Period లో రచయితలు పాతివ్రత్య భంగము, పాతివ్రత్య దూషణ కథావస్తువుగ గైకొని తమ రచనలలో బూతువ్రాసి, సంఘమున దుర్నీతిని ఒక మతముగ ప్రచారముచేసి రనుట యుక్తము. కాని షేక్స్పియరు తన 'Rape of Lucrece' అను పద్యకావ్యమందు పాతివ్రత్యభంగమే ఇతివృత్తముగ గైకొని ఇట్టి ప్రచారము చేసెననుట న్యాయము కాదు; ఏలన, రచనావిధానమందు చక్కని నీతులను మనకు బోధించి తన అసమాన ప్రతిభను ప్రదర్శించెను. కథావస్తువు ఇంచుమించు ఒకే రకమునకు చెందినదైనను రచనావిధానమందు హస్తిమశకాంతరమున్నది.

"కాకః కృష్ణః, పికః కృష్ణః
కో భేదః పికకాకయోః!
వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః; పికః పికః"

షేక్స్పియరు రచనకు, Restoration Period రచనలకు గల భేదము పికకాకముల భేదమే. షేక్స్పియరుపద్యకావ్యమువంటివే దక్షిణాపథ రచనలు. అందుచే దక్షిణాపథకవులు దుర్నీతిప్రచారమునకు ఒడిగట్టి రనుట అసమంజసము.

విమర్శకుడనినవాడు కేవలము చెడురచనలను వర్జించి, నీతిబోధకమగు రచనలను మాత్రమే గ్రహింపవలెను. ఈ సందర్భముననే విమర్శకుని నేర్పు ద్యోతకమగును.



# సౌందర్య మీమాంస



## = శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి =

సౌందర్యశబ్దము, కావ్యలోకములోనే కాక వ్యావహారికజగత్తులోకూడ ప్రథితము. శిల్పమును గాని, చిత్రమునుగాని, నృత్యమునుగాని, కావ్యమును గాని, నాటకమునుగాని ఆస్వాదించు సందర్భమున తత్తద్విషయములు సుందరములుగా నున్నవనుట సర్వజన సామాన్యము. వ్యక్తులను చూచినప్పుడుకూడ వారు సుందరముగా నున్నారని, లేక అసహ్యముగా నున్నారని అనుటకూడ పరిపాటి. ప్రతివ్యక్తిదృష్టిలోను ఒక సౌందర్యవస్తువు సుందరముగానే కన్పించుచున్నది. వ్యక్తిభేదముచేత సౌందర్యప్రతీతిలో సహితము ఈష ద్భేదము కన్పించవచ్చును. అంతేకాని సౌందర్యవస్తు వసహ్యముగాను, ఏహ్యవిషయము సుందరముగాను భాసించుటలేదు. అనగా సౌందర్యము ఆత్మాశ్రితము గాక వస్తుసత్తాకమైనట్లు జనులందరు అంగీకరించు చున్నారు. విషయనిష్ఠమైన సౌందర్యము (Beauty as objective) ఆత్మవృత్తిద్వారా అనుభూతమగు చున్నది (Subjective Experience). కాని శృంగారము ఆత్మనిష్ఠము, ఆత్మాశ్రయము (Subjective)నై విషయముతో తాదాత్మ్యమునుగాని, అనన్యత్వమును గాని (Unity, Synthesis) పొందుచున్నది. ఇంత వరకు అందరు ఈ విషయమును అంగీకరించకపోరు.

### ౨

కాని, సౌందర్య మనగా నేమి? అను ప్రశ్నకు జవాబు దొరకుట దుర్లభము. సౌందర్యమీమాంసకు బయలుదేరదలచిన, సౌందర్యోపాసకులగు మహాకవులే విధముగా సౌందర్యమును తెలిసికొనినారో విచారించవలెను. అభినవగుప్తుడనినట్లు మహాకవి కాళిదాసు 'కవికులచక్రవర్తి', 'భగవదనుగ్రహపవిత్రవాక్కు' గలవాడు. కావున కాళిదాసకవితాలోకాలోకనముతో అస్మదాదులు 'ఉపోషితలోచనములతో, నిమేషాలస పక్ష్మపంక్తులతో' కవితా మధువును గ్రోలి నేత్ర నిర్వాణ మందగలరు.

కుమారసంభవములో నితివృత్తము సౌందర్యోపాసన. పార్వతి సౌందర్యమూర్తి; యౌవనమును ధరించుచున్న మేనకకు అంగసంపూర్తిగా జన్మించినది. మహాకవి ప్రథమసర్గలో నామెచిత్రమును చూపదిర్చె యుంచును —

"ఉన్మీలితం తూలికయేవ చిత్రం
సూర్యాంశుభి ర్భిన్న మివారవిందమ్,
బభూవ తస్యా శ్చతురశ్రశోభి
వపు ర్విభక్తం నవయౌవనేన" (౧-౩౨)

అనినాడు. ఈ శ్లోకమును సౌందర్యదర్శన చేసిన ఋషిమాత్రమే వచింపగలడు. సౌందర్య మీమాంసకిది మూల మంత్రము. ఇంద్రవజ్రోపేంద్ర వజ్రా సంవలితమైన ఈ శ్లోకమును ఏకాదశాక్షరియగు ష్టుంకోజ మనవచ్చును. ఏకాదశరుద్రు లున్నారట! రుద్రుని సౌందర్యోపాసన ఇతివృత్తమేమో! రుద్రుడు—

"స్వయంవిధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తపశ్చచార" (౧-౫౭)

తపస్సులకు ఫలమొసగువాడు శివుడు. అట్టి శివుడుకూడ ఏదో కోరికతో తపస్సు చేయుచున్నాడట! సౌందర్యప్రతీతి నరించి తపస్సు చేయుచున్నవాడు శివుడు. ఈ ప్రతీతికి తపస్సు ఉభయనిష్ఠము కావలెను. పార్వతి తపస్సుచేసినది. శివుడు బ్రహ్మమయమైన తేజస్సుచే జ్వలించుచున్న (౫-౩౦) నైష్ఠికసుందరుడు (౫-౬౨). మార్గమధ్యములో అడ్డముగా వచ్చిన పర్వతమును చూచి ఆకులితమైన నదివలె, శైలాధిరాజతనయయగు పార్వతికూడ శివుని జూచి ముందుకు పోలేక, అచటనే నిలువలేక పోయినదట (౫-౮౫)! అప్పుడా 'అవనతాంగి'ని చూచి 'నీతపస్సులచే క్రీతుడనైన నీదాసుడ'నని చంద్రమౌళి రాగాభివ్యక్తిని, భక్తిభావమును కనపరచినాడు (౫-౮౬). అనగా పార్వతి ఆధ్యాత్మికశక్తి సమున్మిషితయై సౌందర్యమూర్తియైనది. శివుడు ఆత్మావలోకనముతో, నైష్ఠికసౌందర్యముతో, బ్రహ్మతేజస్సుతో "శాంతం,

"శివం, సుందరం" అని అనుభూయమాను డగుచున్నాడు. అట్టి పార్వతిని మహాకవి సౌందర్యమూర్తిగా నిర్వచించు సందర్భములోనిది పై ఉదాహృతశ్లోకము.

## ౩

చిత్తరువును వేయుట కుపయోగించు కూర్చికకు తూలిక అని పేరు. తూలికతో చిత్రమునకు రూపపోషణ కలుగుచున్నది. ఆ తూలికచే ఉన్మీలితమైన చిత్రమువలె నున్నది పార్వతి. అనగా రంజనద్రవ్యముచే నుద్భాసితము, సముత్కీర్ణము నైనది చిత్రము. చిత్రము షడంగకము.

"రూపభేదాః ప్రమాణాని భావలావణ్యయోజనమ్,
సాదృశ్యం వర్ణికాభంగ ఇతి చిత్రం షడంగకమ్"

అని వాత్స్యాయన కామసూత్ర వ్యాఖ్యావసరమున జయమంగళలో నున్నది. రూపము, ప్రమాణములు, భావయోజన, లావణ్యయోజన, సాదృశ్యము, రేఖ అనునవి చిత్రమున నివేశితములు.

రూపనిష్పాదన యగువరకు చిత్రము కళాస్రష్ట యొక్క భావవీథిలో నున్నది. కూర్చిక చిత్రమును క్రొత్తగా తీసికొనివచ్చుట లేదు. తతఃపూర్వము భావస్థిరము, ఆత్మనిష్ఠము నైన సౌందర్యమును కేవలము అభివ్యక్తముచేయునది శలాక. ఆత్మాశ్రితము, ఆత్మనిష్ఠము (Subjective) గా నున్న భావమునకు బాహ్యజగత్తులో స్థితి (Objective Existence) పొందుటకు కావలసిన పరిణామము నొసగునది తూలిక. అనగా చిత్రమునకు తూలిక నిమిత్తకారణ మగుచున్నది. ఆత్మనిష్ఠమైన భావమును కలిగియున్న కళాస్రష్ట ఉపాదాన కారణము. ఈ వర్ణికాభంగమునకు సమాధి అత్యంత మవసరము. మాలవికను ప్రథమమున చిత్రగతగా అగ్నిమిత్రుడు దర్శించి, తర్వాత మాలవికను జూచి, చిత్రముకన్న మాతృకయే సుందరతమముగా నున్నదని భావించు సందర్భమున—

"చిత్రగతాయా మస్యాం
కాంతివిసంవాదశంకి మే హృదయమ్,
సంప్రతి శిథిలసమాధిం
మన్యే యేనేయ మాలిఖితా" (౨-౨)

అనినాడు. చిత్రము కాంతివిసంవాదము, అనగా మాతృకలోని శోభన, సౌందర్యమును తీసికొనిరాలేకపోయిన దని భావము. చిత్రకారునకు సమాధిస్థమైన స్థితప్రజ్ఞత్వము లేకపోవుటచే, శిథిలసమాధిలో భావించి రూపనిష్పాదనకు ప్రసిద్ధుడైనాడు గనుకనే మాతృకను చిత్రము మీరలేకపోయినది. శాకుంతలములోని—

"యద్యత్సాధు న చిత్రే స్యాత్
క్రియతే తత్త దన్యథా
తథాపి తస్యా లావణ్యం
రేఖయా కించి దన్వితమ్" (౬-౧౪)

అను శ్లోకమునకు చిత్తరువున సాధువుగా మాతృక అనుప్రవిష్టము గానిచో, పునఃపున రుత్కీర్ణమానమైన, లావణ్యము స్వల్పముగానైనను రేఖాన్వితము కాగలదని సంప్రదాయసిద్ధార్థము. బాహ్యజగత్తులో సుందరములుకాని వస్తువులుసహితము కళావిశ్వమున సౌందర్యముగా స్ఫురించగలవు. అనగా కళాప్రపంచముననే సౌందర్య మున్నది కాని అన్యత్ర లేదు. శృంగారాదిరసములుకూడ లోకమునగాక కావ్యముననే కలవు—"సర్వానుగ్రాహకంహి శాస్త్ర మితి న్యాయాత్తేన నాట్యఏవ రసా న లోక [illegible] ర్థః. కావ్యంచ నాట్యమేవ" (అభినవభారతీ, పేజీ ౨౯౨) అని అభినవగుప్తు డనినాడు.

ఐనప్పటికిని శకుంతలా లావణ్యము సమగ్రముగా చిత్రమున భాసించుటలేదని దుష్యంతుని అనుభూతి. దీనికి కారణము భావస్థిరములైన జననాంతర సౌహృదములతో పర్యుత్సుకత నందిన దుష్యంతుని శిథిలసమాధి (౫-౨). అందుచే భావయోజన (Matter) సక్రమముగా నున్నను లావణ్యయోజన (Form) సరిగా లేదు. అనగా చిత్రమున భావ లావణ్యములు (Matter and Form) ఏకానుసంధానాత్మకములు కావలెను. కాని శకుంతలా చిత్రమున విదూషకు డనినట్లు "మధురావస్థానదర్శనీయో భావానుప్రవేశః"—ఏకానుసంధానాత్మకముగా లేకపోవుటచే చిత్రమును మృగతృష్ణికకు, మాతృకను నదికి పోల్చినాడు (౬-౧౬). కావ్యలోకములో రమ్యత భావలావణ్యములు ఏకమూర్తిత్వనిష్ఠము. కావ్యబహిర్దేశమున రమ్యత లేదు. కావుననే "శాస్త్రమానేన యో రమ్యః స రమ్యో నాన్య ఏవహి" అని శుక్రనీతిసారముకూడ (౪-౪-౧౦౪) చెప్పుచున్నది.

ఏవంవిశిష్టమైన భావలావణ్యయోజన తూలికచే నున్మీలిత మగును. తాదృశఉన్మీలనముగా పార్వతిని భావనచేసిన కాళిదాసున కీయుపమానము రుచికరముగా లేకపోవుటచే "సూర్యాంశుభి ర్భిన్న మివారవింద

అను ద్వితీయోపమ చెప్పబడినది. అనగా ప్రథమోపమలో కొంత న్యూనత గలదు. చిత్రగతసౌందర్యము కవిభావనాసమున్మీలితమైన దగుటచే వస్తుతంత్ర (Objective) మైనను, మనోవృత్తి (Subjective) చే నావృతమగుచున్నది. అనగా అమర్త్యమైన సౌందర్యమునకు మర్త్యస్పర్శ పనికిరాదు. కావుననే—

"మనోరమం యౌవన ముద్వహంత్యా
గర్భోఽభవ ద్భూధరరాజపత్న్యాః" (౧-౧౯)

అని మేనకాగర్భోత్పత్తిప్రసంగమున మహాకవి పలికినాడు. మనోరమమైన యౌవనములో గర్భము కలిగినది. మనోరమమైన సౌందర్యము మర్త్యస్పర్శచే క్షీణత నందుచున్నది. సౌందర్యము సర్వదా వస్తునిష్ఠము, వస్తుతంత్రముమాత్రమే కావలెను. అప్పుడే అపరిచ్ఛిన్నము, అలౌకికము నైన ప్రేమ, ఆనందము కలుగగలవు.

ఈ సందర్భమున కీట్స్ అను నాంగ్లకవి వ్రాసిన 'Ode on a Grecian Urn' అను పద్యము పరిశీలనార్హము. ప్రాచీనగ్రీసు దేశీయులు మరణించినవారి అస్థుల నొక పెద్దపాత్రలో దాచెడివారు. ఆ పాత్రపై పలురకముల చిత్రము లుండెడివి. కీట్స్ చూచిన పాత్రపై నొక ఉద్యానవనము కలదు. ఆ వనవిహారముచేయుచున్న వారిలో నొక ప్రియుడు, అతని ప్రియురాలు కలరు. తన ప్రియురాలి కత్యంతసమీపములోనుండి కించిన్మితగాత్రుడై ముద్దుపెట్టుకొనబోవుచున్నట్లున్నాడు. కాని, అతడు ముద్దుపెట్టుకొనడు, ముద్దుపెట్టుకొనలేడు కూడాను. ఆ సందర్భమున—

"Bold lover, never, never canst thou kiss.
Though winning near the goal yet, do not grieve;
She cannot fade, though thou hast not thy bliss.
For ever wilt thou love, and she be fair!"

అని పలికినాడు. "అత్యంతసన్నిహితుడై ప్రేమోద్రేకమును చూపగలిగినను, ముద్దుగొనలేడు. తావన్మాత్రమున ఖిన్నుడు కారాదు. మర్త్యస్పర్శ లేనంతవరకు సౌందర్యము క్షీణించదు. శృంగారానుభూతితో సౌందర్యము వస్తునిష్ఠత్వమును విడచి, పరిచ్ఛిన్నము, భౌతికము కాగలదు. కావున నాస్థితిలోనే అత డున్న శాశ్వతముగా నతడు ప్రేమించగలడు; శాశ్వతముగా నామె సుందరముగా నుండగలదు" అని కవిభావము. కావుననే శాకుంతలమున తృతీయాంకాంతమునగౌతమీ ఆగమనముచే వారితుడైన దుష్యంతుడేకాంతమున—

"ముహు రంగులిసంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లవాభిరామమ్,
ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమ ప్యున్నమితం న చుంబితంతు" (3-౨౨)

అనినాడు. "మాటిమాటికి వ్రేలితో పెదవిని కప్పుకొని, నిషేధించుమాటలను అస్ఫుటముగా నుచ్చరించుటచే హృద్యమై, స్కంధపరావర్తనశీలమైన ముఖమును ప్రయత్నపూర్వకముగా త్రిప్పియుకూడ ముద్దిడలేకపోయినాడు". అనగా నచుంబితయైన శకుంతల కేవలసౌందర్యమూర్తి. కాగా సౌందర్యమున మర్త్యస్పర్శ (Subjective transformation) పనికిరాదు. చిత్రగతసౌందర్యమున నిది కనబడుటచే, ద్వితీయోపమ మహాకవిచే ప్రయుక్తమైనది.

సూర్యకిరణముల స్పర్శచే పద్మము వికసించుచున్నది. పద్మమునకు మానవస్పర్శ లేదు. రవికిరణజనిత ఉన్మేషమే సౌందర్యాభివ్యక్తిహేతుక మగుచున్నది. అనగా సౌందర్యము జగన్నిష్ఠము. అంతేకాని ఆత్మనిష్ఠము కాదు. రవికిరణములు పద్మమునకు లేని సౌందర్యమును తీసుకొనివచ్చుట లేదు. పద్మమున సౌందర్య మావరకే అంతర్లీనమైయున్నది. తదభివ్యక్తికి సూర్యకిరణములు నిమిత్తము లగుచున్నవి. కావున భిన్నశబ్దమునకు "అవ్యక్తమై ఆచ్ఛాదితమై యున్న సౌందర్యము అభివ్యక్తమగుచున్నది" అను అర్థము చెప్పుకొనవలెను. పార్వతీసౌందర్యము యౌవనోదయమున అభివ్యక్తమైనది. పార్వతి సౌందర్యమూర్తియైనను తూలికచే రూపోన్మీలన మగునట్లు, తేజస్సుచే రూపాభివ్యక్తి యగునట్లు, యౌవనముచే సౌందర్య మభివ్యంజితమైనది.

౫

అటువంటి పార్వతిని "చతురస్రశోభి వపుః" అని తర్వాత నిర్దేశించినాడు. చతురస్ర మనగా నలుచదురమని అర్థము. సౌందర్యము చతురస్రమనిన నలుచదురముగా రూపమున్నదని భావించరాదు. 'అన్యూనాతిరిక్త'మని మల్లినాథుని వ్యాఖ్య. అనగా ఎక్కువతక్కువలు లేని అవయవనిర్మాణము. ఇది పరిగ్రాహ్యము కాదు.

సుందరవస్తువులో భిన్నావయవములు (parts) ఉండకతప్పవు. ఒక్కొక్క అవయవము విశిష్ట రూపయుతమైనను, నానాత్వము సౌందర్యవస్తువులో ఏక

త్వము నందవలెను. సౌందర్యము భిన్నావయవముల సము దాయము కాదు. మేఘదూతలో—

"తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యా ద్యువతివిషయే సృష్టి రాద్యేవ
ధాతుః" (౨-౨౧)

అని యక్షుడు తన భార్యను చిత్రించుచు సుంద రావయవముల నన్నిటిని ఏకత్ర సమావేశ పరచినాడు. భిన్నావయవయోజనలో నతినికి సౌందర్యప్రతీతి కలుగ లేదు గనుకనే, ఆమె బ్రహ్మయొక్క మొట్టమొదటి సృష్టి యని హృదయమును సమాధానపరచుకొనినాడు. కావుననే తర్వాత "సా సన్న్యస్తాభరణ మబలా పేశలం ధారయంతీ" (౨-౩౨) అని ఆమెననుసరించి పలికినాడు. ఆమె ఆభరణరహిత యైనను, సౌందర్య మును ధరించుచునే యున్నదట! కాని ఈ సౌందర్యము విశేషణము కాజాలదు. సౌందర్య మెల్లప్పుడు విశే ష్యమే. అనగా తదితరవస్తుసంచయమునకు సౌందర్య పర్యవసాయిత్వ మండవలెను.

"సర్వోపమాద్రవ్య సముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థ సౌందర్యదిదృక్షయేవ" (౧-౪౯)

అని పార్వతిని వర్ణించుచో కాళిదాసు సౌంద ర్యము భిన్నావయవనిష్ఠమని భావించినట్లు కన్పడినను, సౌందర్య మేకమనియు, వస్తుతంత్ర (Objective) మనియు నొక్కి చెప్పుచున్నాడు.

సౌందర్యము వస్తుతంత్ర మనినచో భిన్నావయ వములు (parts) ఏకసౌందర్యసూత్రముచే (Principle of the Whole) అనుస్యూతములై, తత్సౌందర్య మాదేశించుపరిణామమునకనుసరియనుచున్నవి. అంతర్యామి (Immanent), బహిర్యామి (Transcendent) యైన సౌందర్యము భిన్నత్వములో గల నానాత్వమును నశింప జేసి వాటికి సమగ్రసౌందర్యమున ఆనన్యత్వమును తెచ్చు చున్నది. కావుననే సౌందర్యము అలంకారనిష్ఠము కాదు. "కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం" (౧-౧౮) అని శకుంతలను వర్ణించినాడు. అలంకరణ ములకే శోభ నాపాదించునది సౌందర్యము. అందు వలననే—

"ఆభరణ స్యాభరణం
ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః,
ఉపమానస్యాపి సఖే
ప్రత్యుపమానం వపు స్తస్యాః" (౨-౩)

అని ఊర్వశిని నిర్వచించినాడు. ఊర్వశి స్వర్గము నకే అలంకారమని రంభ యన్నది. వేదాభ్యాస జడులు, తాపసులు ఆమెను సృష్టిచేయలేరు. ఆమె కేవ లము కళాసృష్టి (౧-౧౦). ఆమెరూప మద్వితీయము. ఆమె దర్శనముచే బాహ్యాంతరాత్మ ప్రసన్నమగుచున్న దని పురూరవసు డనుచున్నాడు. అనగా సౌందర్యము ఆధ్యాత్మికతత్త్వము (Spiritual Reality).

కావున శకుంతలయొక్క అవ్యాజమనోహర మైన వపుస్సు శుద్ధాంతదుర్లభము. మర్త్యస్పర్శ లేక పోవుటచే "అనాఘ్రాతం పుష్ప"మ్మను శ్లోకమున (౨-౧౦) ఆమెసౌందర్యము అనాఘ్రాతము, అనా విద్ధము, అఖండము నని పలుకుచు వస్తుతంత్రత్వమును, అమర్త్యత్వమును ప్రతిపాదించినాడు. అనగా ఆమె మర్త్యస్త్రీ కాదు. ప్రభాతరళమైన జ్యోతి భూమి నుంచి ఉదయించనట్లే, ఆమె మర్త్యాంగన కాదు (౧-౨౧). ఆమె "స్త్రీరత్నసృష్టి రపరా" (౨-౯). ఇందుమతి విధాతృవిధానమునుగూడ నతిశయించినదని రఘువంశమున చెప్పినాడు (౬-౧౧). విధాతయొక్క లలితమైన సృష్టియట (౬-౩౭)! అనగా లలితాత్మక మైన కళాప్రపంచమునకు చెందినది సౌందర్యము. అనగా సౌందర్యసృష్టికి లలితమైన, విజ్ఞానయుతమైన యోజన అవసరము.

"అవ్యాజసుందరీం తాం
విజ్ఞానేన లలితేన యోజయతా
పరికల్పితో విధాత్రా
బాణః కామస్య విషదిగ్ధః" (౨-౧౩)

అని అగ్నిమిత్రు డనినాడు. లలితమై విజ్ఞాన వంతమైన యోజన (Contemplative and Penetrative Imagination) వలన సౌందర్యాభివ్యక్తి కలు గును. ఈ సౌందర్య మద్వితీయము, ఏకము. దీనిలో భావలావణ్యముల కైకానుసంధానత్వ ముండును. ఈ ఏకానుసంధానములో Symmetry, Harmony, Proportion అనునవి భావచైతన్యోన్మేషమున రూపా విష్కృతి హేతుకము లగుచున్నవి. ఏతదావిష్కృతి 'చతురస్ర' శబ్దవాచ్యము కనుకనే మహాకవిచే

ప్రయుక్తమైనది. అనగా చతురస్రశబ్దము సౌందర్యాభివ్యక్తిసూచకమైన రూపపరము, లావణ్యపరము.

పార్వతియొక్క శరీరము ఆమెసౌందర్యాభివ్యక్తికి యోగ్యమైన రూపము నొసగునది. కనుకనే ఆమెశరీరము చతురస్రత్వమును శోభింపజేయునది, అనగా చతురస్రత్వమునకు యోగ్యమైనది. 'చతురస్రశోభి'యనగా 'అంగసౌష్ఠవము కాదు'. చతురస్రత్వమును శోభింపజేయు శరీరమున భావలావణ్యముల కేకానుసంధానత్వ ముండుటచే ఆత్మవృత్త్యధీనమైన సౌందర్యభావన, వస్తుతంత్రనిష్ఠమైన సౌందర్యయోజన, పార్వతిలో లలితవిజ్ఞానయోజనల మేళనమునందిఅలౌకిక, ఆధ్యాత్మికసౌందర్యాభివ్యక్తికి నిర్దేశకము లగుచున్నవి. కావుననే ఆమెశరీరము నవయౌవనముచే విభక్తము!

సౌందర్యము పార్వ[illegible] క్రొత్తగావచ్చిన గుణవిశేషణము కాదు. ఆమెలో నావరకే, పద్మగతసౌందర్యమువలె, ఈ సౌందర్యము అంతర్లీనమైయున్నది. యౌవనము తదభివ్యక్తికి నిమిత్తమాత్రమే. ఈ సౌందర్యము ఉన్మీలితము, భిన్నము నై, చివర కభివ్యంజితమైనది.

“ఉన్మీలితం తూలికయేవ చిత్రం” అను శ్లోకమున మరికొంత విశేషార్థ మున్నది. సౌందర్యప్రతీతి త్రిరవస్థాత్మకము (Dialectical). ఈ అవస్థాత్రయమును “ఉన్మీలితం”, “భిన్నం”, “విభక్తం” అను శబ్దత్రయముచే మహాకవి నిర్దేశించినాడు. సౌందర్యము ప్రవృత్తిరహితమై, కేవల నివృత్త్యాత్మకమైన స్థావరపదార్థము కాదు. నివృత్తిప్రవృత్తుల కతీతమై, లోకోత్తర ప్రవృత్త్యాత్మకమైన దీ సౌందర్యము.

కవిభావనాసమున్మీలిత (Subjective Experience) మైన సౌందర్యభానము (Beauty-in-itself, or Being) లో సమగ్రసౌందర్యానుభూతి లేదు. దేశకాలపురుషాతీతమైన సౌందర్యము దేశకాలావచ్ఛిన్నమైన పురుషుని అనుభూతిలో సమగ్రముగ ప్రవేశించలేదు. ఈ భానములో కేవల సౌందర్యభావన (Concept or notion of Beauty) మాత్రమే ఉన్నది. విషయానపేక్షమైన సౌందర్యము సత్య (Existent)మైనను, గగనకుసుమమువంటిది (Abstract) కాగలదు. కావున సౌందర్యప్రతీతిలో ప్రథమావస్థ కేవల మున్మీలన. అనగా ఉన్మీలితశబ్దమునకు Being, Notion, Concept అనునవి ఆంగ్ల పర్యాయములు. ఈ అవస్థలో లౌకికవస్తువు అలౌకికముగా భాసించును.

ద్వితీయావస్థాద్యోతకము 'భిన్న' శబ్దము. కేవల భావనావ్యాపారాధీనమైన సౌందర్యము విషయాపేక్షాత్మకము కాగానే భావనాస్థితమైన ఏకత్వము నశించి, జగద్రూపానుగుణమైన నానాత్వము సౌందర్యమునకు సిద్ధించుచున్నది. దీనినే Negation, Differentiation అని ఆంగ్లమున నందురు. ఈ యర్థమున “భిన్న”శబ్దమును మహాకవి ప్రయోగించినాడు. నానాత్వముతో సౌందర్యము పరిచ్ఛిన్నాత్మకము గాక, వస్తునిష్ఠ మగుచున్నది. అనగా అలౌకికసౌందర్యమీయవస్థలో లౌకికముగా భాసించుచున్నది(Beauty-for-itself).

కాని సౌందర్యము నానాత్వము కాదు. కేవల వస్తుతంత్రమును గాదు. వస్తునిష్ఠమై అద్వితీయమైన సౌందర్యము ఆత్మేంద్రియములచే అనుభూతమైనప్పుడే పరిచ్ఛిన్నాత్మ నాకరించు నీహారము మాయము కాగలదు. ఆ సమయముననే దేశకాలాద్యతీతమైన అనుభూతి రాగలదు. ఈయనుభూతిలో భావనాశ్రితమైన లాలిత్యము, వస్తుతంత్రమైన విజ్ఞానము కలవు. ఇంద్రియావరణమున ఆత్మచే లలిత రూపోద్భాసితమైన తత్వజ్ఞానము ఆస్వాదింపబడుటయేసౌందర్యప్రతీతి. అనగా భావనయొక్క ఉన్మీలనము, వస్తుతంత్రముయొక్క భిన్నత్వము అను రెంటికిని సమన్వయము కుదరగా, తన్మేళనము పొందు పరిణామమే (Synthesis) సౌందర్యము. కావున “విభక్త”మను శబ్దమునకు ఆంగ్లమున Synthesis అని వ్యవహారము. విభక్తమనగా ఉన్మీలనమునకు, భిన్నత్వమునకు ఏకానుసంధానత్వము, అనన్యత్వము నాపాదించుట (Beauty-in-and-or-itself).

ఈ అవస్థాత్రయమున తూలికచే నున్మీలితమైన చిత్రమనుటలో నాత్మభావన (Subjective Mind) కలదు. సూర్యకిరణములచే భిన్నమై వికసించిన పద్మమువలె సుందరమనుటలో సౌందర్యము వస్తుతంత్ర మను భావన (Objective Mind) కలదు. నవయౌవనముచే చతురస్రత్వమును శోభింపజేయు రూపనిష్పాదన విభక్తమైన దనుటలో సౌందర్యాభివ్యంజన విషయనిష్ఠమై, అద్వితీయమై, 'భగ్నావరణమైన చిత్' అను లలిత విజ్ఞానానుభూతి (Absolute Mind) కలదు. ఈ లలితవిజ్ఞానానుభూతియే సౌందర్యము. ఆ సౌందర్యమే పార్వతి.

ఈ సౌందర్యము ఆత్మనిష్ఠము కాదనుటకు శకుంతలావర్ణన చాలును. ద్వితీయాంకమున—

"అనాఘ్రాతం పుష్పం
కిసలయ మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం
మధు నవ మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం
ఫల మివచ తద్రూప మనఘం
నజానే భోక్తారం
క మిహ సముపస్థాస్యతి విధిః" (౨-౧౦)

అని దుష్యంతుడు పలికినాడు. పుష్పమును వాసన చూడకపోయినను పుష్పగతసౌరభము లేదన వీలులేదు. ప్రసవసౌరభము నిరపేక్షమై విరాజిల్లునది. ఇది కేవలభావనాత్మకము కాదు. వస్త్వంతర్గతమైన దగుటచే సౌరభము సుందరము. వ్రేళ్ళను కత్తులచే నరుకబడని చిగురుటాకువంటిది శకుంతల. శాఖాగ్రములపై ఆకుల మధ్య ఉన్నప్పుడే కిసలయము సుందరముగా భాసించును. అనగా ప్రకృతి పరిసరములలోనే సౌందర్యము ప్రకాశించును. కాగా ప్రకృతిలో నంతర్యామిగా వర్తించునది సౌందర్యము. మానవస్పర్శ సౌందర్యవిచ్ఛేదకారి.

రత్నము శిలామధ్యమున అవినాభావసంబంధము కలిగియుండును. శిలనుంచి వేరుచేయబడని రత్నమువంటిది శకుంతల యనుచో, పునః సౌందర్యాభివ్యక్తికి మానవస్పర్శ నిషిద్ధమగుచున్నది. ఆస్వాదింపబడని క్రొత్తమధువుతోగూడ శకుంతల పోల్చబడినది. అనగా సౌందర్యమున మనోవృత్తులు కూడవు. అననుభూతవస్తువును అనుభవించవలెనని మనస్సు ప్రవర్తించును. అనగా శృంగారాది రసానుభూతిలో దేశకాలోపహితప్రవృత్తియుండును, సౌందర్యానుభూతిలో దేశకాలాతీతప్రవృత్తియుండును. ఈ ఉపమలలో సౌందర్యము ఇంద్రియముల నాశ్రయించుకొని ఉండదని నిర్ణీతమగుచున్నది.

కాగా సౌందర్య మాధ్యాత్మికము, అపరిచ్ఛిన్నము నైన చైతన్యము. పుణ్యముల ఫలము, అఖండము నైనది సౌందర్యము. "అఖండ" శబ్దమునకు "పూర్ణం" అని వ్యాఖ్య చేసినారు. కాని,కళాప్రపంచమున సౌందర్యేతర శబ్దములు, భావములు సహితము సౌందర్యమును విశేష్యమున పర్యవసితములు కావలెను. ఈ సౌందర్య పర్యవసాయిత్వమే అఖండశబ్దార్థము.

౮

అనగా సౌందర్యము నిష్కామయోజనచే ననుభూతియోగ్యము. శృంగారమున కామప్రవేశ మున్నది. అనగా శృంగారదశలో వ్యక్తికి పరిచ్ఛిన్న జగత్తులోనే అనుభూతి. ఈ అనుభూతి సహితము తత్తద్దేశకాలానుగుణమునైన మనోవృత్తులచే ప్రేరితమగుచున్నది. కాని సౌందర్యము స్వేచ్ఛతో జగత్తు నధిష్ఠించి, జగత్ప్రవృత్తికి కారకమగుచున్నది. అనగా సౌందర్యము వస్తుతంత్రమై ఇంద్రియావస్థ కుచితస్థితిని (Sensuous Existence) కలిగియున్నప్పటికిని, తదతీత మగుచున్నది. అనగా సౌందర్యము మానసిక, ఆధ్యాత్మికానుభూతుల నీయగలగవలెను.

ఈ సౌందర్యావగాహనకు మాత్రమే తత్త్వాన్వేషణ జరుగును. కాని సౌందర్యానుభూతికి తత్త్వాన్వేషణ సముద్దిష్టమైన విశిష్టవిమర్శనా ప్రవృత్తి (Critical Analysis) అనవసరము. కావున మధుకరరేఫమును జూచి దుష్యంతుడు "వయం తత్త్వాన్వేషా న్మధుకర! హతా స్త్వం ఖలు కృతీ" (౧-౨౦) అనినాడు. అనగా ఈ అనుభూతిలో వివిధ విభావానుభావాలు, స్థాయిభావాలు మొదలగునవి ఉన్నను, జ్ఞానాకారమైన ఆనందానుభూతియే కలుగుచున్నది. "ఆనంద రూపతా సర్వరసానాం" అని అభినవభారతిలో (పుట ౨౭౩) అభినవగుప్తుడు పల్కుచు,"సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదో న విషయేభ్యో విపరివృత్త్యా" (పుట ౩౪౦) అన్నాడు. అనగా రసము లన్నిటిలోను శాంతమే అనుభూయమాన మగుచున్నది. శాంత మనగా తత్త్వజ్ఞానమేనని అభినవగుప్తుడు సత్యమును వచించినాడు. ఈ విధమైన శాంతమే సౌందర్యము. ఇది కాళిదాసని నట్లు "లలితవిజ్ఞానయోజన". ఈ లలితవిజ్ఞానయోజనయే శాంతము, సౌందర్యము. తజ్జన్యమై, కామోపహితమై, ఆత్మాశ్రితమైన ప్రవృత్తి శృంగారము. ఈభేద మత్యంతము ముఖ్యము. శాంతము సౌందర్యము. ఇదే సత్యము. నిర్వికల్పకమైన రసమాత్రమూర్తి సౌందర్యము.

"అష్టానా మిహ దేవానాం
శృంగారాదీన్ ప్రదర్శయేత్,
మధ్యేచ దేవదేవస్య
శాంతం రూపం ప్రకల్పయేత్."




MANUFACTURERS:

**SRIVIS PERFUMERY WORKS,**

S. VISWANADHAM & CO.,

44. BUNDER ST. G. T. MADRAS.

*Mehta's...*

# SUNDARI ELIXIR



గర్భాశయరోగాలకు

ప్రసిద్ధ బలవర్ధకౌషధము
సర్వవిధాలైన బహిష్టు చిక్కులకూ
అనుపమ నివారిణి
సుప్రసిద్ధ భిషగ్వరులచే
ప్రశంసింపబడినది.

**K. S. MEHTA & CO.,** 250, CHINA BAZAAR, MADRAS.

లోకప్రసిద్ధిపొందిన

# పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం
R. S. సుగంధ ముక్కుపొడి.
అన్నిటిలో సాటిలేనిది.
ధర వివరములకు వ్రాయుడు.
తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.

## ఆయుర్వేద వైద్యనిలయంవారి

## "లుకోరియా క్యూర్"

స్త్రీల గర్భాశయ సంబంధమైన సమస్త వ్యాధులను నివారించి ఆరోగ్యవతులనుగా చేయుటలో సాటిలేని దివ్యౌషధము.

90 మాత్రల ప్యాకెటు రు. 2-8-0.
ప్యాకింగు పోస్టేజి అదనము.

**ఆయుర్వేద వైద్యనిలయం,**

రామానాయుడుపేట, మచిలీపట్టణం.

భవానీ మెడికల్ స్టోర్సు—రాజమండ్రి.
శివరాం అండ్ సన్సు—మచిలీపట్టణం,
అన్ని మందుల షాపులలో అమ్మబడుచున్నది.






**గర్భాశయరోగనివారిణి**

ప్రతి వనితకు, గర్భకోశ సంబంధమైన వ్యాధులనుండి విముక్తి నొసగి ఆనందం చేకూర్చుతుంది.




**కేసరికుటీరం లిమిటెడ్, రాయపేట, మద్రాస్.**

నైజాం రాష్ట్రానికి, ఆంధ్రజిల్లాలకు,
తమిళనాడుకు ఏజెంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్,**

సికందరాబాదు - బెజవాడ - మధుర.

# వాగరాలు



## = శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

అన్ని జంతువులూ శబ్దం చేసేవే. మనుష్యుడు చేసే శబ్దంలో ఒక విశేషం ఉన్నది. మనుష్యుడు మాట్లాడే జంతువు. 'వ్యక్తవాచామ్'అని పాణిని ఒక సూత్రంలో ప్రయోగించాడు. వ్యక్తవాక్కు కలవాళ్లు ఎవరు? అని ప్రశ్నవస్తే 'కోడి' అని ఒకాయన సమాధానం చెప్పుకున్నాడు. అది 'కుహూడ్'అని ఆగిఆగి, అందఱికీ తెలిసేలాగున కూస్తుందిగనుక. "అకారాది వర్ణాత్మకమైన వాక్కు కలవాడే వ్యక్తవాక్కు. అది మనుష్యులకే ఉన్నది"అని పతంజలి స్వసిద్ధాంతం చెప్పుకోవలసివచ్చింది. ఈ వాక్కుకు ఒక అర్థంకూడా ఉన్నది. మనస్సులో ఒక అర్థం గ్రహించి మనం దానిని తెలియజేయుటకు ఒక శబ్దం ప్రయోగిస్తున్నాము. ఈ శబ్దం అనేది ఒక ధ్వని. అకారాదివర్ణాత్మకమైన ఈ ధ్వని చెవికి తగులగానే శ్రోతకు ఒక అర్థస్ఫురణ కలుగుతున్నది. గోవు అనగానే సాస్నాలాంగూల కకుదఖురవిషాణములు గల జంతువు అని బుద్ధికి గోచరిస్తుంది. అర్థసంప్రత్యయము కలుగజేస్తాను అనేగదా ప్రతిమనుష్యుడు శబ్దములను ప్రయోగించుట (అర్థాన్ సంప్రత్యాయయిష్యామి ఇతి శబ్దాన్ ప్రయుంక్తే)

పరధ్యానంగా ఉన్నప్పుడు ఎంత బిగ్గరగా అఱచినా వినపడదు. ఏదైనా ఒక ప్రత్యక్షం కావాలి అంటే ముందు ఆత్మ మనస్సుతో సంయోగం పొందాలి అని నైయాయికులు అంటారు. తరువాత మనస్సు ఇంద్రియంతో- శ్రవణేంద్రియంతోనో, త్వగింద్రియంతోనో- సంయోగం పొందాలట. ఇంద్రియం అర్థంతో కలిస్తే అప్పుడు ప్రత్యక్షం- శాబ్దప్రత్యక్షమో, త్వాచప్రత్యక్షమో-కలుగుతుందట. పరధ్యానంగాఉన్నప్పుడు ఆత్మమనస్సులు సంయోగించి ఇంద్రియద్వారమున సిద్ధముగా లేవుకాబట్టి ప్రత్యక్షజ్ఞానం కలుగుటలేదు అని అంటారు. తేలుకాటు ఆ మనస్సుని, ఆత్మని కిందకు దింపలేదా అని అడిగితే బాగా పరధ్యానంలో ఉంటే, పరాత్పరధ్యానంలో ఉంటే దింపలేదు అని సమాధానం చెప్తారు. మాట వినపడాలి అంటే ఇంతపని జరగాలి.

మాట్లాడాలి అంటే దానికీ ఒక క్రమం చెప్పుకున్నారు పాణినీయశిక్షలో. మాట్లాడదలచినప్పుడు ఆత్మ బుద్ధిచేత అర్థములను గ్రహించి, మనస్సుని ప్రయోగిస్తుంది. ఆ మనస్సు కాయాగ్నిని ప్రేరేపిస్తుంది. కాయాగ్నినుంచి మారుతం బయలుదేరుతుంది. ఈ మారుతము ఉరఃప్రదేశమునందు మంద్రస్వరమును కలుగజేస్తుంది. కంఠానికి వచ్చేటప్పటికి మధ్యమస్వరమై శిరస్సునకు ఎక్కి అక్కడ తారస్వరమై ఇంకా పైకి పోలేక నోటిలోకి వచ్చి వర్ణరూపంగా బయటపడుతుంది. మనం మాట్లాడుతున్నప్పుడు గాలిపీల్చుకుండా ఉండి నోటితో గాలిని విడిచిపెట్టి శబ్దం చేస్తూ ఉంటాము. బుద్ధిధార మారుతరూపం దాల్చి, వాగ్రూపంతో మనకు ప్రత్యక్షమౌతున్నది. బుద్ధికి వాక్కుకు అవినాభావసంబంధం కనబడుతూనే ఉన్నది. ప్రయోగముచేత అభిజ్వలితమై శ్రోత్రోపలబ్ధమై బుద్ధిచే నిర్గ్రహింపబడినది శబ్దము. అది ఆకాశదేశమునకు సంబంధించినదని పతంజలి.

వాక్కు అనేది లేకపోతే ఆలోచన అనేదే ఉండదు అని భర్తృహరి అంటాడు.* నవ్యవైజ్ఞానికులు ఈ మాట ఒప్పుకోరు. మంచి ఆలోచన చెయ్యగలిగిన మూగవాళ్లు అనేకమంది ఉన్నారు. నక్కకు ఉన్న ఆలోచన ఎవరికీ లేదు. మాటలతో పనిలేకుండా

* 'Linguistic speculation of the Hindus' by P. Chakravarthi.

అర్థములైన వస్తువులను మనస్సులో చిత్రించుకొని ఆలోచన చేసుకొనవచ్చును అని పాశ్చాత్యవైజ్ఞానికుల సిద్ధాంతము. కాని, మూగవాళ్లకు మాట బయటకు రాకపోయినా ఈ ప్రపంచకంలో పుట్టి పెరుగుతున్నారుకాబట్టి శబ్దసంకేతము తెలుసుకొన్నారు. అందువలన వాళ్లకు ఆలోచన ఉన్నది. నిజమైన ఆలోచన ఉండాలి అంటే అది మాటలతోనే జరగాలి. దిగ్వాచకశబ్దములు, సంఖ్యాశబ్దములు, సంజ్ఞాశబ్దములు మొదలైనవి శబ్దంతో సంబంధంలేకుండా ఆలోచనలోకి రావు. మనస్సుకి స్వాంతం అనికూడా ప్రయోగిస్తారు. ఈమాట 'స్వన శబ్దే'అనే ధాతువునుంచి వచ్చినదే. శబ్దబ్రహ్మమును ఒప్పే వైయాకరణులకు ఆత్మ శబ్దమే, మనస్సూ శబ్దమే. వాక్కుతో సంబద్ధముకాని ఆలోచన వారు ఊహించలేరు.

* "సఏవ జీవో వివరప్రసూతిః
ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః,
మనోమయం సూక్ష్మ ముపేత్య రూపం
మాత్రాః స్వరా వర్ణ ఇతి స్థవిష్టః"

ఆధారాది షట్చక్రములందు అభివ్యక్తుడైన జీవుడు, నాదవంతమైన ప్రాణముతో హృదయమును ప్రవేశించి, మనోమయమైన సూక్ష్మరూపమును దాల్చి, మాత్రలు (హ్రస్వదీర్ఘప్లుతములు), స్వరములు (ఉదాత్తానుదాత్తస్వరితములు), వర్ణములు (అకారాదివర్ణములు) అనే అతిస్థూలమైన వైఖరితో బయటపడును అని కృష్ణుడు ఉద్ధవుడికి ఉపదేశించాడు. 'మనస్సులోని మాట చెప్పటం' అని లోకంలో ఉన్న మాట శ్రీకృష్ణుడి ఉద్దేశంలో సరి అయినదే. పాశ్చాత్యవైజ్ఞానికులకు కాకపోయినా. †

అర్థంలేని శబ్దం లేదు. శబ్దప్రయోగమంతా అర్థగత్యర్థమై ఉన్నదని పతంజలి. కొన్ని అర్థాలకు అనేక శబ్దాలు ఉన్నై. కొన్ని శబ్దాలకు అనేకఅర్థాలు ఉన్నై. ఈ శబ్దార్థములనిర్ణయం మొదట ఎవరుచేశారు? వైయాకరణులకు దీనితో పనిలేదు. వారికి ఎంతసేపూ శబ్దంమీదనే చూపు. శబ్దము వ్యర్థమైనాసరే, సాధువుగాఉంటే సరి, వారు సంతోషిస్తారు. పైగా పతంజలి హుంకారము చేస్తాడు 'ధాతుప్రాతిపదిక ప్రత్యయనిపాతములకు అర్థము ఆదేశించుటకు ఎవరయ్యా సమర్థులు'అని.

అయితే వాక్కు ఏలాగు పుట్టింది, వాక్కుకు, అర్థానికి సంబంధం ఎవరైనా కుదిర్చారా లేక స్వయంవరం జరిగిందా? ఈ ప్రశ్నలు అరిస్టాటిల్‌ని అడిగితే 'ఈ శబ్దానికి ఈ అర్థం ఉండాలి అని మొట్టమొదటి మనుష్యులలో ఒక ఒడంబడిక కుదిరింది' అంటాడు. కోతి కిచకిచలలోనుంచి మనుష్యవాక్కు బయలుదేరింది అనే డార్విన్ సిద్ధాంతాన్ని ఆమోదించే ఈ రోజుల్లో అరిస్టాటిల్ మాట అసందర్భంగా కనబడుతుంది. మొట్టమొదటి మనుష్యులు మాటలురానివాళ్లు అని మనం ఒప్పుకుంటే ఆ మూగమొద్దులు ఒకచోట కూర్చొని, ఈ అర్థానికి ఏమి నామకరణం చేద్దాము అని సభచేసి, తలలూ తలలూ పట్టుకుంటే ఏమి ప్రయోజనం?

డార్విన్ మతావలంబకులలో కొంతమంది "శబ్దానుకరణంనుంచి భాష బయలుదేరింది. కాకా అని అఱచినది కాకి, కోకో అని అఱచినది కోకిల అయినది" అని అంటారు. మరికొందరు "అహో, ఓహో మొదలైన ఆశ్చర్యద్యోతకములైన శబ్దములనుంచి భాష బయలుదేరింది" అంటారు. ఈ రెండూకాక ఇంకా కొన్నిసిద్ధాంతాలు తెల్లవారు ప్రతిపాదించారు. ఈ సిద్ధాంతాలన్నీ కూడా భాషలో కొన్ని శబ్దాలు ఏలాగు పుట్టినవో చెప్పగలవుగాని భాష అంతా ఏలాగు పుట్టినదో చెప్పలేవు. విశేషించి సర్వాంగసంపూర్ణమైన సంస్కృతభాష ఈ పిల్లసిద్ధాంతాలకు లొంగదు. యాస్కుడు అనేకశబ్దాలకు నిర్వచనం చెప్పుతున్నాడు. ఆయన మతంలోను, శాకటాయన మతంలోను శబ్దాలన్నీ ధాతువులనుంచి వచ్చినవే. ఈ ధాతువులు ఎక్కడనుంచి వచ్చినై?

---

* భాగవతం ౧౧ స్కం. ౧౨ అ. ౧౭ శ్లో.

† 'The popular belief that there can be no thought without language is incorrect' W. B. Pillsbury — quoted in Chakravarthi's 'Linguistic speculation of the Hindus.'

మాట్లాడని మనుష్యులు ఒకప్పుడు ఉండేవాళ్లు అని చెప్పే సిద్ధాంతము ఊహాభాగంలోనిదే. ఇప్పటికీ కొన్ని అనాగరికజాతులున్నై. వారందరూ ఏదో ఒక భాష మాట్లాడుతూనేఉన్నారు. బాగా అనాగరిక జాతులలో దక్షిణ ఆఫ్రికాలోని బుష్‌మన్‌జాతి మొదటిది. వాళ్లు ఇదివరకు చాలామంది ఉండేవాళ్లు గాని ఇప్పుడు ౭౫౦౦ మంది * ఉన్నారు. మెల్లిగా అంతరించిపోతున్నారు. వాళ్లు పొట్టిగా పృథుజఘనులై ఉంటారు. చెవికి తమ్మె లేదట-పోగులుపెట్టుకోటానికి వీలులేదు. భూమి తవ్వగా వచ్చిన దుంపలు తిని బ్రతుకుతారు. వాళ్ళ భాష వాళ్ళకు ఉన్నది. ప్రతి జాతి వృద్ధిచెందుతుంటే వీళ్లు, చెవికి తమ్మెకూడా పుట్టకుండానే, అంతరించిపోతున్నారు. అనాగరికజాతులు, నాగరికజాతులు పక్కపక్కనే ఎప్పుడూ ఉన్నై అని అనుకోటానికి ఏమీ అభ్యంతరం కనబడదు. మొట్టమొదటి మనుష్యులు మాటలు రానివాళ్లు అనటానికి ఏమీ ఆధారం కనుబడదు. వాగ్ద్వార ఎప్పుడు ఉన్నదో అప్పుడే అక్కడ మాట ఉన్నది అని నిర్ధయంగా చెప్పవచ్చును.

అయితే మాటలు వింటూఉంటేనేగాని పిల్లలకు మాటలు రావు. ఇతర మనుష్యసంపర్కంలేకుండా పిల్లలను ఉంచితే వారి నోట మాట వస్తుందా రాదా అని అక్బరుచక్రవర్తి సందిహానుడై, ఆవిధంగా ఒకరిద్దరిని ఉంచి, వాళ్లని మూగవాళ్లని చేశాడని ఒక కథ ఉన్నది. ఒకరిద్దరిని విడిగా ఉంచితే తెలియదుగాని, ఒక వందమందినో రెండు వందలమందినో ఒకచోట ఉంచి,వాళ్లని పెంచటానికి మూగవాళ్ళని పెట్టి, పిల్లల చెవికి మాట సోకకుండా పెద్దవాళ్లు అయేదాకా పెంచి చూస్తే, వాళ్లలో వాళ్లు ఒకరి గొడవ రెండవవాడికి తెలియజేయుటకు ఏభాష అల్లుతారో తెలుస్తుంది. ఈ పద్ధతిలో పరిశోధనలు నవీనవైజ్ఞానికులు ఇంతవరకు ఎందుకు చెయ్యలేదో ఆశ్చర్యంగా ఉన్నది. ఈమధ్యన అడివిలో (పర్షియాలో) గజల్ లేళ్ళతోబాటు పెరిగి వాటిమాదిరి కూత కుయ్యటంతప్ప మనుష్యశబ్దం చెయ్యటం చేతకాని పిల్లవాడిని వేటాడి పట్టుకున్న సంగతి వార్తాపత్రికలలో అందరూ చూసినదే. మాట్లాడే మనుష్యుల సంపర్కం ఉంటేనేగాని పిల్లలకు మాటలు రావు.

వాక్కు ఏలాగు పుట్టింది, వాగర్థముల సంబంధం ఎవరు కుదిర్చారు అనే ప్రశ్నలకు పరిశోధనలఫలితంగా ఎప్పటికైనా సమాధానం వస్తుంది అన్నమాట కలలో వార్త. అర్థంలేని సిద్ధాంతాలు ప్రతిపాదించి, మన కాపేయస్వభావం సూచించి, డార్విన్ సిద్ధాంతాన్ని బలపరుచుటకంటె ఈ భారం అంతా ఒక సృష్టికర్త మీద పడవెయ్యటంలో సుఖం ఉన్నది. భగవంతుడు ఒకడు ఉన్నాడని ఒప్పటం నవ్యవైజ్ఞానికుల బుద్ధికీ, దర్జాకూ లోపమే. కాని మన తెలివి పనిజేయనప్పుడు సృష్టికర్తయే నామరూపములను సృజించి మనుష్యులకు నేర్పినాడు అనటంలో ఒక సులువు ఉన్నది. వాక్యపదీయకర్త భర్తృహరి ఇలాగ అన్నాడు: "విషమమైన మార్గంలో గుడ్డివాడు, అన్యసహాయం లేకుండా, తడుముకుంటూపోతే పడకుండా ఉండడు. అనుమాన ప్రమాణంచేత, హేతువాదంచేత ఈ సంగతులు అన్నీ కనిపెడతానని అన్నవాడి గతికూడా అంతే. కాబట్టి అపౌరుషేయమైన శ్రుతిని ఆశ్రయించి శిష్టులచేత శబ్దానుశాసనం చేయబడ్డది."

'నామరూపే వ్యాకరోత్'- నామరూపములు శబ్దార్థములు సృష్టికర్త సృజించాడు అని ఉపనిషద్వాక్యం. 'భూ రితి వ్యాహరన్ స భూమి మసృజత' ఆయనగారు 'భూ' అనేటప్పటికి భూగోళం తయారు అయిందట. అలాగే మిగిలిన అర్థములన్నీ వచ్చినవట. ఈ సృష్టికర్తస్థానంలో వైయాకరణులు వాక్కుని నిలబెట్టారు. 'వా గేవ విశ్వా భువనాని జజ్ఞే' వాక్కువలన ప్రపంచకమంతా పుట్టినది. వాక్కు అనేది ఒకదారం, నామము అనేది ఒక ముడి. ఈ దారంతో, ముడితో ఈ ప్రపంచకమంతా బద్ధమై ఉన్నది అని వేదం. "వాక్ తంత్రిః నామాని దామాని తస్యేదం వాచా తంత్ర్యా నామభిః దామభిః సర్వం సితం"-ఇంతకంటె అందంగా వాగ్వ్యాపారం ఎవరు వర్ణించగలరు! ఈ వాక్కు నిత్యమైనట. వైయాకరణులు, మీమాంస

* Life 27 Feb 47.

కులు నైత్యశబ్దికులు.[1] నైయాయికులు కార్యశబ్దికులు.[2] శబ్దము, అర్థము, శబ్దార్థసంబంధము లోకంలో స్వతః సిద్ధమై నిత్యముగా ఉన్నవని పతంజలి చెప్పేఉన్నాడు గదా! శబ్దము నిత్యము అని చెప్పిన పతంజలికి లోక వ్యవహారంలో శబ్దము అనిత్యము అని తెలుసును. 'ఉచ్చరితప్రధ్వంసినః ఖల్వపి వర్ణాః, న వర్ణో వర్ణస్య సహాయః' ఉచ్చరించగానే వర్ణములు నష్టమైపోతున్నై. ఒకవర్ణము మఱియొక వర్ణమునకు సహాయకారిగా ఉండదు అని అంటాడు. కాబట్టి వైయాకరణులు శబ్దము నిత్యము అని చెప్పినప్పుడు అది లౌకికమైన శాబ్దప్రత్యక్షమునుగురించి చెప్పిన మాట గాదు.

"అనాదినిధనమై, అక్షరాత్మకమైన శబ్దతత్త్వము అర్థరూపముగా వివర్తముపొంది జగత్తుయొక్క సృష్టికి కారణమైనది. కాష్ఠములో దాగిఉన్న జ్యోతి అభిజ్వలితమై ఇతర వస్తువులను ప్రకాశింపజేయునట్లు, బుద్ధిస్థమైన శబ్దము, స్ఫోటము, భిన్నభిన్నఘటపటాది శబ్దముల ప్రత్యక్షమునకు కారణమగుచున్నది. దీపము కనుబడకుండాఉండి కాంతిని చాలాదూరము ప్రసరింపజేసినట్టు స్ఫోటము కనుబడకుండా ఉండి ధ్వనిని మాత్రము తెలియజేయుచున్నది" అని భర్తృహరి వాక్యపదీయంలో వ్రాసుకున్నాడు.

వాగ్ద్వారంనుంచి వాక్కు వస్తున్నప్పుడు అది ఉత్పన్నమైనదా, అభివ్యక్తమైనదా? శబ్దము నిత్యము అని వైయాకరణుల మతం ఒప్పుకుంటే అభివ్యక్తమైనది అనాలి. డప్పు వాయిస్తే చప్పుడు ఔతుంది. ఈ చప్పుడు డప్పులో ఇదివరకు ఉన్నదా, కొత్తగా వాయింపుతో పుట్టినదా? డప్పులోనే ఉన్నది, అది వాయింపుతో అభివ్యక్తమైనది అన్నవాడు వైయాకరణుడు. కార్యకారణభావం చెప్పి వాయింపులోనే ఉన్నది అన్నవాడు నైయాయికుడు. వైయాకరణులకు తాంత్రికులు తోడు ఉన్నారు. వారూ నైత్యశబ్దికులే. వారికి మొదటినుంచి అక్షరాలతోనే పని. వాటిని మాతృకలని చెప్పి, పంచభూతాత్మకమైన ఈ సృష్టిని అంతా వాటినుంచి వివర్తింపజేస్తారు. లోకజ్ఞానము మటుకే కల వైజ్ఞానికులు ఇదంతా నమ్మటానికి వీలు లేకుండా ఉన్నది అని అంటే, పెద్దలు దానికి ఒక సమాధానం చెప్తారు. "నభః పతం త్యాత్మసమం పతత్రిణః, తథా సమం విష్ణుగతిం విపశ్చితః"[3]- పిట్టలు అన్నీ ఎగిరేవే కాని అన్నీ ఒక్కమాదిరిగా ఎగురవు. కొన్ని ఎక్కువగా, కొన్ని తక్కువగా తమ శక్తిని అనుసరించిపోతై ఈ అనంతమైన ఆకాశంలో. అలాగే పండితులుగూడా యథాశక్తి తెలుసుకుంటారు, విష్ణుగతిని. కొందఱు బాగా తెలుసుకుంటారు; కొందఱు కొంచెమే తెలుసుకుంటారు. తమ మతం ఒప్పనివాళ్లను అజ్ఞులు అనటానికి ఛాందసులు సందేహించరు.

"దైవీం వాచ మసృజంత దేవాః, తాం విశ్వరూపాః పశవో వదంతి." దేవనిర్మితమైన 'దైవీవాక్కుని' నానారూపులైన ఈ పశువులు ప్రయోగించుతై. ఇన్ని భాష లుండగా సంస్కృతము ఒకటే 'దైవీవాక్' ఎందుకు కావలసివచ్చినది! అకారాదివర్ణములనే మాతృకలని తాంత్రికులు ఎందుకు వ్యవహరించారు? 'దైవీవాక్' అయిన సంస్కృతము ఒకటే లోకంలో ఉండక ఇన్ని మానవభాషలు ఎందుకు ఉన్నై? ఈ ప్రశ్నలకు ఎవరూ సరిగా సమాధానం చెప్పరు. ఇప్పటి సంస్కృతం, గ్రీకు, పర్షియన్ వగైరా భాషలకు మాతృక ఏదో ఒకటి పూర్వం ఉండిఉండాలనీ, దాని నుంచి ఈ భాషలన్నీ పుట్టినవనీ నవీనవైజ్ఞానికులు చెప్తారు. మనవాళ్లను ఈ ప్రశ్నలు అడిగితే, మొదట్లో ఒక సంస్కృతమే ఉన్నదని, దానినుంచి మిగిలిన భాషలన్నీ బయలుదేఱిన వని నిర్భయంగా సమాధానం చెప్తారు. అప్రయుక్తశబ్దములు[4] ఉన్నవి అని కాత్యాయనుడు అన్నాడు. ఈ శబ్దాలను నువ్వు శాసించటం ఎందుకు, అప్రయుక్తములని చెప్పటం ఎందుకు, చెప్పకుండాఉంటే సరిపోదాఅని ఆక్షేపం వస్తే "ఇవన్నీ దేశాంతరంలో ప్రయోగిస్తారు. శబ్దప్రయోగవిషయము మహాంతమైనది—మూడు లోకములు, సప్తద్వీపములు గల భూమి" అని పతంజలి సమాధానం చెప్తాడు. ముల్లో

1. శబ్దము నిత్యము అని చెప్పేవాళ్లు.
2. శబ్దము కార్యము (అనిత్యము) అని చెప్పేవాళ్లు.
3. భాగవతం. ౧ స్కం, ౧౮ అ, ౨౩ శ్లో.
4. శబ్దము అంటే సంస్కృతశబ్దమే.

కాలలో సంస్కృతశబ్దప్రయోగం ఉన్నదని పతంజలి చెప్పిన మాట విని ఇప్పటివాళ్లు నవ్వకమానరు. ఈ మధ్యన సర్ జోన్సుగారు (Astronomer Royal) మన దేశం వచ్చినప్పుడు ఒక ఉపన్యాసం ఇచ్చాడు. 'ఈ భూగోళంలోనే కాకుండా మిగిలిన గోళాలలో కూడ ప్రాణి ఉండవచ్చును. ప్రాణి జీవించుటకు పరిస్థితులు అనుకూలంగా ఉన్న చోటునల్లా ప్రాణి ఉన్నాడని అనుకోటానికీ, ఆ యా గోళాలలో సూర్య చంద్రగ్రహసంపత్తి మనదేశంలోవలెనే ఉన్నదని అనుకోటానికీ ఏమీ అభ్యంతరం లేదు" అని దాని సారాంశం. ప్రాణి ఉన్నాడు అంటే వాడినోట మాట ఉన్నదనే అనుకోవాలి. వాడు ఏ భాష మాట్లాడుతాడో? సంస్కృతం మాట్లాడుతాడు అని పతంజలి చెప్పిన మాట నమ్మమని చెప్పటం లేదు. పతంజలిమాటలకు నవ్వగలిగినవాళ్లు ఈ నవీనవైజ్ఞానికుల కబుర్లకే నవ్వ గలిగిఉండాలి.

శబ్దము                    ప్పి నైయాయికులు కూడా శబ్దార్థముల సంబంధము ఒక సంకేతమని, అది భగవదిచ్ఛవలన వచ్చినదని చెప్తారు. శబ్దం ప్రయోగించటం అర్థం తెలియజేయవలెననేగదా! 'అర్థకృతేన నామశబ్దేన భవితవ్యమ్' శబ్దము చెవికి తగిలి అర్థసంప్రత్యయము కలుగజేసి కనుబడకుండాపోతున్నది. ముఖ్యమైనది అర్థమే. అలాగు ఉన్నప్పుడు సాధుశబ్దప్రయోగము చెయ్యాలి అని అనవసరంగా దానికోసం శ్రమ పడటం ఎందుకు? అపశబ్దం ప్రయోగిస్తే చాలదా? అని మాటలతో కాలం వృథాపుచ్చని కార్యశూరులు అంటారు.

అర్థం తెలియజేయవలె నంటే మాటమాటుకూ ఎందుకు? "అంతరేణాపి శబ్దప్రయోగం బహవోఽర్థా గమ్యంతే, అక్షినికోచైః పాణివిహారైశ్చ" చేతులు తిప్పి, గుడ్లుతిప్పి చాలామటుకు అర్థసంప్రత్యయము కలుగజేయవచ్చును అని పతంజలికే తెలుసును. అపశబ్ద ప్రయోగంకూడా అనవసరమే. అర్థం బాగా తెలియజేయవలెనంటే ఏదో ఒక మాట ప్రయోగించాలి అని అన్నట్టయితే, ఇంకా బాగా తెలియజేయవలెనంటే సుశబ్దప్రయోగమే చెయ్యాలి అని వైయాకరణులు చెప్తారు. చెడుదారిలో ఉండటం తేలిక. అలాగే చెడు మాట చాలా తేలికగా నోటికి వస్తుంది. పురుషుడికి రాగప్రవృత్తి అంతటా సమానమే–గమ్యయందు, అగమ్యయందు. అక్కడ ఒక నియమం చేశారు–ఈమె గమ్య, ఈమె అగమ్య అని. "సమానశ్చ ఖేదనిగమః, గమ్యాయాం అగమ్యాయాంచ. తత్ర నియమః క్రియతే ఇయం గమ్యా, ఇయ మగమ్యా" అని పతంజలి. అలాగే వ్యాకర్తలు అసాధుశబ్దమునుంచి బుద్ధిని నివర్తింపజేసి సాధుశబ్దము నందు ప్రవర్తింపజేశారు. సాధుశబ్దప్రయోగము సదాచార లక్షణము.

'సక్తుమివ తితఉనా పునంతః
యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి'

జల్లెడపట్టి పేలాలు శోధించినట్టు ప్రజ్ఞానంచేత వాక్కుని శోధించి ప్రయోగించిన సత్పురుషులు సాయుజ్యమును పొందుతారు. వారి వాక్కుయందు భద్రమైన లక్ష్మి నిహితమై ఉంటుంది అని వేదము.



# విద్యుల్లోకము

= శ్రీ వేలూరి శివరామశాస్త్రి =

వాయువు, మేఘములు, మెఱుపులు, సూర్యుఁడు, సూర్యకిరణములు, విద్యుల్లోకము ఈ మొదలగు వానినిఁగూర్చి మన ప్రాచీనుల విజ్ఞాన మొకతూరి గుర్తు తెచ్చికొందము. నవీనవిజ్ఞానమునకు ప్రాచీనవిజ్ఞానమే పునాది. ఆ పునాదిలో నెచటనేని చవు డురిలినచో దానిని బసఁగొట్టియే నూతననిర్మాణ మారంభమగును. ఇది యథార్థస్థితి.

కొందఱకు ప్రాచీనవిజ్ఞాన మనినంతనే రోఁత. నవీనవిజ్ఞాన మనినంతనే జోత. భక్తిపరవశులగు మఱి కొందఱకు ప్రాచీనవిజ్ఞానమునందలి అక్షరములు నూటికి నెలగ.

దినదినాభివృద్ధి చెందుచున్న నవీనవిజ్ఞానమును జూచి ప్రాచీనవిజ్ఞానమును స్థాలీపులాకముగా రోయు వారి నిటు లడుగవలయును : నక్షత్రములు స్ఫాటికము లనియు, భూమి అచల మనియు పిథాగరస్ అనెనా, లేదా ? కోపర్నికస్, గెలీలియో, న్యూటన్‌ల సిద్ధాంతములకువెనుక, అనఁగా పదునాఱవ-పదునేడవ శతాబ్దులవెనుక భూమి అచల మనియు, సూర్యచంద్ర నక్షత్రాదు లీ యచలము చుట్టును తిరుగుచున్న వనియు పాశ్చాత్త్యు లనుకొనుచుండిరా, లేదా ? కెప్లర్ వెనుకటివారు గ్రహాదులకు సమదూరత్వమును, సమగమనత్వమును అంగీకరించిరా, లేదా ? వేయేల ? ఈ పాతిక యేండ్లలోపల శబ్దతరంగము, వాయుతరంగము, హిమమండలము మొదలగు నెన్నియో విషయములయెడల నెన్నియో పొరపాటు లెందఱకో వచ్చెనా, లేదా ? మార్కొనీ దదృష్టము కాదా ? కెనెలీ హెవిసాయిడ్లకు సుమా రిరువదినాలుగేండ్లకు వెనుక విద్యుత్ప్రచాలకమగు నొక స్తరము కలదని ఊహించిన బాల్‌ఫర్ స్టువార్టుకు పే రున్నదా ?

ఇఁక భక్తిశ్రద్ధలతో ప్రాచీనవిజ్ఞానమున అక్షర పూజ చేయువారల కొక విన్నపము : చంద్రకక్ష్య సూర్యకక్ష్యకు పైదను పురాణమతమును వరాహమిహిరాదు లేల ఖండించిరి ? ఆర్యభటుఁడు భూమికి చలనము లేదని అనెనా, లేదా ? ఆతని వ్యాఖ్యాత పృథూదకాచార్యుఁడు 'భూమి తిరుగు నను సిద్ధాంతమే శ్రేష్ఠ'మని అనెనా, లేదా ? రాహువును గుఱించిన పురాణమతమును బృహజ్జాతకము తుత్తునియలు చేయలేదా ? ఈ శాస్త్రజ్ఞులకు పురాణముల యెడల మనకున్న భక్తిశ్రద్ధలు తక్కువా

ప్రాచీను లసత్యవాదులు కారు. 'నే నీ మహాపురుషు నెఱుఁగుదును' [1] 'తొంటి పెద్దలు మా కిటులు చెప్పిరి' [2] అని యీరీతిగా నందురు. వీరు వైదిక ఋషులు.

కన్ను, శాస్త్రము, నీరు, లేఖ్యము, గణితము ఈ యైదును జ్యోతిర్గణనమున కాధారములని కొంద ఱందురు. వీరు పురాణములు చెప్పిన ఋషులు [3]. వీరికన్న యథార్థవక్త లుందురా ? ఇఁక మనము మనిజ్ఞానమునుబట్టియు, ఓర్పునుబట్టియు వీరిని అర్థము చేసికొందము. అది యటులుండె.

1. వేదాహ మేతం పురుషం మహాన్తమ్.
2. 'ఇతి శుశ్రుమ పూర్వేషామ్'

చూ. కూర్మపురాణము, వాయు పురాణము 23 వ అధ్యాయము.

ప్రాచీనవిజ్ఞానమున మునులనాఁటికే కొంత సంప్రదాయతంతువు విచ్ఛిన్నమయిన దని అందఱకును దెలియును. 'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నహి సందేహా దలక్షణమ్'అను పరిభాషలోని సందేహ మీ సంప్రదాయవిచ్ఛేద ప్రసూతమే. 'అకృతవ్యూహా' పరిభాష దీనికి దోహదము. కానిచో 'చత్వారిశృఙ్గే' త్యాదుల కొకనోటనే యిన్ని భిన్నభిన్నవ్యాఖ్యానము లెటులు? కావున అల్పవిద్య కలవాఁడు తనను గొట్టవచ్చుచున్నాఁడని వేదము జంకునని పురాణములు హెచ్చరించును. అర్థము తెలియక వేదపారాయణము చేయువానిని బరువుమోయు ఎద్దు అని వేదమే శాసించును. ఏమి గతి? ఆఁబోతులనడుమ గిత్తల కొమ్ములు నలుఁగుటయే గతియా? ఇఁక నీ అన్యోన్యాశ్రయమును పాఠకుల యెదుట నిడి ప్రకృతమునకు వత్తును.

## వాయువు

పాఁత పురాణములలో వాయువు లేఁడు.1 ఆవహము, ప్రవహము, అనువహము, లేక ఉద్వహము, సంవహము, వివహము, పరావహము, పరివహము.

భూమి మొదలుకొని మేఘమండలమువఱకును ఆవహవాయువు. మేఘమండలము మొదలుకొని సూర్య మండలమువఱకును ప్రవహవాయువు. అటనుండి చంద్ర మండలమువఱకును అనువహవాయువు, లేక ఉద్వహ వాయువు. అటుపైని నక్షత్రమండలమువఱకును సంవహ వాయువు. అటుతరువాత గ్రహమండలమువఱకును వివహవాయువు. పైని సప్తర్షిమండలమువఱకును పరావహవాయువు. తరువాత ధ్రువమండలమువఱకును పరివహవాయువు.

పైఁజెప్పిన ఏడు వాయువులలో ఆవహప్రవహములను రెంటిని మాత్రమే సిద్ధాంతగ్రంథములు గ్రహించెను. అందును ప్రవహవాయువు నంగీకరించె నన్నమాటయేకాని అది అంగీకరింపని చందమే. కావున జ్యోతిశ్శాస్త్రము శేషవాయు విషయమున మూకమనియే చెప్పవచ్చును. 2

మఱియొకటి. ఆవహవాయుప్రసార మున్నంతవఱకును అంతరిక్షము. ఈ యంతరిక్షముమీఁద స్వర్గము, లేక ద్యౌః. వేదమున మూఁడు లోకముల ముచ్చట కలదు. ఒకటి–పృథివి, రెండు–అంతరిక్షము, మూఁడు–స్వర్గము. గుఱ్ఱమెక్కి వేయిదినములలో స్వర్గమున కేఁగవచ్చు నని ఐతరేయ బ్రాహ్మణము3. మేరు శృంగమున స్వర్గము. అది మనకు ఎనుబదినాలుగు వేల యోజనముల దవ్వు అని బహుపురాణ

---

1. వాయు విష్ణు మత్స్య పురాణములు చాల ప్రాఁత పురాణములు.

2. ఆఱు మైళ్ళ యెత్తున వాయుసాంద్రత భూతలవాయుసాంద్రతలో మూఁడవ వంతు. ముప్పదిమైళ్ళ యెత్తున రెండువేల వంతులలో నొకవంతు. ఇటులు మీఁదిమీఁది కేఁగినకొలఁదిని వాయువు తన అణుపరమాణువులకు సంఘట్టనము కలుగనంతగా పలుచబడును. ఈ యణువులు కొన్ని పదివేలమైళ్ళవఱకు పైకెగసి వాయువునుండి తప్పించుకొనిపోఁగలిగినయెడల మహాశూన్యమునఁ గలిసిపోవచ్చును. కాని భూమ్యాకర్షణమువలన మరలఁ గ్రిందికే రావలసియుండును. అని నవీనవైజ్ఞానికుల మతము.

ముప్పదిమైళ్ళ యెత్తునఁగూడ నాలుగువందల మైళ్ళ వడితో వీచు గాడ్పు కానఁబడె నని అతినవీనుల మతము.

3. సహస్ర మనూచ్య స్వర్గకామస్య సహస్రాశ్వీనే వా ఇతః స్వర్గో లోకః స్వర్గలోకస్య సమష్ట్యై సంపత్త్యై సంగత్యై. ౭. అధ్యా. ౭. ఖండ. భాష్యం:—ప్రబలోఽశ్వ ఏకే నాహ్నా యావంతి యోజనాని గచ్ఛతి తావద్యోజనపరిమితో దేశ ఆశ్వీనః. సచ సహస్రసంఖ్యయా గుణితః సహస్రాశ్వీనః 'అశ్వస్యైకాహ గమ్య' ఇతి పాణినీయసూత్రా దాశ్వీనశబ్దనిష్పత్తిః. ఇతో భూలోకా దారభ్య సహస్రాశ్వీన ఊర్ధ్వదేశే స్వర్గో లోకో వర్తతే. అతః సహస్రసంఖ్యా స్వర్గలోకస్య సమష్ట్యై ప్రాప్త్యై భవతి. ప్రాప్తస్య సంపత్త్యై స్వాపేక్షిత సర్వభోగ్యవస్తుసంపాదనాయ భవతి. సంపన్నస్యచ సంగత్యై మహాతా మింద్రాది దేవానాం ప్రీతిపూర్వకసంబంధాయ భవతి.

సాధారణము. సూర్యునకుఁ బైని చంద్రుఁడును, చంద్రునికిఁ బైని నక్షత్రములును, నక్షత్రములకుఁ బైని బుధుఁడును, బుధునకుఁ బైని శుక్రుఁడును, శుక్రునకుఁ బైని కుజుఁడును, కుజునికిఁ బైని గురుఁడును, గురునకుఁ బైని శనియుఁ గలరని సర్వపురాణసామాన్యము.

సూర్యునిమీఁదనే చంద్రుఁడు కలఁడని తైత్తిరీయ సంహితలోఁ గలదు 1. జ్యోతిస్సిద్ధాంత మీ చంద్రుని సూర్యునిక్రిందికి దించెను.

## సూర్యుఁడు

వేదమునందలి సూర్యుఁడు అగ్నిమండలముగను, జ్యోతిర్మండలముగను గనుపించును.

వేదము జ్యోతిశ్శాస్త్రము కాదు. ఆ కాలము నందు ప్రచలితములగు జ్యోతిస్సిద్ధాంతముల నవలంబించిన విషయము లం దుండవచ్చును. నాటి సిద్ధాంతములు మనకుఁ దెలియవు. ఇటీవలి జ్యోతిషము, అనఁగా వేదాంగజ్యోతిషము మొదలగునది వేదమున కంగము 2.

వేదమున సూర్యునకు సంబంధించిన సూక్తములు పెక్కులు కలవు. వానిలోఁ గొన్ని స్వభావోక్తులు3, కొన్ని రూపకాతిశయోక్తులు4. కొన్ని రూపకములు5. కొన్ని ఉపమలు.

కొందఱుకొందఱు విద్వాంసులు—కొంద ఱేమి? అంద అన్నను అతిశయోక్తి కాదు—ఇందలి పదములను మెడ విఱిచి వానిచేతఁ దమ కనుకూలమగు అర్థము చెప్పించిరి. ఇది తప్పనిసరివలె నున్నది. ఈ సంగతి అందఱకును దెలిసిన రహస్యము 6.

వేదమున మొదటమొదట నాదిత్యు లాఱుగురు, (చూ. ఋక్ ౨. ౨౭.) పిమ్మట నేడుగురు. తైత్తిరీయ సంహితలో నొకచో నెనమండ్రు. అందే వే ఱొకచో పన్నిద్దఱు. వీరు ప్రజాపతికిఁ గొడుకులు.

ఉపాధి భేదముచేఁగాని యీ సంఖ్యాభేదమున కేకవాక్యత కలుగదుగదా. శతపథబ్రాహ్మణ మా పనియే చేసెను. అది పండ్రెండు మాసములను బన్నిద్దఱు సూర్యులనుగా నిరూపించెను. తరువాతఁ గొన్ని పురాణములు ద్వాదశాదిత్యులను 7 స్థిరపఱచెను. మాసభేదముచే నామభేదమని కొన్ని వ్యాక

---

1. 'తృతీయస్యా మితో దివి సోమ ఆసీత్'. (తై. బ్రాహ్మణ. 3-౨-౧)

2. 'యజ్ఞమునకుఁగాను వేదము. యజ్ఞము కాలాపేక్షము. జ్యోతిశ్శాస్త్రము కాలాదిబోధకము. కావున నిది వేదమున కంగము' అని భాస్కరుఁడు.

3. చూ. ౧-౨౮ మొ.

4. చూ. ౧-౮౮ మొ.

5. చూ. అ|

6. ఋగ్వేద ౧-౧౬౪ వ సూక్తమున 'సప్తరశ్మి' అను పద మొకటి కలదు. దీనికి సప్తగ్రహము లని శ్రీ సామశ్రమిపండితు లర్థము చెప్పిరి:— రశ్మి లీ యేడింటి నంటి రవిదెస లాగును. రశ్మి-'అశూ' వ్యాప్తౌ. పృథివిగూడ నొక గ్రహమే. ఇవి ఆకృష్టములై స్వస్వకక్ష్యలోఁ దిరుగుచున్న వని కొందఱు దీని నిటులు ఖండించిరి పృథివి తిరుగునా? అటు లగుచో 'ఆకాశము నిశ్చలము, పృథివి నిశ్చలము, కొండలన్నియు నిశ్చలము, విశ్వము లన్నియు నిశ్చలము' అని ఋగ్వేదమున ౧౦-౧౭౩ లేదా?" అని.

అసలిచట నీ సూక్తములు చల-అచల-ఆకర్షణ సిద్ధాంతములకు ప్రవర్తింపలేదు. 'ధ్యానం వావచిత్తా ద్భూయో ధ్యాయతీవ పృథివీ ధ్యాయతీ వాంతరిక్షం ధ్యాయతీవ ద్యౌః' (ఛాందోగ్య. ౭-౬-౧) ఇత్యాదు లెటు లుత్ప్రేక్షలో అవియు నటులే గమ్యోత్ప్రేక్షలు. చిక్కుపెట్టు వేదమున కర్థము తెలిసికొనుటకు ఛాందోగ్యము విజ్ఞానము కావలయు నను—'విజ్ఞానేన ఋగ్వేదం విజానాతి.'

7. మత్స్య కూర్మలింగ భారత భాగవతములు.

రించెను. కూర్మపురాణ మీ యెడ 1 విశేషముగా చూడఁదగినది. వాయుపురాణము కొంచెము సనుపాత మిటులు చెప్పుచున్నది. మాఘ-౫. ఫాల్గున, చైత్ర-౭. వైశాఖ-౮. జ్యేష్ఠ-౯. ఆషాఢ-౧౦. శ్రావణ-౧౦. భాద్ర-౧౧. ఆశ్విన-౯. కార్తిక-౮. మార్గ-౭. పుష్య-౬.

ఇఁక నీ పాఁత పురాణములను విడిచి శాస్త్ర మేమి చెప్పునో చూతము.

'సూర్యుని శరీరము నిర్మలము. బింబము అ. క్రము. కిరణములు స్పష్టములు, నిర్మలములు, దీర్ఘములు




సూర్యబింబమున మచ్చలు పుట్టును 2, ఒకానొకపుడు సూర్యకాంతి వికృతమగును 3 అని వరాహమిహిరుఁ డనెను. వరాహమిహిరునిది సొంత కవిత్వము కాదు. ప్రాచీనసిద్ధాంతముల నతఁ డొకచో గూర్చెను.

కిరణములు

వేదమునం ద చ ట న చ ట సూర్యకిరణము లేడనియు, సహస్రమనియుఁ గలదు. ఈ సప్తరశ్మియే సప్తాశ్వుఁడు. వర్ణ భేదముచే సప్తరశ్మి యను పే రని కొంద ఱూహించిరి.

పురాణ మీయేడు కిరణములకును సుషుమ్న (మ్న)-హరికేశ-విశ్వకర్మ-విశ్వశ్రవ-సంయద్వసు - అర్వావసు-స్వర్ 4 అని పేరుపెట్టి వీనివలనఁ గ్రమముగా చంద్ర నక్షత్ర బుధ శుక్ర 5 మంగళ బృహస్పతి

1. 'వసన్తే గ్రీష్మకే చైవ షడ్భి స్స తపతి ప్రభుః
శరద్యపి చ వర్షాసు చతుర్భిః సంప్రవర్షతి
హేమన్తే శిశిరే చైవ హిమ ముత్సృజతి త్రిః
వరుణో మాఘమాసేతు సూర్యః పూషాతు ఫాల్గునే
చైత్రే మాసే స దేవేశో ధాతా వైశాఖతాపనః
జ్యేష్ఠే మాసే భవే దింద్ర ఆషాఢే తపతే రవిః
వివస్వాన్ శ్రావణే మాసి ప్రౌష్ఠపద్యాం భగః స్మృతః
పర్జన్య శ్చాశ్వినే మాసి కార్తికే మాసి భాస్కరః
మార్గశీర్షే భవే న్మిత్రః పౌషే విష్ణు స్సనాతనః
పంచరశ్మిసహస్రాణి వరుణ స్యార్కకర్మణి
షడ్భి స్సహస్రైః పూషాతు దేవేశ స్సప్తభి స్తథా
ధాతా ఽష్టభి స్సహస్రై స్తు నవభి శ్చ శతక్రతుః
వివస్వాన్ దశభిః పాతి పా త్యేకాదశభి ర్భగః
సప్తభి స్తపతే మిత్ర స్త్వష్టా చైవాష్టభి స్తపేత్
అర్యమా దశభిః పాతి పర్జన్యో నవభి స్తథా
షడ్భి రశ్మిసహస్రైస్తు విష్ణు స్తపతి విశ్వధృక్.'
(కూర్మ పురాణ. ౪౩ అధ్యాయ)

2. తామస కీలకసంజ్ఞా రాహుసుతాః కేతవ స్త్రయస్త్రింశత్.

3. ఆదిత్యచారాధ్యాయము చూచునది.

4. కూర్మ-౪౨ అధ్యా-చూ.

5. ఋగ్వేదకాలమున గురుశుక్రుల యెడల సందియము లేదుకాని శనిబుధమంగళగ్రహముల యొక్క యెడల నందఱకును సందియముకలదు. ౧-౧౦౫-౧౦ వ ఋక్కులో 'పఞ్చ ఉక్షణః' అని ఉన్నది. దీనికి 'ఇంద్ర వరుణాగ్న్యర్యమ సవిత లనికాని, అగ్ని వాయు సూర్యచంద్రవిద్యుత్తులనికాని అర్థము'అని సాయణుఁడు. 'పంచగ్రహములే'యని బాలకృష్ణ దీక్షితులు. 'ఈ ఐదు తారా గ్రహములును నాఁటికిఁ దెలిసియుండవచ్చు'నని బాలగంగాధర తిలకుగా రనుమానించుచున్నారు. చూ. ఓరియన్ ౧౬౨ వ పుట.

శనులం పుష్టులగుచురని విపులీకరించెను. ఈ యేడును గాక అమ యను మఱియొక రశ్మి కలదని మఱియొకచో గలదు.

సూర్యుఁడు సహస్రాంశుఁడుగా సర్వవేదపురాణ విదితుఁడు. అతని కిరణము లగ్నితో సమాన మయిన వేఁడిమి కలవని పురాణములందున్నది.

---

1. రెండు కళ లుండఁగా చంద్రుఁడు సూర్యుని జొచ్చి అమ యను రశ్మియం దుండును. కాన ఆ తిథి కమావస్య యని పేరు.

2. వాయు-౫౩ లింగ-౫౨, ౬౧. మఱియు 'తస్య రశ్మిసహస్రం తు శీత వర్ణోష్ణ నిస్రవమ్, తాసాం చతుశ్శతా నాడ్యో వర్షన్తే చిత్రమూర్తయః' అని కూర్మ మున ౮౩-౧౨. విశేషము.

3. ఆదిత్యస్య శుక్లం భా స్సైవర్గథయన్నీ లం పరః కృష్ణం తత్సామ. ౧. ౬. ౫.

4. తద్ధ్యేకాంతసమాహితదృష్టే ర్దృశ్యతే- (చూ. భాష్య.) ౧. ౬. ౫.

5. అసౌవా ఆదిత్యః పిఙ్గళ ఏవ శుక్ల ఏవ నీల ఏవ పీత ఏవ లోహితః. ౮-౬-౧.

6. విద్యు దశనులు వేఱువేఱు. విద్యుత్తు మెఱుపు. అశని పిడుగు. ద్యుత-దీప్తౌ—విద్యుత్. అశ- సంహతౌ—అశనిః.

వేదములం దశనా యను పదము కలదు. విసరి వేయఁదగు రాయి యని దాని యర్థము. ఇంద్రుని వజ్రము రాయిగాని, యినుముగాని అయియుండు నని వేదవ్యాఖ్యాతలు. 'ఆశ్మమయం వా ఆయసం వా'. చూ. వాయువు. ౩౯-౫౧.

ఇటులే విద్యుద్గంధర్వనగరములు వేఱు. గంధర్వ నగరము మేరుజ్యోతి కావచ్చునని కొందఱ ఊహ. (Polar lights) నిరక్షవృత్తమునకు ఉత్తరదక్షిణ ముల ౭౮-౭౫ అంశల నడిమి ప్రదేశమున మాత్రమే అరోరా కనఁబడదు. మిగిలిన చోటులం దెల్ల గనఁ బడును. కావున గంధర్వనగరము అరోరా కావచ్చునని పైయూహకు కారణము. ఇది శోధనకు విషయము.

7. శ్రీపతి చూచునది.

## రంగు

సూర్యుని దీప్తి తెలుపనియు, కారు నలు పనియు ఛాందోగ్యము. 3 కన్ను గ్రుచ్చి చూచు వాని కీ కారు నల్లఁదనము కానిపించు నని శంకరులు4. ఛాందోగ్యమునందే యింకొకచో సూర్యుఁడు పింగళుఁ డనియు, నీలుఁ డనియుఁ, బీతుఁ డనియు, లోహితుఁ డనియుఁ గలదు.

సూర్యుని రంగు వసంతమునందు కపిలముగను, గ్రీష్మమునందు కాంచనోపముముగను, వర్షర్తువు నందు శ్వేతముగను, శరదృతువునందు పాండరముగను, హేమంతమునందు తామ్రముగను, శిశిరమునందు లోహి తముగను ఉండునని మత్స్యకూర్మములు వివరించు చున్నవి.

## విద్యుత్తు

వేదములందును, పురాణములందును విద్యుత్తు లును, తటిత్తులును అసలు మెఱుపులకన్న నెక్కుడుగా మెఱయునుగాని వీని కారణ మెఱుఁగుటకు మనము జ్యోతిశ్శాస్త్రమునే ఆశ్రయింపవలయును.

సముద్రమున బడబాగ్ని యున్నది. దానినుండి పొగ లెగయును. వాయువు వానిపయికిఁ గొంపోయి అటునిటు చెదరఁగొట్టును. అంత నవి సూర్యకిరణము లచేఁ దప్తములగును. అపు డవి స్ఫులింగములఁ గ్రక్కును. అవియే మెఱుపులు. ఈ వైద్యుతతేజ మకస్మాత్తుగా మృత్తికాదులతోఁ గలియును. అపు డనుకూలప్రతికూల వాయువుల యాఘాత ప్రతిఘాతములఁజేసి యాకాశ మున సురగాడ్పువలె గిఱునఁ దిరుగుచుండును. అకాల వర్షములలో నవి క్రిందఁ బడును. ధూళి వానకారునఁ బయి కెగయదుకావున అశనిపాతము కాదు. విద్యుత్తు ముత్తెఁగ. ఒకటి పార్థివము. రెండు జలీయము. మూఁడు తైజసము. 7

## మెఱుపుల రంగులు

సూర్యకిరణములకువలెనే మెఱుపులకును చాల రంగులు కలవు. కపిలవన్నె, లేక గోరోజనపు వన్నె,

కారు పెఱుపు, పసుపు తెలుఁపు రంగులను!, మఱియుఁ గొన్ని రంగులును అచటనచటఁ జూపట్టును. భాస్కరుఁడు ఈ విద్యుల్లోకమునుగూర్చి యిటులు చెప్పెను:

"భూమే ర్బహి ర్ద్వాదశ యోజనాని
భూవాయు రత్రాంబుద విద్యుదాద్యమ్."

1. 'బహుపుత్రస్య విదుష శ్చతస్రో విద్యుతః కపి లాతిరక్త పీత సిత వర్ణాః' (౧-౧౫-౧౩౪) అని ౧౮౮౨ వ సాలున అచ్చుపడిన తెలుఁగు లిపి విష్ణుపురాణము. 'వాతాయ కపిలా విద్యు దాతపా యాతి లోహితా, పీతా వర్షాయ విజ్ఞేయా దుర్భిక్షాయ సితా భవే దితి జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధా'అని శ్రీధరవ్యాఖ్య. గోరఖ్‌పూర్ నూతన ముద్రణమున 'బహుపుత్రస్య విదుష శ్చతస్రో విద్యుతః స్మృతాః'అని మాత్రమే యున్నది.

వెనుకటి తెలుఁగులిపి పాఠము తప్పని దాని మొగముమీఁదనే వ్రాసియున్నది. గోరఖ్‌పూర్ ముద్రణమున శోధకులు కాఁబోలు 'వాతాయ 'అను శ్లోకమును విశేషప్రతిపత్తికి క్రింద నుదాహరించిరి.

విష్ణుపురాణమును తెలిఁగించిన వెన్నెలకంటి సూరన 'బహుపుత్రునకుఁ బనువలువురు మనువులు పుట్టిరి'అనియే వ్రాసెను. (చూ. ౨ అ. ౨౬.) అందు విద్యుత్తులుగాని, కపిలాద్యన్యతరముగాని లేదు.

'చతుర్థీ సంప్రదానే' అను సూత్రముక్రింద 'ఉత్పాతేన జ్ఞాప్యమానే'అను వార్తికమున 'వాతాయ కపిలా విద్యు దాతపా యాతిలోహినీ, పీతా భవతి సస్యాయ దుర్భిక్షాయ సితా భవేత్' అని మహాభాష్యము (Kielhorn Edition). 'కృష్ణా సర్వవినాశాయ'అని నిర్ణయసాగరముద్రణము. దీనినిఁబట్టి చూడఁగా కాత్యాయన పరాశరులకుముందే పైఁజెప్పిన రంగులు జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధము లయియున్నవని మన మూహించుకొనవచ్చును.

భూమికిఁ బైని పండ్రెండు యోజనములవఱకును భూవాయువు కలదు. అనఁగా ప్రవహము. ఈ ప్రవహ రాజ్యమున మేఘములు, విద్యుత్తులు, ఉల్కలు మొదలగునవి కలవు.

యోజన మనఁగ నుజుచోఁ బండ్రెండు డామడలు తొంబదియాఱు మైళ్లు.

పదునొకండవ శతాబ్దిని అరేబియా దేశపు జ్యోతిష్కులు గోధూళినిఁబట్టి లెక్కకట్టి ఏబదియేడున్నర మైళ్ళపైని ఈ విద్యుత్ స్తర మున్నదని చెప్పిరి.

నవీన వైజ్ఞానికులు విద్యున్మండలము ఏఁబదియాఱుంబావుమైళ్ళయెత్తున నారంభమై నూఱు నేఁబదియాఱుమైళ్ళ యెత్తునకుఁ బైఁగా దాఁటిపోవుచున్నదని చెప్పుచున్నారు. యంత్రసాహాయ్యము లేని వెనుకటి దినములలో భరతఖండమువారును, అరబ్బులును ఇటు లూహించిన ఊహ సుమారుగా సరిపోవుట మన కాశ్చర్యము కలిగింపకమానదు.



# బొందితో కైలాసము




బొందితోడనే కైలాసమునకు బోవలయు నని త్రిశంకుమహారాజునకు గోరిక గల్గినది. కులగురువైన వసిష్ఠభగవానునితో నాతడు—

'నా కీదేహముతోడన *
నాకము సనఁగ సుఖం బొనర్పుం' డనగా

(మహాఋషి)

'నీ కీదేహముతోడను
నాకమునకు నేఁగరాదు నరవర'యనుడున్—

మహారాజు గురుపుత్త్రులను రావించి వారికి గూడ తన కోర్కెను దెల్పెను. వారు నంగీకరించరైరి. మహారాజునకు గోపమువచ్చి 'మాయింటిసొమ్ము తిందురే గాని మా కింతమాత్ర ముపకారము చేయబో'రని యెత్తిపొడువగా వా రాగ్రహించి 'చండాలుడవు గ'మ్మని శపించిరి. మహారాజున 'కమంగళకాకసన్నిభగాత్రము' వచ్చి, యాత డొక 'పెనుమైలయగు నీలి చ్రేలిక' మొలకు జుట్టి, యెర్రనిపాత్ర యొకటి బట్టి, 'యయోమయభూషలతోను, చెదరిన కేశములతోను, నినుపచుట్లువైచిన చేతి కర్రతో వికృతముగా దిరుగుట మొదలుపెట్టెను. ఆతడు పదపడి విశ్వామిత్రు నాశ్రయించగా, వసిష్ఠుని కెప్పుడును ప్రతికక్షియగు నా విశ్వామిత్రుడు రాజుకోరికను దీర్చెదనని బాసచేసి యందులకై యొక యజ్ఞమును దలపెట్టి యెక్కడెక్కడి మునులను ఆహ్వానించెను. వా రిటువంటి విషయములు 'విన నివి యెంతయు జిత్రము'లని చెప్పుచు తాము రా మనిరి. ప్రాంతీయులను గూడగట్టుకొని విశ్వామిత్రుడు యజ్ఞము సాగించి సురలను హవిర్భాగములకు బిలువగా వారు 'భూరిస్వరముల'తో రామని చెప్పివైచిరి. విశ్వామిత్రుడు తన తపోబలముచేత నెట్లో మహారాజును శరీరముతోనే దివికి బంపెను. కాని కాచుకొనియుండి యింద్రుడు 'పో, చండాల' యనుచు నాతనిని బడద్రోసెను. అప్పుడు విశ్వామిత్రుడు వేరొక సృష్టిచేసి యందలి స్వర్గములో రాజునకు దావల మేర్పరచెను.

బొందితో గైలాసమునకు బోవుటయే మానవునికి నిజమైన ముక్తి యని సిద్ధులయొక్క మతము.

జీవుడు చేయు కర్మ జీవుని బంధించి బాధించు ననియు, కర్మరాహిత్య మగునందాక జీవుడు పుట్టుచు చచ్చుచు నుండవలసినదే యనియు మన మతకర్తలు నిష్కర్షగా చెప్పివైచినారు.

మరి సిద్ధుల మత మేదనగా, జీవునికి జీవించుట యన్నది యొక ధర్మము. జీవనము చేయుటకు ప్రతి జీవునికి నొక వాహనము, అనగా దేహము కావలయును. ఒకానొక దేహములో జీవనము చేయుచు నుండియుండి జీవుడు స్వధర్మనాశమువలన మరొక వాహనము నాశ్రయించుకొని మునుపటివాహనమును త్యజించివైచును. అట్లు త్యజించుటయే మరణము.

ఒక తనువులో నున్న జీవు డా తనువును విడిచిపెట్టకుండ నున్నయెడల నింక చావన్నది యుండదు. చావు లేనిచో నింకొక పుట్టుకయు నుండదు. 'పునరపి మరణం, పునరపి జననం, పునరపి జననీజఠరే శయన'మ్మను సుడిగుండ మంతటితో నాగిపోవును. కనుక ముందు మృత్యువును జయించవలెను.

ఇందులకు రెండు తెన్ను లున్నవి. జీవుడు దేహములో కలకాల ముండిపోవచ్చును; లేదా యా దేహము

* భాస్కర రామాయణము.

నాతడు మార్చివేసి జీవునికి దేహమునకు గల భేదములను తొలగించివైచి, దేహమునకు సహజములైన బంధనములను నశింపజేసి, మారురూపందిన యీ దేహముతోనే బ్రహ్మాండములో లీనమైపోవచ్చును. దేహి, దేహము, ప్రాణము, అన్నము, ఆత్మ, ప్రకృతి—ఇవి వాస్తవముగా వేరువేరు కావు. పరమతత్త్వములో నివి యొక్కటే పదార్థము. అదియే 'సత్యం జ్ఞాన మనంతం నిత్య మనాకాశం పరమాకాశమ్'—ఏకైకమై సర్వవ్యాపకమై యాదిమధ్యాంతము లెరుగని పరాశక్తి యది. దానికి మాయయొక్క సంయోగము వచ్చినప్పుడు బ్రహ్మాండము పుట్టినది. మాయ మూడు రీతులు—శుద్ధముకాని మాయ, శుద్ధమైనమాయ, మహామాయ. శుద్ధముకాని మాయవలన పాంచభౌతికమైన దేహ మేర్పడుచున్నది. మాలిన్యములను తొలగించినప్పుడు దేహము శుద్ధమాయాతత్త్వములోనికి మారును. ఇంకను సాధించినయెడల నది మహామాయారూపములోనికి మారగలదు. అనగా దేహము స్థూలరూపములోనుండి సూక్ష్మరూపములోనికి, నందుండి యతిసూక్ష్మరూపములోనికిని పరిణామము చెందును.

పూర్వజన్మపుణ్యముకారణముగ గొందరికి ముక్తిపైని వాంఛకలిగి తిప్పలుబడుచున్నంతలో నట్టివారి నుద్ధరించుట కెల్లప్పుడును గనిపెట్టుకొనియుండు గురువులు వారిని చేపట్టెదరు. శిష్యుడు గురుకృపవలన సాధకుడగును.

సాధన యెంతకాలము పట్టునో ఎవరికి దెలియును? సాధన పూర్తి కాకపూర్వమే యీ సాధకుడు మరణించవచ్చును. మరణించుటతోడనే మరియొక జన్మ మాదేశమగును. క్రొత్తజన్మముతో సంసారయాత్ర మరల మొదటినుండియు నారంభమై, వెనుకజన్మలో చేసిన సాధనయొక్క వాసనమాత్రమే మిగిలియుండి, జీవుడు తిరిగియు సాధన ప్రారంభించవలయును. అట్లుకాకుండ ఈజన్మమందే ముందుగా దేహమును శోధించి నీరోగముగా జేసి, మరణమును కొంతకాలమువరకు నెట్టివేసినయెడల సాధన యెంతకాలమైనను చేయవచ్చును.

కావున సాధకుడు ముందుగా దేహదార్ఢ్యమును సాధించును. అది రసాయనసేవనమువలన లభించగలదు. రసవాదమునందు ప్రవీణులైనవారును సిద్ధులే. వారు రసవాదసిద్ధులు. వీరి దొక ప్రత్యేకసంప్రదాయమై, వీరి యుదంత మొక మహాగ్రంథమగును. పాదరసమును శుద్ధిచేసి దానితో గంధకమో, యభ్రకమో శాస్త్రరీతిని మేళవించి చేసిన రసద్రవ్యమువలన మానవదేహమునకు రోగరాహిత్యమును, వజ్రకాఠిన్యమును, నపారబలమును చేకూరగలవట. 'రసవాదమందు చెడినవాడు వైద్యు డగు'నని యొక సామెత యున్నది. రసవాదు లాయుర్వేదమునకు మహిమాన్వితములైన యౌషధములను సంపాదించిపెట్టిరి. అదికాక దేశీయవైద్యమునందు సిద్ధమార్గమని ప్రత్యేకమార్గ మున్నదికదా.

జబ్బుల కౌషధముల నిమిత్తము కాకుండ కొన్ని శక్తులు కాంక్షించినవారుకూడ రసవాదములోనికి దిగవచ్చును. ఘుటికాసిద్ధు లనబడునవి హస్తగత మొనర్చుకొని వారు వాయుగమనము మొదలైనవి సాధించెదరు. ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్రచరిత్ర'లో తాము జాంగీర్, లేక జాంగరాబాదు అనబడు బస్తీప్రాంతములో నివసించు నొక గోసాయిని గూర్చి చెప్పుచు నాతడు గుళికాసిద్ధిని గలిగినవాడని తాము విన్నట్లు వ్రాసినారు. ఏ జోలికి బోని ప్రవరాఖ్యుని కన్ని పాట్లు తెచ్చిపెట్టిన పాదలేపముకూడ నిటువంటి సిద్ధియే యనవచ్చును.

మందులకు కాకుండ, మహిమలకు కాకుండ మరియింకొక యర్థమునకైకూడ రసవాద మభ్యసించవచ్చును. అదేదనగా, బంగారముచేయుట. డబ్బు సంపాదించుకొరకు పడవలసిన పాట్లు తప్పుటకుగాను క్షుద్రలోహములను బంగారముచేయు విద్యకొరకై యెందరో యెన్నెన్ని తిప్పలో బడిరి. నిజముగా నాముష్మికమందే భక్తి గలిగి కొంతకాల మేకాగ్రచిత్తముతో సాధనచేయవలసియుండుటచేత నంతకాలము జరుగుబాటునకై కూడ బంగార మావశ్యకము. కేవల మైహికచింత తప్పలేని మనుష్యులు కొందరుకూడ బంగారమును చేయు విద్య గోరవచ్చును. ఇన్నివిధముల వారుండగా రసవాదవిద్యకు వ్యాప్తి యెందుల కుండదు? అది యన్ని దేశములలోను, అన్ని కాలములలోను వ్యాపించియేయున్నది. నాగరికత యున్న వనుకొన్న దేశముల

లోనే యీ నాగరికత హెచ్చుచున్న కొలదియు నీ విద్యయు పెరుగుచుండెను. అందుండియే రసాయన శాస్త్రము పుట్టినది.

రసశాస్త్రరీతిని గాక సాధకుడు యోగముమూలమునగూడ తాను గోరిన సిద్ధిని పొందవచ్చును. ఇది హఠయోగముతో మొదలై రాజయోగముతో నంతమగును. ప్రాణాపానవ్యానోదానసమానము లనబడు పంచప్రాణములను సాధకుడు తనకు వశములుగా జేసుకొన్నయెడల, మూలాధారాదిషట్చక్రములను భేదించి, కుండలిని సహస్రారము జేరినయెడల నాతని కన్ని సిద్ధులును చేకూరును. సమానవాయువును జయించినవాడు కాంతివంతుడై, దూరశ్రవణశక్తిని బొందును. ఉదాన వాయువును జయించినవాడు నీటియందు మునుగడు. ముండ్లు, రాలు వానికి గ్రుచ్చుకొనవు. కత్తుల మొనల పైని, నిప్పులగుండముపైని వాడు సుఖముగా నడచి పోగలడు. మరియు వాడు స్వచ్ఛందమరణమును కూడ పొందగలడు. ఇట్టి సిద్ధులకు ముందు ప్రాణాయామాదులతో కూడిన కఠినసాధన మవసరము.

కొందరి కన్ని సిద్ధులును జన్మచేతనే సిద్ధించునట. కపిలమహాముని జన్మసిద్ధుడు. కొందరి కౌషధముల వలనను, కొందరికి మంత్రమహిమవల్లను, కొందరికి తపస్సువలనను, నింకను గొందరికి సమాధివల్లను సిద్ధులు లభించును. ప్రతిమార్గములోను గొంతసాధన యవసరము. సాధనవలన నొకొక్కమెట్టే యెక్కి సాధకుడు తుదకు ఫలితము నందుకొనును. పరమసిద్ధుడైన గురువు కరుణించినయెడల నన్నిమెట్లు లేకుండ శిష్యుడు సిద్ధి పొందగలడు.

సాధకు డేదో యొక పంథ ననుసరించి ముందుగా స్థూలదేహమును స్వాధీన పరచుకొనవలెను. అతడు యమనియమాదులవలన దేహమును శోధించవలెను. ఆహారవిషయములో నాత డతి జాగరూకుడై యుండవలెను. ఒక మార్గమువారు గోక్షీరములనుమాత్రమే యెక్కువ యుపయోగించెదరు. ఆ గోవునకు మేత ప్రత్యేకముగా సేకరించబడవలెను. జనులచే త్రొక్కబడనిది, మలినోదకములచే దడుపబడనిది, స్మశానాదులకు గడుదూరమున నుండునది యైన ప్రదేశమునందు పెరుగు పచ్చిగడ్డి, మంచిపదార్థములను మేయు మేక యిచ్చు పాలు మొదలైనవి పెట్టి యా గోవును మేపవలెను. అట్టి గోవుపాలు సాత్వికగుణవర్ధకమట. అపరిశుద్ధ మాయారూపమై, స్థూలాకృతిని గలిగియున్న దేహములో క్రమముగా మార్పువచ్చి యది శుద్ధమాయారూప మంది, సూక్ష్మాకృతిని జెందును. సూక్ష్మదేహము చూచుటకు సామాన్య స్థూలదేహము వలెనే కానవచ్చినను, అది స్థూలదేహముమాత్రము కాదు. అది శీతోష్ణములకు లోనుగాదు. కత్తిపెట్టి నరికిన గాయము కాదు. నిప్పుపెట్టికాల్చిన నది కాలదు. ఆకారము కలిగియుండునేగాని దానికి ఘనత్వము లేదు.

ఈ స్థితిలోనికి సాధకుడు వచ్చినయెడల నది జీవన్ముక్తియని చెప్పబడును. అప్పటికే యాతని కితరసిద్ధు లెన్నియో కరగతమైయుండును. జీవాత్మ పరమాత్మ తత్త్వమును సంపూర్ణముగా ననుభవపూర్వకముగ నెరిగినవా డగును.

జీవన్ముక్తిని మీరినది పరాముక్తి. సాధకుడు మరియును సాధించి సూక్ష్మశరీరము నతిసూక్ష్మశరీరముగా మార్చివైచును. ఆ మార్పు నాతడు సాధించిన వెనుక నాత డేక్షణములోనైనను దానిని తెచ్చిపెట్టుకొనగలడు.

స్థూలశరీరమువలెనే యున్న సూక్ష్మశరీరము మరియు మార్పునంది యతిసూక్ష్మశరీర మైనప్పు డది యాక్షణమునుండి యెదుటివారి కన్నులకు కానరాకుండ బోవును. ఉన్నటు లుండి సిద్ధుడు మన కన్నులయెదుట నాకాశములోని కెగసి యందు గలిసిపోవును. అదియే పరాముక్తి; సిద్ధులకు వాస్తవమైన సిద్ధి.

సమాధినుండి లేచి మూడుదినములు జీవించి యుండి యేసుప్రభువు శిష్యులు చూచుచుండగ నాకాశములోని కెగసి యదృశ్యుడైపోయెను.

తమిళశైవసమయాచార్యులలో నొకరైన శ్రీ మాణిక్యవాచగరు శ్రీ నటరాజదేవాలయములో నిల్లరు

# డి డి టి

అన్నింటికి క్షేమకరము
కాని కీటకములు మాత్రము కాదు..

# న్యూసిడ్

నూటికి పది వంతులు డి.డి.టి కలిసిన పౌడరు
గాయగి గారిచే తయారు చేయబడినది.

DJK 6018 TEL.

★ జగద్విఖ్యాతమగు డి. డి. టి. ఔషధము.

★ హిందూదేశములో వాడుటకు ప్రత్యేకముగా తయారుచేయబడినది.

★ ఒకసారి తాకినచో కీటకములు చనిపోవును.

దక్షిణ హిందూదేశములో డిస్ట్రిబ్యూటర్లు:
ఎడిసన్ అండు కంపెనీ లిమిటెడ్.
మౌంటురోడ్డు,
మద్రాసు.




మైసూరు సంస్థానమునకు, బీదర్ జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు
మహమ్మద్ రహీమ్ ఖలీలి,
88.బి అస్మాన్ ఖాన్ రోడ్డు,
బెంగుళూరు సిటీ.

గాయగి ఇన్సెక్టిసైడ్స్ లిమిటెడ్, నెవిల్లెహౌస్, నికల్ రోడ్డు, బల్లార్డ్ ఎస్టేటు, బొంబాయి.

A PINCH OF
"TILAK" BRAND
MISKY ASAFOETIDA.
IN
EVERY DISH
APPRECIATED
FLAVOUR




GOPALJI CHAMPSHI & Co
30 Govindappa Naick St.,
Madras.

ప్రసిద్ధికెక్కిన

**తిలక్ మార్కు**

**మిస్కి యింగువనే వాడండి.**

వాసనకున్నూ, రుచికిన్ని
శ్రేష్ఠమయినది

న్నిచోట దొరకును.

**గోపాల్జి చాంప్సీ అండ్ కంపెని**

ఇంగువ, మర్చంట్సు,

80, గోవిందప్ప నాయక్ వీధి, మదరాసు.

హెడ్డాఫీసు : బొంబాయి.

బ్రాంచి : మధుర.

స్వర్ణోత్సవ -
ఆగమనసందర్భంలో






పండిత డి. గోపాలాచార్యులవారి

**జీవామృతము**

ఏబదియేండ్లుగా ప్రజాలోకమునకు అమూల్య సేవజేయుచు, ప్రజల ఆరోగ్యమును పెంపొందించుచు, ఆనంద సంతృప్తులను కల్గించి, ప్రజానురంజకమైనదని వెల్లడించుటకు గర్వించుచున్నాము.

టి నగర్. . . మద్రాసు.

చూచుచుండ నదృశ్యుడైపోయెను. మరియొక సమయాచార్యుడైన సంబంధరుకూడ నిట్లే దైవసన్నిధి నదృశ్యులైరి. నానక్కు గురుదేవుని యవతారసమాప్తి యైన తర్వాత నాయనశరీరము మాకు కావలెనని హిందువులును, మాకు గావలెనని మహమ్మదీయులును తగవులాడుకొని, మరునాడు వచ్చి, పైనికప్పిన వస్త్రమును తొలగించిచూడగా నందు శరీరము కానరాలేదట. క్రీ. శ. ౧౮౨౩-౭౪ సంవత్సరముల నడుమ మద్రాసులో జీవించియుండిన శ్రీ చిదంబరం రామలింగస్వామిగారు కళేబరమును భూమిపైని విడువకయే పరమపదించిరట. వీరి యంత్యకాలమునందు నివసించిన ప్రదేశమును, వీ రెచ్చటినుండి యాకాశములో లీనమైరో యా గృహమును నిప్పటికి పూజార్హముగ నెంచి శిష్యులు కొందరు కాపాడుచుందురట. వీరి శిష్యులకు శిష్యులైన యొక తెలుగు బ్రాహ్మణునికి వీరి తేజోరూపదర్శనము కూడ నైనదట.

శ్రీ. శ. ౨ వ శతాబ్దినుండియు మన దేశములో నీ సిద్ధు లుండినట్లు తెలియుచున్నది. వారు నాథసిద్ధు లనబడువారు. వీరిలో ప్రముఖులు మత్స్యేంద్రుడును, గోరక్షుడును. వీ రాదిసిద్ధులు కారనియు, వీరికి విద్య నేర్పినది బౌద్ధమతమందలి వజ్రయానాది పంథల ననుసరించుచుండిన సిద్ధులనియు గొందరి యభిప్రాయము.

బుద్ధుడు జీవించియుండగనే సంఘములు చెదరిపోయి గుహ్యసమాజములు బయలుదేరి తంత్రసాధనలు బలిసెను. అచిరకాలములో బుద్ధత్వసిద్ధిని బడయుటకై తంత్రవిద్య యవలంబింపబడెను. అది బౌద్ధమతమందలి ముఖ్యసూత్రములకే యెసరుపెట్ట నారంభించెను. చైత్యములు కట్టి, సంఘములు పెట్టినంతమాత్రమున ప్రయోజనము లేదనియు, శిల మెట్లున్నను నెట్టిభయము లేదనియు చాటుచుండుటవల్ల నీ శ్రోత్రమార్గము దుశ్శీలురకు, దుర్మార్గులకు పట్టుగొమ్మ అయ్యెను.

నాథసిద్ధులు తొమ్మండుగురు. బౌద్ధుల యొక్క లెక్కలో నెనుబదినలుగురు సిద్ధులున్నారట. వారిలో నీ నవనాథసిద్ధులు చేరియున్నారు. పాదరసము నభ్రకము గలిపి చేసిన యమృతసమానమగు రసాయనమువలన సిద్ధిని చేకూర్చగలిగిన రసేశ్వరసిద్ధులకు, వీరికి చాల దగ్గర.

జీవన్ముక్తుడై, ప్రణవతనువు అనగా సూక్ష్మశరీరియై యున్న యొక శుద్ధమార్గసిద్ధుడు తుంగభద్రాతీరమున క్రీ. శ. ౧౨ శతాబ్దిలో నుండెనట. అతడొక మహేశ్వరసిద్ధుడు. అనగా చిరంజీవులైన యొక కోటి సిద్ధులకు గురువైనవాడు. ఇట్టి మహేశ్వరసిద్ధులు తొమ్మండుగురు. వీరందరు రసవాద విద్యాపారంగతులు. జరామరణములు లేకుండజేసుకొన్నవారు. నవకోటిసిద్ధులకు, నవనాథసిద్ధులకు నెట్టి సంబంధము లేదని కొందరి మతము.

చీనాలోని టావోయిస్టుమతస్థుడైన భోగు డనెడి సిద్ధుడు సిద్ధిని సాధించి యావిద్యను లోకమంతట గరపవలె నను దీక్షతో దక్షిణాపథమునకు వచ్చి యచ్చటి శైవాచార్యులకును, శాక్తేయులకును గరపగా రెండు మతములలో రెండు తొమ్మిదులు పదునెనమండ్రు మహేశ్వర సిద్ధులును, వారిలో నొక్కొక్కరి కొక్కొక్క కోటిమందిచొప్పున పదునెనిమిది కోట్ల సిద్ధులు శిష్యులుగా వెలసినట్లు ఒక గాథ యున్నది. ఈ అష్టాదశ మహేశ్వరసిద్ధు లందరు దాక్షిణాత్యులే *.

మూలర్ అను పేరు గల శ్రీ మూలనాథులు బహుశః భోగునివలన దీక్షను బడసియుండవచ్చును. వింధ్య దాటివచ్చి దక్షిణాపథమం దచ్చటచ్చట నుండుచు, సిద్ధమార్గము ననష్ఠించుచు, తుదకు నిర్విఘ్న తపస్సుకొరకై సిద్ధకూటపర్వతము చేరిన యగస్త్యులవారు భోగునికి సమకాలికులై యుండవచ్చునని కొందరు తలచుచున్నారు. సిద్ధకూటవాసుడైన యగస్త్యభగ

---

* తంత్రవిద్య, విశేషించి శక్తిపూజ దక్షిణమునుండి యుత్తరమునకు బోయినదని కీ. శే. విశ్వదాత కా. నాగేశ్వరరావుగారి యభిప్రాయము. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములోని 'అనాహతము' అను వీరి యమూల్య రచన చూడుడు.

వానుడు చిరకాలమువరకు శిష్యులకు తేజోరూపమున దర్శనమిచ్చుచుండినట్లు వాడుక. దక్షిణదేశములో కరువీరర్ శాక్తేయులకును, మలికదేవులు (తిరుమల గట్టయినర్) శైవులకును ప్రథమాచార్యులైనారు.

బుద్ధరూపజనార్దనుని యాచారము ననుసరించి యారాధించినగాని ప్రసన్నురాలను గానని సంసారవారిణి యగు తారాదేవి పలుకగా ఒక మహాఋషి చీనాకుబోయి హిమవత్పర్వతప్రాంతమందు సాధకేశ్వరసేవితుడును, కామినీపరివేష్టితుడు నైయున్న బుద్ధరూపజనార్దనుని సందర్శించి యాయనవలన నుపదేశము పొందినట్లుగా పార్వతితో పరమశివుడు చెప్పిన యుదంతము మహాచీనక్రమాచారతంత్ర మను గ్రంథములో నున్నదట. విచిత్ర మేమనగా నా మహాఋషి వసిష్ఠుడు!

బౌద్ధులు హిందువులైన నాథసిద్ధులకు నేర్పినారో, హిందువులైన నాథసిద్ధులు బౌద్ధులకే నేర్పినారోగాని సిద్ధమార్గము మన దేశములో తాంత్రికమార్గ మను పేర వ్యాప్తిగాంచినది. నాథసిద్ధు లనువా రింకను వంగదేశములో నున్నారట. వారు యోగులనియు, యుగులనియు బిలువబడుచు నస్పృశ్యులుగా గణింపబడుచున్నారట. జోగులమని, సిద్ధపురుషులమని చెప్పుకొనుచు పాములవాండ్రను చాలవరకు బోలు నొక జాతి దక్షిణకన్నడ ప్రాంతములో నిప్పటికి నున్నట్లు తన 'Castes & Tribes of south India'లో థర్‌స్టన్ (Thurston) వ్రాసినాడు. వారు తమ గురువు గోరక్షునాథుడని చెప్పుకొందురట. సిద్ధమార్గము మన దేశములో నాచారములో నున్నట్లు వివిధమతములలోని తంత్రశాస్త్రములే చెప్పుచున్నవి. తన ప్రభువైన గజనీ మహమ్మదుయొక్క యానతిమేర కీ దేశమునందలి విజ్ఞానమును సేకరించుకొనుటకై క్రీ. శ. ౧౦౩౦ ప్రాంతములలో నిచటికి వచ్చిన అల్బెరూనీ యను మహమ్మదీయ విద్వాంసుడు సిద్ధు డొక మనుష్యుని, ఒక కుక్కను బంగారుగా చేసినట్లు తాను విన్నానని వ్రాసియున్నాడు.

అక్బరు చక్రవర్తికాలములో నీ మతము మిక్కిలి ప్రచారములో నున్నట్లును, అవినీతికి పట్టుగొమ్మయిన దాని నణచవలెనని అక్బరు చాల ప్రయత్నించినట్లును కూడ తెలియుచున్నది. అతని కుమారుడైన సలీము స్వయముగా నీ మతమును గొన్నాళ్లనుష్ఠించినాడట. అప్పటిలో నిది పంచమకారములను ప్రతిపాదించువారి మతమై యనుష్ఠానములో మిక్కిలి దూష్యమైపోయెను. వేదబాహ్యమై, విదేశీయమై, బౌద్ధాచార్యమైన యీ మతము సనాతనులు గర్హించినను, నది యొకానొక మహావృక్షమువలె, నీ దేశములో గల యన్ని మతములలోనికి వ్రేళ్లు చొప్పించుకొని నిలువబడియే యున్నది. శిష్టులకు క్రమముగా నది యనాచారమయినందున బైరాగుల పాలబడి నేడది మఠములలోను, చెట్లక్రిందను చేరినది.



# గుణగ విజయాదిత్యుడు

[చారిత్రక నాటకము]

= శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు =

ఆంధ్ర దేశము నేలిన చాళుక్య నృపాలురలో నందరికంటె కడు గొప్పవాడు గుణగవిజయాదిత్యుడు. ఆ చాళుక్యచూడామణి క్రీ. శ. ౮౪౮ సంవత్సరము మొదలుకొని ౮౯౨ వఱకు, నలువది నాలుగేండ్లు నిర్వక్రపరాక్రమముతో అరిరాజభయంకరుడై పరిపాలించెను. ఆ మహారాజు కాలమున రాష్ట్రకూటులకును, చాళుక్యులకును నడుమ బద్ధవైరము ప్రబలియుండెను. ఆ రాజవంశములు ఒకరినొకరు కులవైరులుగా భావించుకొనుచు, ద్వేషించుకొనుచుండిరి. రాష్ట్రకూటులు కర్ణాట, మహారాష్ట్ర, ఘూర్జర మండలములను సార్వభౌమ పద లాంఛనములతో బరిపాలించుచుండిరి. వారి రాజధాని మాన్యఖేటము. దానికే కిరణపుర మని ప్రతినామ మున్నట్లు తోచును. ఆంధ్ర భూమిని పాలించుచుండిరి బెజవాడ రాజధానిగా చాళుక్యులు. ఇంచుమించుగా, గుణగవిజయాదిత్యుని కాలమున చాళుక్య రాష్ట్రకూటుల కులవైరము భయంకరరూపమును దాల్చెను. ఆ రాజేంద్రునికి సంగ్రామ రంగములందు ఎల్లప్పుడును అఖండ విజయము చేకూరెను. అతడు నిక్కముగ దిగ్విజయము చేయగల్గెను. సకల దక్షిణాపథమును గుణగవిజయాదిత్యుడు చక్రవర్తిపదముతో క్రీ. శ. ౮౭౦ మొదలుకొని ౮౮౦ వఱకు పదియేండ్లు పరిపాలించెను, ఆ కాలమున రాష్ట్రకూటులు విజయాదిత్యుని ధాటికి నిలువజాలక పోయిరి; ఆంధ్రోర్వీపతికి అరిగాపులయి వర్తించిరి. ఆంధ్రుల విభవైశ్వర్యములు మరల నొకసారి యుచ్చస్థితికి వచ్చెను.

గుణగవిజయాదిత్యుని కాలము ఆంధ్రులకు మరియొక కారణమునగూడ గర్వింపదగినది, చిరస్మరణీయమైనది. ఆతని కాలమునాటికే ఆంధ్రభాషయందు కవిత వెలసియుండెను. అంతియే కాదు; ఆంధ్ర కవిత్వ సంప్రదాయములు సంస్కృత కవులనుగూడ మురిపింప నారంభించెను. ఆంధ్ర కవితకు అలంకారములయిన యతిప్రాసములు సంస్కృత కవిత్వమునందుగూడ వ్యాపించెను. ఆంధ్ర భాషలోని తరువోజవృత్త మొకటి గుణగవిజయాదిత్యుని కాలమునాటిది బయలుపడినది. శిలాక్షర రూపమును బొంది యా తరువోజవృత్తము నేటికిని గానవచ్చుచున్నది.

ఆంధ్రులకును, ఆంధ్రభూమికిని, ఆంధ్రభాషకును మహోపకారమును చిరస్థాయిగా చేసిన మహానుభావుడు ఆ గుణగ విజయాదిత్యుడు. అతని కీర్తిచంద్రికలు ఆంధ్ర భూస్థలిని శాశ్వతముగా వెలుగుచున్నవి.

## మొదటి రంగము

[స్థలము : మాన్యఖేటమున లక్ష్మీభవనప్రాసాదమున అభ్యంతరమందిరము.

ప్రవేశము : చక్రవర్తి అమోఘవర్షుడు, యువమహారాజు కృష్ణవల్లభుడు, మంత్రి పురుషోత్తముడు.]

అమోఘవర్షుడు — వేంగినుండి మల్లరాజును, వృద్ధచారుడు విష్ణుభట్టును వచ్చియున్నారట! వారేవార్తలు తెచ్చినారు ఆంధ్రదేశమునుండి?

* ఆలిండియా రేడియో (మద్రాసు)వారి అనుమతిని.

పురుషోత్తముడు—గుణగవిజయాదిత్యమహారాజు తన ప్రెగ్గడల నంపి మన సామంతరాజలోకమునందు ఉపాయముతో రాజద్రోహమును వ్యాపింపజేయు చున్నాడట!

కృష్ణవల్లభుడు—ఎంత సాహసము! - వింగవిల్లి మహాసంగ్రామరంగమున, ఆతని తండ్రి కలివిట్టరునికి సంభవించిన అపజయమును, దానివెంట కలిగిన దుర్మరణమును, దానితోపాటు వేంగీశ్వరునకు వాటిల్లిన పరాభవమును బెజయుడు మరువలేకున్నాడు కాబోలు! దుర్మతి!

పురుషోత్తముడు—యువమహారాజు ఊహించినది సత్యము! అయినను ఒకవిశేషమును విన్నవింతును. వింగవిల్లి సంగ్రామరంగమున ఈ పరమభట్టారకులు చాళుక్యరక్తముతో కలివిష్ణువర్ధనాది సకలబంధుమిత్రజనములకును కర్మనాచరించినది. తర్పణము విడిచినది. కాలుని సంతృప్తిపరచినది కాజాలదు. విజయాదిత్యమహారాజు పగబూనినట్లున్నాడు.

అమోఘవర్షుడు — మంత్రిపుంగవుడు వచించినది మాకును యథార్థము యని పొడగట్టుచున్నది. నిక్కముగ బెజయుడీ యవమానము సహింపలేకున్నాడు. వింగవిల్లి రణరంగమున కలివిట్టరుని నిష్కారణవధకే గాక మనము వేంగీమహామహీరాజ్యభాగములనుగూడ నాక్రమించుకొని గరుడధ్వజమును బాదుకొల్పినదిగూడ బెజయునికి క్రోధకారణమై మనకును బాధించుచున్నట్లు గదా వింటిమి మల్లరాజువలన!

కృష్ణవల్లభుడు—తండ్రిగారు నా విన్నపమును అవధరింతురుగాక! బావ గుణగవిజయాదిత్యుడు సమరసన్నాహతత్పరుడై రణోత్సాహముతో కేరుచున్నాడని గూడ వృద్ధచారుడు తెలుపుచున్నాడు!

అమోఘవర్షుడు—బెజయుడు రణోత్సాహియై కేరుటలో నాశ్చర్యములేదు. బలవంతులైన బోయకొట్టముల నాయకులను బుగిలొల్పి, మనము త్రిభువనాంకుని యాజ్ఞ ధిక్కరింపజేయలేదా? వారిని వేంగిపై దండెత్తుమని సేనల సహాయ మంపలేదా?—మంత్రి పురుషోత్తముడు మా కిపుడు కర్తవ్యము నుపదేశింపవలయును!

కృష్ణవల్లభుడు—బావ మల్లరాజు వచ్చియే యున్నాడుకదా! మనల నాశ్రయించియున్నవాడు- ఆతని వేంగీశ్వరునిగా నభిషేకించినచో విజయుని కావరమణగగలదు!

పురుషోత్తముడు—ఇది మన మెటిగిన ప్రాతనీతిపద్ధతియ! ఆనాడు జరిగిన పరాజయమునకును, పరాభవమునకును ఈ యుద్యమము తీక్ష్ణప్రతీకారమునకు ప్రబలకారణము కాగలదని నా మతము. కావున ఆ ప్రయత్నమును విరమించుట మంచిది.

అమోఘవర్షుడు—మంత్రీ! కృష్ణరాజు పల్కినది మాకు అవశ్యము కర్తవ్యమని తోచుచున్నది. విజయుని తలంపులు మనకు వెఱపు కలిగింపజాలవు! కావున మల్లరాజును వేంగీశ్వరునిగా నభిషేకించి, వేంగిపై దండెత్తిపోవలయు; గుణగని గర్వ మడచి రావలయు!

పురుషోత్తముడు—ప్రభుచిత్తము, సంకల్పము అప్రతిహతములు. అట్లే అగుగాక—స్వామి! ఒక విన్నపము. గుణగవిజయాదిత్యుడు సామాన్యవీరుడు గాడు. అతడు మహావీరుడు. ప్రకృతిచేతనే అతడు మహాబలసంపన్నుడు. మహామల్లుడు. సాక్షాత్ అంకకారుడు. మరియు నాతని ప్రెగ్గడ, మహాసేనాని పండరంగడు ప్రచండదండనాయకుడని వింటిమి. బీభత్ససదృశపరాక్రము డాతడు. సాహస శౌర్య విక్రమములు మూడును మూర్తిగొన్న మహానుభావుడని విష్ణుభట్టు తెలుపుచున్నాడు. కదనభూమిని పెడబొబ్బపెట్టి "జయఘోష" (శంఖము)ను బూరించి ఖడ్గైకసహాయుడై సేనలకు ముందు నిలిచినపుడు ఎదిరిమూకలు భయభ్రాంతులయి, మహామారుతము వీచినపుడు ఎగిరిపోవు ఎండుటాకులవలె చీకాకుపడి చెదరిపోగలవు. అంతియ గాదు—పండరంగడు బృహస్పతి సమానుడయిన ప్రెగ్గడ. మరియు విజయాదిత్యుని మహామంత్రి వినయడిశర్మ భార్గవసదృశుడు. పగతుని లావు మనము చులకనచేయరాదు. త్రిభువనాంకుడు కోడెత్రాచువలె పగబూనియున్నాడు. ఆతని క్రోధానలము మనలను దగ్ధము చేయగలదు.

కృష్ణవల్లభుడు—మంత్రిభట్టారకులు విన్నవించినది సత్యము కావచ్చును. కాని వీరనారాయణుడును, రాష్ట్రకూటకులశైలవర్ధిష్ణువును, పరమభట్టారకులు నగు శ్రీవల్లభ - అమోఘవర్షమహారాజాధిరాజుల శ్రీపాదపద్మముల నారాధింపవచ్చినాడు మల్లరాజు! చాలదే ఇది మాకు? మల్లరాజు వేంగీశ్వరుడు! శరణాగత భూభృదాశ్రయులు ఈ శర్వమహారాజాధిరాజు. విజయాదిత్యుని శిక్షించి మల్లరాజును విజయవేంగీసింహాసనముపై గూర్చుండబెట్టలేకపోయినచో కలుగదే పరాభవము మాకు! అవశ్య మిపుడు యుద్ధమే కర్తవ్యము! పూజ్యులయిన తండ్రిగారి ఆనతి?—

అమోఘవర్షుడు—యువమహారాజు విన్నవించిన రీతి, మా కిపుడు కయ్యము కర్తవ్యమని తోచుచున్నది. వేంగినుండి యెప్పటికైన మనకు విపత్తు రాగలదు. కావున శత్రుసంహారము గావింపవలయును. విజయుని మరల తలయెత్తనీకుండ అణచి రావలయు. అదె మా అభిప్రాయము!

పురుషోత్తముడు—స్వామి! పగదీర్చుకొనుటకై బాహువుల తీటతో భుజాస్ఫాలనము చేయుచు తరుణమునకై వేచియున్నాడు విజయాదిత్యుడు—మరచియున్నారు కాబోలు!

అమోఘవర్షుడు—మంత్రీశ్వరుని మతము మాకు నుగతమగుటలేదు!

పురుషోత్తముడు—దేవరవారు అవధరింతురు గాక! వీరనారాయణావతారులైన పరమభట్టారకులు రాజనీతిధర్మములను, దండనీతిని ఎఱుగనివారు కారు. అయినను ప్రభుసేవకుని హితవచనము నాదరింపవలయును. సంగరాటోపమున మన మిపుడు విజయాదిత్యుని మీదికి నూటిగా దాడి వెడలరాదు. రాష్ట్రకూటరాజవంశమునకు దక్షిణసీమలందు నోడంబపల్లవ, గాంగకూటాధిపతులు అరిగాపులు. పాండ్యపల్లవులు పరమాప్తులు. నోడంబమంగిరాజును, గాంగపృథ్వీపతియును నైరృతినుండి వేంగీసీమలపైకి దాడి వెడలింపవలయును. పాండ్య-పల్లవభూపతులు వారలకు సహాయము రావలసినట్లు కోరవలయును. వారి నందరిని ఎదుర్కొన్ని, యోడించుట గుణగవిజయాదిత్యునికి సులభసాధ్యమైన పని గాదు. అంతియగాదు; వారల నోడింపజాలడు! ఒకవేళ వారిని ఓడింపగల్గినను, విజయాదిత్యుడు హతశేషములయిన మూకలతో మాన్యఖేటము మీదికి దండయాత్ర సాగింపనుజాలడు.

అమోఘవర్షుడు—మంత్రిశేఖరుని యాలోచన కడు లెస్సగా నున్నది. రాష్ట్రకూటసేనానులకు యుద్ధసన్నద్ధులు గావలసియున్నదని వార్తల నంపించుడు. ఆయత్తము గండు. (నిష్క్రమింతురు.)

రెండవ రంగము

[స్థలము సోరణమట్టి సంగ్రామ రంగము.

ప్రవేశము: గుణగవిజయాదిత్యుడు, పండరంగడు, మహామంత్రి వినయడిశర్మయు.

సంగ్రామరంగమున, చెవులు చిల్లులు పడునట్లు రణోత్సాహము వెల్లుగా నుబ్బునట్లు, శంఖ, భేరీ, ఢక్కా, తమ్మట జయఘంటధ్వనులు వినబడుచుండును. మధ్యమధ్య వీరభటుల హుంకారములు, పెడబొబ్బలు, మదపుటేనుగుల ఘీంకారములు, మావటీంద్ర హెచ్చరికలు, రాహుత్తుల బెదరింపులు, అశ్వముల ఘోషలు, సాహిణుల ఉత్సాహవాక్యములు వినబడుచుండును. నడుమ తలలు, అవయవములు తెగిపడిన గజతురగవీరభటావళి విహ్వలశోకములు, ఆర్తనాదములు గుండె లవియునట్లు వినబడుచుండును. ఎక్కడ జూచినను రణోత్సాహము. ఎక్కడ గాంచినను మహా సంరంభము.]

పండరంగ మహాసేనాని—(దుఃఖించుచు) హా! భువనైకవీరా! హా! తండ్రీ! హా! కదనగాంగేయ! ఎంతటి దుర్మరణము నొందితివి తండ్రీ! విక్రమైకసహాయుండనై వచ్చి, నీ ప్రాణములను రక్షించి పితౄణమును దీర్పలేకపోయితిని. తండ్రీ, ఎంత మందభాగ్యుడను! హా! హతవిధీ! ఎట్టిపాప మిది! ఎంత దారుణము! ఎంత కష్ట మెంత కష్టము! (దుఃఖించును)

గుణగవిజయాదిత్యుడు—ప్రభు పండరంగ సేనాపతీ, ఊఱడిల్లుడు; ఊఱడిల్లుడు! ... ఓహో! ఎంత విషాదవార్త ఇది— యుద్ధ మారంభమై యొక జాము

కూడ గడువలేదు. ఇంతలో ఎంతటి దుర్వార్త! ఎంతటి మహావిపత్తు! ఎట్టి దారుణమరణము!

వినయడిశర్మ—త్రిభువనాంకుశాపరనామధేయ! విక్రాంత చక్రాయుధా! సమస్త భువనాశ్రయుండవు! సంగ్రామశూద్రకుండవు! దుఃఖాతిరేకమున ధృతిహీనుండ వైనచో—

గుణగవిజయాదిత్యుడు—(అర్ధోక్తిగా) విప్రోత్తమా! చమూపతి కడెయరాజులు మాకు శస్త్రాస్త్ర విద్యలు నేర్పిన ఆచార్యులు. ఆ బ్రాహ్మణ చమూపతి ప్రభుపాండరంగనికి జనకులెట్లో, మాకు అట్లే గురువులు, పితృసమానులు! ఒక్కగడియక్రిందట ఆవృద్ధవీరుడు మా చెంతనే శౌర్యప్రతాపమూర్తియై అత్యద్భుతముగ కదనము సలిపియుండెను—కటకటా! ఇంతలో ఎంత విపత్తు వాటిల్లెను!

వినయడిశర్మ—వీరుడై వచ్చి, రణరంగమున వీరవిహారము సల్పి, వీరస్వర్గమును జూఱగొన్న జనకుని ఋణము దీర్పక, పగమాట మఱచి, శోకమున మునిగి విహ్వలుడైయున్నాడు ప్రభు పండరంగడు. అట్టివానిని ఊఱార్చుచు, ఇచ్చటనే కూర్చుండుటా దుఃఖమున మునిగి సమస్తభువనాశ్రయుడు! రణరంగమున జయమో, మరణమో బడయవలయు వీరుడైనవాడు! మగపంద—

గుణగవిజయాదిత్యుడు—అట్టుల కాదయ్యా విప్రోత్తమా! అనేక సమరసంఘట్టములందు, ఖడ్గైక సహాయుడై, నా చెంతనే పోరాడి, మా బాహువులను విజయప్రదముగా ఆశ్రయముగా జేసిన మేటివీరుడు ఆ మహానుభావుడు కడెయరాజు! ఆ కూళ, గాంగకూటాధముడును దుర్మదాంధుడు మంగియు గలిసి వ్యూహము పన్ని, అన్యాయముగ చుట్టుముట్టి, కదిసి, ఒక్కని చేసి, నిరాయుధుని గావించి కూల్చినారు కడెయరాజును. పరమాద్భుతముగ వీరవిహారము సలిపి గాంగ, పల్లవ, పాండ్యుల గజబలమును చీకాకుపరచి, అరగడియలోపల శతానేక గజములను తుత్తునియలు గావించిన చమూపతిని, గజసాహిణిని గోల్పోయిన మేము మందభాగ్యులము. నిస్సంశయముగా వేంగీశ్వరునకు కుడిభుజము తెగిపోయినది! (దుఃఖించును)

వినయడిశర్మ—ఇతడేనా! సమస్త భువనాశ్రయుడు?,......ఓహో! ఏమి యీ సంక్షోభము ఆ వంక—ఈ దిశను—ఏమిది? వీరభటులు లేమని యాక్రోశించుచున్నారు? మహారాజాధిరాజు త్రిభువనాంకుశు డెక్కడనియా! ఏమి, సేనలు వెన్నువిఱిగినట్లు తల్లడిలుచున్నవి!

పండరంగడు—(ఇంకను విహ్వల చిత్తముతో) హా! తండ్రీ! భువనైకవీరా! (దుఃఖించుచు మూర్ఛపడియుండును.)

గుణగవిజయాదిత్యుడు—ఏమి దురవస్థ యిది! మా సేనాపతి ఎక్కడ! మహా మంత్రీ!......పండరంగ మహాసేనాపతీ! ఊఱడిల్లుడు! ఊఱడిల్లుడు! కర్జమాలోచింపుడు. మీ పితృవియోగ దుఃఖమును మీ స్వామికూడ పంచుకొనుచున్నాడు కొంత! ఊఱడిల్లుడు. మా రాజచాళుక్య కులకల్యాణాభ్యుదయపరంపరాభివృద్ధికై, మా విజయసిద్ధికై కృతక్లేశుడై, అకుంఠిత స్వామిభక్తితో తన యసువులు ధారవోసిన శౌర్యమూర్తి, మహావీరుడు అగు మీ జనకుల ఋణమును మేమెట్లు తీర్చుకొనగల్గుదుము!......ప్రభు పండరంగ సేనాపతీ! ధైర్య మవలంబింపుడు! పగతుర బరిమార్చుటకన్న, పగతీర్చుకొనుటకన్న, మీ ప్రియజనకులకు మీరును, మా శస్త్రాచార్యులకు మేమును ఋణవిమోచనము గావించుకొనుటకు మరియొకమార్గమును గానము! లెండు! వీరరక్తముతో దడిసిన మీ జన్నిదముల చేబూని ప్రతిన గొనుడు! పగతుర గుండెయలు పగులునట్లు పెనబొబ్బ వెట్టి సింహనాదము చేసి, వీర శంఖమును బూరించుడు. భిండివాలమును, శూలమును కరముల ధరించి కదనరంగమున ఆకొన్న మగసింగము మాడ్కి—

పండరంగడు—(లేచి హస్తములు ముకుళించి, గంభీరస్వనముతో) దేవా! సమస్తభువనాశ్రయుడ!...మన్నింతురు గాక ఈయల్పబుద్ధిని. పండరంగడు సర్వదా స్వామికి భృత్యుడు. ప్రభువాక్యామృతము వర్షించి, నా దుర్భరదుఃఖము నుపశమింపజేసినది. అంతియేకాదు! మా ఏలినవారి వాక్యములు మా తండ్రిగారి ఋణముతో పాటు, నా స్వామిఋణమును గూడ దీర్ప ఉత్తేజన

మిచ్చుచున్నవి. దేవరవారు ఈసేవకునిపై జూపిన కరుణకు కృతజ్ఞుడను. కులవైరమును, జాతివైరమును దీర్చుకొనుటకంటె కర్తవ్యమింకొకటిలేదు ఈ తరుణమున! ఏలినవారు విజయసూచకమైన జయమంగళ శంఖమును బూరించి సింహనాదము చేయుడు. కదలుడు.

దేవా! వినయడిశర్మా! తాము శంఖమును బూరించుడు! సింహనాదము చేయుచు త్రిభువనాంకుశుని ఉత్తమాశ్వము నధిరోహింపజేసి ముందుకు దుమికింపుడు.

(పండరంగ సేనాపతియు, గుణగవిజయాదిత్యుడును తమ శంఖములను బూరించి అట్టహాసముతో సింహనాదము జేయుచు కదలుదురు)

## మూడవ రంగము

[స్థలము: సోరణమట్టిసంగ్రామ రంగమున మరియొకచోట.

ప్రవేశము: మంత్రి వినయడిశర్మ, గుణగవిజయాదిత్యుడు.]

వినయడిశర్మ—మహాసేనాపతీ! పండరంగా! ఏమి యీ సంరంభము! ఏమి యీ కలవరము! ఓహో! ఏమి యీ ఆర్తనాదము!......ఏమిది! ఏమనుచున్నారు! ప్రభువు త్రిభువనాంకుశు డెక్కడనియా? ఏమనుచున్నారు యోధవరులు?—సచ్చమూపతి-యువరాజ విక్రమాదిత్యభూపతి-ఏమి-ధూర్తుడైన మంగిరాజాధమునిచేత హతుడయ్యెననియా! ఎంత కష్టము-ఎంతటి దుర్వార్త! అబ్బా!

గుణగవిజయాదిత్యుడు—విప్రోత్తమా! వింటిని దుఃఖవార్త! వింటిని పిడుగువంటి దుష్టవార్త! (దుఃఖించుచు) అబ్బా! దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది. దుర్భరము! దుర్భరము!—ఒక్కగడియ లోపల మరణించిరి, ఇద్దరు రాష్ట్రులు, స్వామిభక్తిపరాయణులు, శౌర్యప్రతాప మూర్తులు—హా! హతవిధీ! (దుఃఖించును.) మంత్రిసత్తమా! వేంగియువమహారాజపట్టమహిషికి ఈదుర్వార్త నెట్లు గొనిపోవువాడనయ్యా! ప్రియానుజ! సచ్చమూపతీ! సకలభువనవందితశౌర్యుడవైన నీకీ పరాభవము రాదగినది కాదోయి! (మరల దుఃఖించును.)

వినయడిశర్మ—సహజముగ ధీరులైన ప్రభువు లిట్లు వాపోవజనదు. రణరంగమున త్రిభువనాంకుశు డీవిధముగ ధృతివిడరాదు. ప్రభూ! పరాకు. శక్తిత్రయాలంకృతుడ వీవు, మహాబలపరాక్రమసంపన్నుడ వీవు. స్వామి-పరాకు.

గుణగవిజయాదిత్యుడు—మంత్రీ! విప్రోత్తమా! (అర్ధోక్తిలో)

వినయడిశర్మ—ప్రభూ! పరచక్రరాముండవు, వరవరాహలాంఛనవీరమకరధ్వజుండవు, రణరంగరౌద్రుండవు! సమస్తభువనాశ్రయుండవు—దుఃఖమున మునిగి కర్తవ్యమును మరచి విహ్వలత నొందకు! స్వామి పరాకు!

గుణగవిజయాదిత్యుడు—పరమాప్తుడును, శక్తిత్రయాలంకృతుడును అగు మంత్రిశేఖరుని ఆదేశమును గ్రహించినాడను. కృతజ్ఞుడను. దుఃఖించుటకిది తరుణము గాదు—కాని, సోదరా! హా విక్రమాదిత్య చమూపతీ!

వినయడిశర్మ—స్వామీ! యుద్ధ మతితీవ్రముగ సాగుచున్నది. అపరాహ్ణము సమీపించుచున్నది. స్వామీ! ఆలసించుట తగదు!

గుణగవిజయాదిత్యుడు—ఓహో! ఆంధ్రసేనాపతులార! వీరభటులార! ఆలకింపుడు. విజయాదిత్య మహారాజు ప్రతిన వినుడు. యువరాజవిక్రమాదిత్యుని, శౌర్యమూర్తిని, బాలుని ఒక్కనిజేసి, పగతురు పలువురు చుట్టుముట్టి, అన్యాయముగ జంపిన క్రూరకార్యమునకు పగబూని ప్రతీకారము సేయగలవాడు ఈ గుణగ విజ[illegible]డు.

ధర్మదారభట్టికముందు, ఈ త్రిభువనాంకుశుడు తన సోదరుని క్రూరముగ కూల్చిన మంగిరాజాధముని శిరము త్రుంచి కదనభూమిని కందుకక్రీడ సలుపగలవాడు. మంగిరాజు రణభూమిని విడచి పారిపోకుండుగాక! ఆంధ్రసేనానులు అప్రమత్తులై యుందురుగాక! —రణభూమిని వెన్నిచ్చి పాఱిపోవు ఆంధ్రవీరభటుని కుత్తుక బట్టి అక్కడనే ఛేదించి యమపురి కంపవలసినదని ప్రతివీరభటునికిని ఈ విక్రాంతచక్రాయుధుని ఆజ్ఞ! ఓహో! ఆంధ్రవీరపుంగవులార! ఆలకింపుడు

మరియు, మంగిరాజు ఉత్తమాంగమునుండి స్రవించు వెచ్చని రక్తధారతో కాని ఈ విజయాదిత్యుడు తన తమ్ముడు విక్రమాదిత్యునకు తర్పణము విడువబోడు. ఓరీ మంగిహతకా! ఈ బిరుదాంకభీముని కరవాలమునకు గురిగాకుండ భీరుడవై రణస్థలిని వీడి పారిపోయెదవుసుమా!

(సింహనాదము చేసి జయఘోషశంఖమును బూరించి నిష్క్రమించును.

మరికొంతసేపటికి—మరియొకతావున - ఆ రణరంగమునందే.)

ఒక వీర రాహుత్తుడు—ఆంధ్ర సేనాపతులు, వేంగీవాహినీపతులు, పడవాళ్లు, నాయకులు, మన్నెనాయకులు, వీరరాహుత్తులు—అందరు మహా సంరంభముతో ఏమి పలుకుచున్నారు!

(వినుట అభినయించి)

ఆశ్చర్య మాశ్చర్యము!—ఆనంద మానందము! ఎట్లు జరిగెను?—వీర వతంసుడు—మహామతి—మంత్రి వినయడిశర్మ యా వేళ యెంత మహోద్భుతమైనది! —రాగోద్రేకమున—ధూర్తులైన సంకిలుడు, ఎఱ్ఱగంగడు, రాచమల్లుడు వెంటనంటి వచ్చుచుండ, కన్నర భూపాలుడు కంటికి రెప్పవోలె కాచుచుండ, వీరభటు లనేకులు మంగిని పరివేష్టించి అతిభీకరముగ పోరు సలుపుచుండ! భళిరే! నృపతిమార్తాండుండు, నిరవద్యశౌర్యుండు, మా బిరుదాంకభీముండు విక్రమించినాడు. కార్చిచ్చువోలె శత్రువులు పన్నిన వ్యూహమును దహించునట్లు చొచ్చుకొనిపోయి, మంగిహతకుని దుష్టశిరమును ఒక్కవ్రేటున తన కరవాలముతో ఖండించినాడు; కందుక క్రీడ సలిపినాడు - ఓహో ఆశ్చర్యమాశ్చర్యము. రాష్ట్రకూట సేనానాయకులు తమతమ ప్రాణములపై ఆస వీడజాలక ఎక్కడివారక్కడనే అంతర్ధానమగుచున్నారు. ఆశ్చర్యము! అహో! ఏమి! మా ఆంధ్రవీరుల వీరవిహారము! మాకే అఖండవిజయము.

పండరంగడు—(అశ్వారూఢుడై ప్రవేశించి) ఆంధ్రవాహినీ పతులార! వీరభటులార! విజయ సూచకములయిన శంఖారావములు గావింపుడు— జయవెట్టుడు. వెన్నిచ్చిపారు పగతుర భటులను కూల్చుడు. (అట్టహాసముతో) తిలకింపుడు! తిలకింపుడు - ఆవంక - విజయలక్ష్మీ, వీరలక్ష్మీ, శౌర్యలక్ష్మీ సమాలింగితుడై విక్రాంత చక్రాయుధుడు భీకరమూర్తియై వెలుగొందుచున్నాడు. వీర మకరధ్వజుడై దర్శనీయుడై యున్నాడు. భళిరే! కన్నులపండువుగ, మంత్రి పుంగవుడు వినయడిశర్మ సారథియై రథము నడుపుచుండ మా విజయాదిత్య మహారాజాధిరాజు రథారూఢుడై యీ దెసకే వచ్చుచున్నాడు. ఆటోపమున పగదీర్చుకొని వచ్చు ప్రతాపమూర్తికి, భువనకందర్పునకు, విజయాదిత్య భూపతికి, ఆంధ్రోర్వీశునకు జయవెట్టుడు—జయవెట్టుడు.

(అంతట జయజయధ్వనులు, విజయశంఖారావములు, మంగళ కాహళధ్వనులు చెలరేగును)

## నాల్గవ రంగము

[మాన్యఖేట నగరము-రాజప్రాసాదమున అంతః పురోద్యానవనము.

రాష్ట్రకూటులకును, చాళుక్యులకును నడుమ చెలరేగుచున్న వైరానలమును జల్లార్చి, ఎట్లయిన స్నేహమును, బంధుత్వమును పెంపొందించు తలంపుతో గుణగవిజయాదిత్యుడు, ప్రాతపగలను మరచి, ఆక్రమించుకున్న ఆంధ్రమండల భాగములను వేంగీశుని వశము చేయవలసినదని యువరాజు చాళుక్యభీముని మాన్యఖేటమునకు రాయబారిగా నంపెను. యువరాజునకు వినయడిశర్మ సహాయముగా చనెను. రాయబారము తుదకు నిష్ఫలమయ్యెను.

రాయబారము జరుగుచున్న ఆ దినములలో రాష్ట్రకూట రాజకన్య, కృష్ణవల్లభుని తనయ, చాళుక్యభీమకుమారునిపై వలపు నిలిపెను.

ప్రవేశము రాకుమారి నిరుపమ—వీణ పలికించుచు పాడుచుండును]

రాగము—మధ్యమావతి

సారసాక్షికి నీపైన చాల మమత గదర!
చారుచాళుక్యభీమ! చాన నేలుకోనర!
నీ మనసు తెలియలేక నీమీద నిలిపె వలపు

ప్రేమతోడ మనసు దెలిసి ప్రణయము గట్టుకొనర
తామసంబు జేయనేల! దక్కెను రమణి నీకు!
ఏమని తెలిపేవుర? కామించి వచ్చిన కాంత
కిపుడు!
రాకరాక మాయింటికి రమణుడ! వచ్చితివి సదర!
ఏక చిత్తమున ఇంతిని వరించి ఏలుకొనర!
చారుభీమ!

జోలి—

కులమున గుణమున రూపున
నిల నిక కన్య నిరుపమవంటి కన్నెలు గలరే?
చెలువకు నీవే తగుదువు
తలపగ నీయింతి నీకె తగును నరేంద్రా!

చాళుక్యభీముడు—రాజకుమారీ !

నిరుపమ—ప్రభూ !

చాళుక్యభీముడు—రాజకుమారీ ! నీవు శత్రు రాజకన్యకవు. నీతోడ మాకు చనవు చెల్లదు.

నిరుపమ—ప్రభూ ! ఈ తరుణి శత్రురాజకన్యక గావచ్చును, కాని మీపాదసేవ కాంక్షించుచున్నది.

చాళుక్యభీముడు—బాలా ! వేంగీశ్వరుని పను పున నడుపవచ్చిన మా రాయబార ప్రయత్నము నిష్ఫల మైనది. ఇక మే మిచ్చట ఒక ముహూర్తమైనను తడయరాదు. పోవలయు మా భూమికి తిరిగి, తత్ క్షణము !

నిరుపమ—(దుఃఖించుచు) తాత—వృద్ధరాజు తృష్ణాతంతునిబద్ధబద్ధుడై, మాత్సర్యముతో మీ కిపుడు ఎగ్గు తలపెట్టుచున్నాడు. దుర్యోధనునివలె మా తండ్రియు, రాధేయునివలె మామ సంకిలుడును దుష్ట బుద్ధులై వేంగీయువమహారాజును నిస్సహాయుని జేసి బంధించి చెఱపెట్టదలచియున్నారు ! ప్రభూ ! ఈ దుర్దశ వాటిల్లకుండ మాన్యఖేటమును విడచి వడిగ చన వలయు చాళుక్యరాజకుమారుడు.

చాళుక్యభీముడు—రాజకుమారీ ! ఆ మోఘ వర్షుడు దుష్టాత్ముడై తలపెట్టిన క్రూరకార్యము మాకును తెలియవచ్చెను, అప్తులయినవారివలన. తాతయు, మామయు ద్రోహబుద్ధితో నున్నచో, ఈ కుమారభీముడు నిస్సంశయముగా ద్రోహార్జునుడు కాగలడు.

నిరుపమ—బావా ! మీ హృదయ మింకను ప్రసన్నము కాలేదు—నే నెంత నిర్భాగ్యురాలను ! బావా ! మీ ప్రాణరక్షణకై మిమ్ముల నీరప్పటికాట రాజధానిని విడిపొమ్మనవలసివచ్చినది. కాని నా ప్రాణ రక్షణకై మిమ్ములను ఇచ్చుటనే నిలుపుమని నా మనసు శోకాగ్నితో నలిగిపోవుచున్నది.

(నేపథ్యమున సంరంభము. సింహనాదములు కేకలు, ఆయుధముల ఒరపిడిశబ్దములు. అంతట వీర భటుడు సాయుధుడై ప్రవేశించును.)

వీ. భటుడు—అల్లదే ! కుమారచాళుక్య భీమ నృపాలుడు-కులకన్యామానహరుడు-పట్టుడు. పట్టి తల గోయుడు.

సంకిలుడు—ఓరీ ! మూర్ఖుడా ! ఏమను చున్నావు ! నీవు తలపెట్టినది ద్రోహకార్యము. రాయ బారియై వచ్చిన రాజకుమారుని నిర్హేతుకముగ అంతః పురమునందు వధించుట పాపకార్యము.

వీరభటుడు మరియొకడు—వేంగీ యువరాజు కరవాలము ధరించి, కొదమసింగమువలె మీదికి ఉఱుకు చున్నాడు. ఎదుర్కొనజాల మా కుమారవీరుని.

సంకిలుడు—భీరువులై పారజూచెద రేల ఈ భటులు ! చుట్టుముట్టుడు. బంధింపుడు, బంధింపుడు!

(తెరలోనుండి సింహనాదము వినబడును.)

వీరభటులార ! నిలుడు, నిలుండు ! కుమార భీముని ఎల్లరు నొక్కసారి ఎదుర్కొనుడు—పారి పోవుటకు ఊంకించుచున్నాడు అతడు.

కృష్ణవల్లభుడు—చాళుక్య హతకుని చుట్టు ముట్టుడు. శరపరంపరలచే నాతని మేను నొవ్వజేయుడు —ఓహో ఏమి ఈ కుమారవీరుని పరాక్రమము!— వీరభటులార! అందరు గూడి ఒక్కపరి కుమారునిమీది కురికి నిరాయుధుని జేసి బంధింపుడు- బంధింపుడు.

(తెరలో—"ఓరోరి పిరికిపందలార! మీ రెంత ద్రోహులు- అధర్మయుద్ధమా మీరు సాగించునది."

ఒక ఆక్రందనము వినబడును. తరువాత కొన్ని ముహూర్తముల కొలము అంతయు నిశ్శబ్దము)

వీరభటుడు—వీరభటులార! చాళుక్య కుల కేతువు గాయపడి మూర్ఛనొందినాడు. ఆతని గాయములకు చికిత్స గావింపవలయు; గొనిపొం డాతని శీఘ్రము-సేదదేరక మునుపు.

(ఆ నాటి రేయి)

నిరుపమ—తండ్రియు, మామయు క్రూరులై, నా హృదయేశ్వరుని-మూర్ఛిల్లినవానిని బంధించి కొని పోయి చెఱయందుంచినారు. నా పతి గాయములవలన ఎంతబాధ నొందుచున్నాడో గదా! హా! ఎంతకష్టము! (దుఃఖించును)

ముఖారి రాగము

నామనను నీ మనను ప్రేమ నిండియుండగ
ఏమేమొ కడగండ్ల పాలయితివే నావారి వలన
ఎద గరిగి నామాట యీచుకైన ఎంచరైరి
మదితరో వాని యిందు తోడితెమ్మని వేడితి
అటుకంటివాని కిల్లాలుగాని
యిటువంటి జన్మ మెందులకు?

(తెరలో కోలాహలము)

సంకిలుడు—అమాయికపు హరిణి వేటకొండ్ర యుచ్చులలో జిక్కినది—కులపాంసుల ఈ రాజకన్య. కన్నరవల్లభుని గారాబుపట్టి యని వెఱవక ఆ ద్రోహిని, నిరుపమను బంధించి చెఱయందుంచుడు. చెలికత్తెల నెవ్వరి నటు చేరనీయవలదు. అప్రమత్తులై యుండవల యును. ఇది రాష్ట్రకూట కులస్వాముల ఆజ్ఞ!

నిరుపమ—హా! (అని ఆక్రందనము)

ఐదవ రంగము

[బెజవాడనగరమున - నగరులో-అంతఃపురము-మహారాజమాత శీలమహాదేవి-వృద్ధదాసి మంగళ.]

వృద్ధదాసి—పరమభట్టారికా! పరాకు. పరమేశ్వరుడు శ్రీ విజయాదిత్యమహారాజాధిరాజు ఏలినవారి దర్శనార్థము వత్తురని వృద్ధకంచుకి తెలిపినాడు. వచ్చువేళయైనది.

శీలమహాదేవి—బాలుని - భీముని రాయబార ప్రయత్నము నిష్ఫలమైనట్లేకదా!

వృద్ధదాసి—నిష్ఫలమే కాదు! మహారాజజననీ! అవమానకరముగాకూడ పరిణమించినది. కుమారభీముని, ద్రోహులై తాతయు, మామయు బంధించి చెఱ బెట్టినారు.

శీలమహాదేవి—కన్నరు డెంత క్రూరుడైనాడు! మంత్రి వినయడిశర్మ తిరిగివచ్చినారుగదా!

వృద్ధదాసి-వచ్చినారు. ప్రాణోపద్రవపరిస్థితులనుండి తప్పించుకొనివచ్చినారు.

శీలమహాదేవి—మంత్రిపుంగవులనుగూడ బంధింప దలపడిరిగాబోలు దుష్టాత్ములు!

వృద్ధదాసి—మహారాజపత్నీ! అవధరింపుడు! ఆకథ యిట్లు జరిగెను-కుమారభీముని బందెగాబట్టుకొను టలో నిమగ్నులైన కన్నర సంకిలాదులు కొంత ఏమరి యుండిరి. మంత్రియు తనకును, ఆయుష్మంతునికిని ఏమయిన విపత్తు రాగలదని ముందుగా గ్రహించి, తన పరివారమును రెండుగా విడదీసి ఒక దానిని కుమారునికి అంగరక్షగా నిలిపి, రెండవదానిని తనకు తోడుగా నుంచుకొని, యెందులకైనను మంచిదని తలచి ప్రస్థాన ముహూర్తమునకు కొన్నిగడియలు ముందుగనే మాన్యఖేటమును విడచి పయనమయ్యెను. ఇది కన్నరాగులకెవ్వరికి తెలియదు.

శీలమహాదేవి—ఈసన్నాహ మంతయు కుమార భీమునికి దెలిసియుండెనా?

వృద్ధదాసి—తెలియును. భీమకుమారు డంతకు ముందే సర్వసన్నద్ధుడై, నాకు వెన్నెలలోయి యని తన ప్రాసాదముచెంత నున్న నందనవనమునందు విహరింప బోయెను. ఒంటరిగ-నర్మసఖుడుగూడ వెంటరాకుండ.

శీలమహాదేవి—బిడ్డా! నీవు చేసినది నిక్కముగ అవిచారమైనది సుమా.—పిదప నేమి జరిగెను?

వృద్ధదాసి—ఆ విధముగా కొంతవడికు - అమాత్యుని అప్రమత్తతవలన-పగతుర పన్నాగములు నిష్ఫలమయ్యెను. రాష్ట్రకూటరాజధాని విడచిన నాల్గవదినమున

జరిగిన ద్రోహము నంతయు వినయడిశర్మ విశ్వసనీయు లైన వృద్ధచారులవలన దెలిసికొనగల్గెను.

శీలమహాదేవి—దురాత్ముడైన అమోఘవర్షుడు ఆయుష్మంతుని కేమయిన ఎగ్గు తలపెట్టడుగదా! తరువాత! తరువాత!

వృద్ధదాసి—మాన్యఖేటమునందు జరుగుచున్న వృత్తాంతములను ఎప్పటికప్పుడు బెజవాడకు చేర్ప వలసినదని మంత్రి చారులను నియమించినాడు.

శీలమహాదేవి—నాకుజూడ కుమారభీముని చెఱ విముక్తిని చేయుట అవశ్యకర్తవ్యమని తోచుచున్నది. కాని—

వృద్ధదాసి—ఆయుష్మంతుడైన మహారాజు తల్లిగారి దర్శనార్థము వేచియున్నారు.

శీలమహాదేవి—అవశ్యము ప్రవేశపెట్టుము.

గుణగవిజయాదిత్యుడు—(ప్రవేశించి) అమ్మగారి శ్రీపాదపద్మములకు బెజయుడిదే సాష్టాంగ నమస్కారము నాచరించుచున్నాడు. (సాష్టాంగముగ ప్రణమిల్లును)

శీలమహాదేవి—బిడ్డా! ఆయుష్మంతుడా! నీ మనోభీష్టము సిద్ధించుగాక!

గుణగ విజయాదిత్యుడు—పూజ్యులైన తల్లిగారి ఆశీర్వచనప్రభావముచేత! అమ్మా, నన్నిపుడొక సంకటమైన సంశయము వేధించుచున్నది. కర్తవ్యమును నిర్ణయింపజాలక అమ్మగారిని ఆశ్రయింపవచ్చినాను.

శీలమహాదేవి—మంత్రియు, ప్రెగ్గడయు నేమని యుపదేశించుచున్నారు?

గుణగ విజయాదిత్యుడు—వారు, ముందుగా రాజనీతిజ్ఞులైన మహారాజమాతయొక్క అభిప్రాయమును దెలుసుకొనగోరుచున్నారు. సమరసన్నాహముతో మనము రట్టపాటిమీదికి జైత్రయాత్ర వెడలినచో, దుష్టాత్ముడైన వృద్ధరాజుకు ఏమి దుర్బుద్ధి వొడమునో యని భయపడుచున్నారు.

శీలమహాదేవి—ఊఁ.

గుణగ విజయాదిత్యుడు—“మాతోడ వైరము బెంచుకొని మామీదికి యుద్ధము దలపెట్టివచ్చినచో—మీ యువరాజకుమారుడు మా పీటిలో బందియై యున్నాడని మరువకుందురుగాక.” యని సందేశ మంపినాడు ధూర్తుడు కన్నరుడు.

శీలమహాదేవి—(కోపముతో) ఏమేమి? పగబూని రట్టేశుని శిక్షింపబోయినచో, ఆ శర్వరాజాధముడు కుమారునికి కీడు వాటింతురనియా నీభయము? భీరుడా!

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! మీగర్భమున జనించిన ఈ బెజయుడు భీరువు గాడు—కుమార చాళుక్యభీముని భద్రస్థితికి ప్రాకులాడుచున్నాడు.

శీలమహాదేవి—రాచపుట్టువుబుట్టిన నీకు, శక్తిధరప్రసాదమున జనించిన నీకు—ఈవిధముగ సంశయమును, వెఱపును ఎట్లు కలుగుచున్నవయ్యా!

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! సాహస విక్రమశౌర్యములు కలిగియు, బెజయుడిట్లు పలుకుటలేదు.

శీలమహాదేవి—బెజయుడా! విగతభర్తృకయై దుఃఖమున మునిగియున్న యువరాజవిక్రమాదిత్యుని పట్టమహిషి కీ పరాభవాగ్ని తల్లడిల్లుమందజేయుదే! కాల్పదే! బెజయుడ! కుమారభీముని శత్రుహస్తగత మొనరించి ఇక వేంగాంబికకు దుఃఖోపశమన మెట్లు చేయదలచితి వయ్యా?

గుణగ విజయాదిత్యుడు—(ఊఱకుండును)

శీలమహాదేవి—పలుకవేమి? బెజయుడ! విఙ్గవిల్లి మహారణరంగమున నీతండ్రిని క్రూరముగ బరిమార్చిన విధము నీకేల రోషమును బుట్టింపదోయి? పగదీర్చుకొన బుద్ధివొడమ దేల నీకు? ప్రతీకారము చేయజాలని నీమగటిమి కాల్పనే? రట్టేశు డాక్రమించుకొనిన అంగ్రసీమలను మరల బలిమివాటించి లాగుకొనుటకు పౌరుషమైన లేదు నీకు?

గుణగ విజయాదిత్యుడు—(ఊఱకుండును)

శీలమహాదేవి—ఊఱకుండెదవేల! ద్రోహియైన మల్లరిగూడ తమ్ముడని యుపేక్షింతువేమొ?

గుణగ విజయాదిత్యుడు—(ఊఱకుండును)

శీలమహాదేవి—అయిన ఉపేక్షింతువా? శిలా ప్రతిమవలె ఊరకుందువా నిర్వీర్యుడవై?

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! ఒకవంక తమ్ముడు ద్రోహియై శత్రువుల నాశ్రయించి యున్నాడు. వేరొకవంక సోదరతనూభవుడు శత్రువులచే జిక్కి యున్నాడు బందియై—

శీలమహాదేవి—కర్తవ్యమును నిర్ణయించుకొన జాలని మందబుద్ధివో నీవు-కులవైరము దీర్ప గుణసాహసము లేదె నీయందెలో?

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! మీకు విక్రము డెట్టి తనయుడో, మల్లడు గూడ అట్టి తనూభవుడేగదా?

శీలమహాదేవి—విక్రమాదిత్యుడును, మల్లుడును నీకు సమానమైన సోదరులైనచో గావచ్చును; నుక్షత్రియాంగననైన నాకు వారిరువురియందును సమానపుత్ర ప్రేమ లేదు. స్వామిద్రోహము, దేశద్రోహము, అన్నిటికన్న దుర్భరమైన మాతృద్రోహమును తలపెట్టిన అధముని, పాతకిని, కూళను కుమారుడని ప్రేమింప జాలను. అట్టివానిని క్షమింపజాలను. తన వంశమును, తన యేలికను, తన దేశమును పారతంత్ర్యమున బడద్రోసి, అవమానమును సంఘటిల్ల జేసిన నీచుడు, స్వార్థపరుడైన దుర్మతి నాకు కొడుకును గాడు; నీకు సోదరుడును గాడు. మల్లడు కుంతవ్యుడు గాడు. వాడు మనకు పగవాడైనాడు. పగతురపాదముల నాశ్రయించిన హీనుని చాళుక్యరాజకులవధువు సహింపదు. ఇక్కడ పుత్రస్నేహమునకు నలుసంతైన తావులేదు

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! ఇట్టి వింత వచనములు తమ నోటివెంట వెడలునని నేను ఊహింపలేకున్నాను.

శీలమహాదేవి—విఖ్యాతసాహసుడైన కలివిష్ణువర్ధన మహారాజుల పట్టమహిషి, శక్తిత్రయప్రభావుడైన విజయాదిత్యుని తల్లి వీరపత్నియని, వీరమాతయని గర్వించును. గుణగ! మల్లనివంటి కులద్రోహిని గన్నది ఈ శీలము గాదు. ఆ కులపాంసువు ఈ చాళుక్యరాజ కులవధువు స్తన్యమును త్రాగలేదు.

గుణగ విజయాదిత్యుడు— మీ వాక్యములను నేను వినజాలకున్నాను.

శీలమహాదేవి—విన లేకున్నచో - బెజయుడా, వేంగిమహీరాజ్యమును నీ తమ్ముడు హైహయునికి, నృపకామునికి పట్టముగట్టి, ఎందేని బొమ్మా! ఆ పంద నీ మామ అమోఘవర్షునివలె, అసమర్థుడవు గావున, రాజ్యమును త్యజించి, మునివృత్తి బూని, మఠమునందు ప్రవేశింపుము. — వేంగీ త్యాగసింహాసనముపై కూర్చుండుటకు అర్హత లేదు నీకు.

గుణగ విజయాదిత్యుడు—అమ్మా! అమ్మా!

శీలమహాదేవి—నీకు విక్రమసాహసములు లేవు! కుమారభీముని చెఱవిముక్తుని జేసి రాజచాళుక్యకులప్రతిష్ఠలు నిలుపజాలని అసమర్థుడవు నీవు. తెలియును నాకు! పతివిహీనయై పసదూలి అవమానమును భరింప జాలక శోకసముద్రమున మునిగియున్న వేంగాంబికకు-యువరాజ్ఞీపట్టమహిషికి దుఃఖోపశమనము కూడ చేయ జాలని నిర్వీర్యుడవు. శౌర్యహీనుడవు ప్రతాపుడవు నీవు!

గుణగ విజయాదిత్యుడు—తల్లీ! నీవు వీర పత్నివి-వీరమాతవు—తల్లీ!

శీలమహాదేవి—బెజయుడా! నీ సాహసవిక్రమములు, నీ శౌర్య ప్రతాపములు, నీ బాహుబలము, నీ శస్త్రాస్త్రవిద్యలు, నీ రణకౌశలము-అన్నియు నిరర్థకములు.

గుణగ విజయాదిత్యుడు—అమ్మా!

శీలమహాదేవి—బెజయా! నీరాజనీతిమర్మజ్ఞత వ్యర్థమైనది! అమోఘవర్ష మహారాజు వట్టి భీరువు. కన్నరుడు దుష్టాత్ముడు. సంకిలుని యుపదేశమున, ముందు వెనుకల నారయక కుమారభీముని చెఱవెట్టినారేగాని, నా రాతని శిగపూలనుగూడ వాడనీయజాలరు! రాష్ట్రకూటకులస్వామికి అంతటి ధైర్యసాహసములు లేవు. మంత్రి పురుషోత్తముని యాదేశమును వారు పాటించి యుండరు. బెజయా! సాహసాంకుడవు గమ్మా! జైత్రయాత్రో వెడలుము బలముల గూర్చుకొని. విజిగీషుడై వేంగికి మరల మహావైభవదర్పములతో మరలి రాగలవు.

గుణగ విజయాదిత్యుడు—తల్లిగారి ఆశీర్వచనము అమోఘమై ఫలించునుగాక-అమ్మా! మీ యాజ్ఞ

శీలమహాదేవి—శీఘ్రంబ ప్రస్థానభేరి మ్రోగించుట్లు ఆనతిమ్మా.

(సశేషము)

# సంచలనం

"పో. శా

విశ్వశుభంకర విధ్యుక్త హోమ ధూమాబ్దవియత్తల మైనయపుడు
తృప్తవైశ్వానర దేదీప్యమాన శిఖాపవిత్రమహస్సు కలిగినపుడు
సచ్ఛాత్ర సువిమల స్వరనిర్గతోద్గీత వేదగానమ్ము విన్పించినపుడు
విన్యస్త హస్తార్ఘ్య వేళాకృతస్నాన సంధ్యాజపాధర్మసంధియపుడు
నిత్యహోమేంధనోద్యోగ నియత శిష్య-పాళి కాననాంతర మేగవలసినపుడు
లలిత లలితమ్ముగా మధురమధురమ్ము-గాగ సూర్యోదయమ్ము సంఘటితమయ్యె!

ఆ ప్రాతర్మృదుకాంతిలో జలకమై ఆమగ్నలజ్జాకళా
భిప్రాయాత్తవిముగ్ధ యౌవన మనఃప్రేమమ్ముతో నామె ది
వ్యాప్రాయమ్మున కూలమెక్కెనది నవ్యస్వచ్ఛతారుణ్యరే
ఖాప్రాశ్లిష్టమనోహరాంగక రహః క్రాంతిప్రభాపుంజమై.

తడిసిపోయినయట్టి తరుణిపయ్యెద చూచుకమ్ముల బలిమితో ఘర్షణపడె
మృదుపాదముల నది కదలనీయదు చీరె జీరాడి జీరాడి చిక్కువెట్టె
తడిసిన తలకట్టు తనచేతి సవరింపులకె విననట్లుగా కొకిబికిపడె
ఆశ్లేషకోష్ణతకైన శరీరమ్ము స్నానశైత్యమ్ము ననాదరించె
నిత్యకర్మలలో నామె నియతిమీద-యౌవన మ్మొక్కపెట్టుగా నడ్డుపడియె
ఆమె గౌతమమునిపత్ని ఆకుటీర-మందు సౌందర్యదేవతయౌ అహల్య.

ఎందఱు స్వఃకళాయువతు లీమునిపత్నికి లాస్యమిచ్చిరో
ఎందఱు మేనకల్ నడకయే యొక నాట్యముసేత నేర్పిరో
ఎందఱు రంభ లీతరుణి కేమసృణప్రణయాత్ము లిచ్చిరో
అందము లీమె వ్యాధికి మైనవి కా వవి అన్యసృష్టముల్.

ఆమె నవ్విన నవ్వులో అమరసుధలు-ఆమె పలికిన పలుకులో అమరకృతులు
ఆమెనడచిన నడకలో అమరగతులు-శాపదష్టాప్సరఃకన్య తోపజేయు.

ఆ తళుక్కుజూపులో యామినీప్రియశీతకిరణాల మించెను విరహావహ్ని
ఆ లౌల్యవేణిలో లేలిహానము నైగనిగ్యమ్ము మించెను నిస్తులతయు

ఆ సూక్ష్మకటిలోన హర్యక్షసౌందర్యమును మించిపోయెను నునుపుదనము
ఆ శ్రోణియుగములో అధికసైకతభూములకు మించినది విశాలక్రమమ్ము
ఆ మృదులపాదములలోన నమరినయది-పద్మసౌందర్యమును క్రిందుపరచు మెఱుగు
ప్రకృతికి నవకమును దిద్దవచ్చునామె-ప్రకృతిలో కట్టుబడినది వక్రజగతి.

ఆమె తటిల్లత ఆమె మ-హామసృణమహేంద్రచాప మామె గిరిఝరీ
కోమల ఆమె పరిసరము-లామెకతమ్మున సొబంగు నందిన వేమో.

మౌనినాథుడు గౌతము డానతినిడె-ప్రాతరర్చనకై శుభ్రవారి దేర
తాను శౌచమ్ముకోసమై స్నానమాడి-వీకగల యౌవనము దాచలేకపోయె.

అత డెన్నాళ్ళుగ వేచెనో కనియెనో ఆ నవ్యలావణ్యభూ
షితమూర్తిన్ తలపోసెనో కలగెనో చిత్తమ్ము తత్సుందరీ
మతవిజ్ఞానముకోసమై వలచెనో స్పందించెనో బుద్ధి ని
ర్గతమోహప్రభచే, మహేంద్రు డత డర్చ్యస్వర్గధాత్రీపుడున్.

ఆమె తనువు కమండలువందు నీరు-నించి మోహనమ్ముగ లేచి నిలువబడియె
అతని నేత్రమ్ము లామెదృక్తతికి నియమి-తములయస్కాంతసదృశము లమలములుగ.

యౌవన మామె నాతని కటాక్షపరీక్షకు నిల్వబెట్టె, తా
నావివిధప్రభాత్తమునినాథుని పత్ని, అతండో నిత్యను
శ్రీవరణీయ యౌవన విశిష్ట మహిమ్నుడు, తా నహల్య, ఆ
దేవుడె యింద్రుడౌ నెదురుతెన్నులు చూచుటొ నిగ్రహించుటో?





# డోంగ్రేగారి

బాలామృతము
బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును

వేటూరి—

సుందరశాస్త్రిగారి

# సువర్ణ సుందరరసము

సర్వప్రమేహములకు సంజీవి.

గుణము ప్రత్యక్షము
అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి ప్రమేహాలనైనా కుదుర్చును.

**50 మాత్రలు రు. 5.**

**ఆర్షరసాయనశాల, ముక్త్యాల.**

## ఉజ్వలమైన సతీత్వము



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## గర్భాశయరోగ నివారిణి



**అరుణ** ఋతుదోషములను పోగొట్టి, పరిపూర్ణ స్త్రీత్వమును ప్రసాదించగల స్వయం సంపూర్ణమగు ఔషధము. అట్టిదానిని విడువక సేవించినట్లయితే, మిమ్ము ఆరోగ్యవంతులను జేయుటయేగాక, మీ జీవన పరమావధి యగు అమందానందమును తప్పక యొసంగును.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్**
**టి-నగర్.... మద్రాసు.**

# ప్రతిఫలం

[కథానిక]



= 'జమదగ్ని' =

లెక్కల మాస్టారు వస్తున్నారు!

ఏ కుఱ్ఱాడూ బైటికి వచ్చి తొంగిచూడలేదు. లోపల్లోపల గుసగుసలుకూడా ఏమీ లేవు. అందరూ ఎవరిచోట్లల్లో వారు కూర్చుని పుస్తకాలు తెరిచి సిద్ధంగా ఉన్నారు.

అప్పుడే మాస్టారు రానే వచ్చారు.

ఎదురుగుండా హోమ్‌వర్కు పుస్తకాలు పేర్చి పెట్టి ఉన్నాయి. ఆయన వాటిని చూడడంతో కాలక్షేపం చెయ్యలేదు.

'చెయ్యనివాళ్లు ఎవరు?' అని ప్రశ్న వేశారు.

సమాధానంగా ఇద్దరు నిలబడ్డారు. ఒకడు శ్రీమన్నారాయణ, రెండవవాడు గౌడ. వాళ్ళిద్దరూ మామూలుగా చెయ్యనివాళ్లే! తెలివితేటలకు తక్కువా అంటే ఏమీ కాదు. కాని చెయ్యకపోవడానికి పట్టి బద్ధకమే కారణం. ఈ విషయం వాళ్లకూ తెలుసు, ఆయనకూ తెలుసు. అయినా ఆయనకు కోపంరాలేదు.

చేసినవాళ్ళవంక చూసి 'మీలో ఎవరికైనా సందేహాలున్నాయా?' అన్నారు మాస్టారు.

ఎవ్వరూ లేచి నిలబడలేదు.

'అయితే ఈ లెక్క వేసుకుని చెయ్యండి' అని బోర్డు మీద ఒక లెక్క వ్రాశారు. అందరూ వేసుకుంటున్నారు. నిలబడిఉన్న శ్రీమన్నారాయణా, గౌడా మాత్రం ఒకరితో ఒకరు కీచులాడుకుంటున్నారు.

మాస్టారు క్లాసువంక తిరిగిచూచారు. ఇంకెవరికైనా అయితే కోపం వచ్చేదే! ఆయన మాత్రం శ్రీమన్నారాయణను పిలిచి లెక్క చదవమన్నారు. అతను చదివాడు.

'మనం ఏం కనుక్కోవాలి ఇందులో?'

'అన్నరు కనుక్కోవాలి సార్'

ఈ ముక్క అని ఒక్కమాటు శ్రీమన్నారాయణ క్లాసువంక చూచాడు. అందరూ నవ్వుతారనుకున్నాడు పాపం! కాని వాళ్ళంతా లెక్క చేసుకుంటున్నారు. ఒక్క గౌడ మాత్రం వాడన్న మాటకు నవ్వుకుంటున్నాడు.

'ఏమోయ్! అంతేనా గౌడా?' అన్నారు మాస్టారు.

గౌడకు శ్రద్ధ లేకపోయినా భయమూ, భక్తీ ఎక్కువ. 'కాదు సార్! వెడల్పు కనుక్కోవాలండీ' అన్నాడు.

'దేని వెడల్పు?'

'భూమి వెడల్పు సార్'

'ఎటువంటి భూమి?'

'దీర్ఘ చతురస్రాకారపు భూమి సార్'

'ఏమోయ్! శ్రీమన్నారాయణా! నువ్వేమంటావ్? ఇదేనా కనుక్కోవాలిసింది?'

శ్రీమన్నారాయణ తెల్లమొహం వేశాడు. తెలియక కాదు. క్లాసు అంతా కాక పోయినా గౌడ కూడా తనతో కలిసి రాలేదని. అయితే ఏం చెయ్యగలడు?

'అవునండీ సార్!' అన్నాడు.

'లెక్కలో మనకు ఏమేమి ఇచ్చారు?'

'వైశాల్యం ఇచ్చారండి!'

'దేని వైశాల్యం?'

'భూమి వైశాల్యం ఇచ్చారండి'

'ఇంకా ఏమిచ్చారు?'

'పొడుగు ఇచ్చారండి!'

'అసలు ఇటువంటి భూమియొక్క వైశాల్యం ఏం చేస్తే వస్తుంది?' అన్నారు ఎదురుగుండా ఉన్న బల్ల చూపిస్తూ మాస్టారు.

'పొడుగునూ, వెడల్పునూ ఒకదానిచేత ఒకటి హెచ్చవేస్తే వస్తుందండి'

'కాబట్టి పొడుగూ, వైశాల్యమూ ఇచ్చినప్పుడు వెడల్పు కనుక్కోవాలంటే ఏం చెయ్యాలి?'

'వైశాల్యాన్ని పొడుగుచేత భాగించాలండి'

'ఇచ్చిన వైశాల్య మెంత?'

'ఇరవై అయిదు'

ఇప్పటికి క్లాసులో అందరూ లెక్క చేసేశారు.

శ్రీమన్నారాయణ చెప్పిన సమాధానానికి అందరికీ నవ్వువచ్చింది. కాని పైకి ఎవ్వరూ నవ్వలేదు.

'ఇరవై అయిదేమిటి?'

'మైళ్లు అండి'

ఈమాటు క్లాసు నవ్వు ఆపుకోలేకపోయింది.

'ఈ ఇరవై అయిదు మైళ్లు ఏమిటి?'

'వైశాల్యమండి!'

'వైశాల్యం వట్టి మైళ్లలో ఉంటుందా?'

ఇప్పటికి తెలిసింది శ్రీమన్నారాయణకు క్లాసు అంతా ఎందుకు నవ్వుతుంటున్నారో!

నాలిక కరుచుకొని 'ఇరవై అయిదు చదరపు మైళ్లండి' అన్నాడు.

'పొడుగు ఎంత?'

'ఆరుమైళ్ళ రెండుఫర్లాంగు లండి'

'అయితే ఏం చెయ్యాలి?'

శ్రీమన్నారాయణకు పౌరుషం వచ్చేసింది ఎందు కిట్లా ప్రతిదానికీ ప్రశ్న వేస్తాడని. ఈసారి తప్పు చెప్పకూడ దనుకున్నాడు. క్లాసుకీ, మాస్టారికీ గూడా తన తెలివితేటలు చూపించా లనుకున్నాడు. ఆలోచించాడు.

కాసే పుండి 'వైశాల్యాన్ని చదరపుఫర్లాంగుల లోకి మార్చుకుని పొడుగునుగూడా ఫర్లాంగులలోకి మార్చి ఆవచ్చిన పొడుగుచేత వచ్చిన వైశాల్యాన్ని భాగిస్తే వెడల్పు ఎన్ని ఫర్లాంగులో తేల్తుందండి.'

'ఏరా అంతేనా గౌడా?'

'అవునండీ!'

'అయితే ఇద్దరూ చకచకా చేసి చూపించండి' అని వీళ్లతో చెప్పి, మాస్టారు బోర్డుమీద మరొక లెక్క వేసి మిగతావాళ్లని చెయ్యమన్నారు.

ఆయన క్లాసువంక తిరగడంతోటే శ్రీమన్నారాయణ కూర్చునిఉన్నవాడు అమాంతం గానుంచున్నాడు.

ఈ మాటు మాస్టారికి కోపం వచ్చింది. కాని ఆయన తమాయించుకుని 'ఏరా గౌడా! నువ్వు కూర్చుని లెక్క చేసి చూపించరా' అన్నాడు.

శ్రీమన్నారాయణకు పట్టరాని ఉక్రోషం వచ్చింది. గౌడ తల వంచుకుని నవ్వుతూ లెక్క చేస్తున్నాడు.

శ్రీమన్నారాయణఆలోచన అంతా లెక్కమీద లేదు. ఈ మాస్టార్ని తిరిగి అవమానం చెయ్యటం మెల్లాగా అని అతని బుఱ్ఱ లెక్కలేనన్ని పన్నాగాలు పన్నుతోంది.

క్లాసులో మిగతావాళ్లు చాలామంది రెండోలెక్క చేసేశారు. కొందరికి సందేహాలు వస్తే ఆ సందేహాలు పోగొట్టేందుకు అనువైన ప్రశ్నలు వేసి వాళ్లచేతనే సమాధానాలు చెప్పించారు మాస్టారు. శ్రీమన్నారాయణ బుఱ్ఱలో ఇవేవీ దూరడమే లేదు. గౌడమాత్రం మొదటి లెక్క చేసి మాస్టారిదగ్గరకు వచ్చాడు. ఆ లెక్క చేసిన విధానం చూసి మాస్టారు చాలా సంతోషించారు. 'గౌడా! నీకు లెక్కల్లో ఫస్టుమార్కు వస్తుంది. నువ్వు కొంచెం శ్రద్ధగా చదివితే చాలు!' అని వాణ్ణి ఉబ్బవేసి 'నువ్వు ఇకనుంచీ ఆ అన్నయ్యపక్కన కూర్చో

బోకు. ఇక్కడ కూర్చో' అని మొదటిబెంచీలో చోటు చూపించారు. లెక్క చేసినవాళ్లందరికీ పుస్తకంలో అభ్యాసంలో కొన్ని లెక్కలు గుర్తుపెట్టించి వాటి నన్నిటినీ క్లాసులో చెయ్యమని, ఇంకా చెయ్యని వాళ్లదగ్గరకు బయలుదేరారు. దామోదర్ లెక్కల పుస్తకం తెరిచేఉందికాని అతను బల్లకింద చెయ్యిపెట్టి వేరుసెనక్కాయలు తింటున్నాడు. మాస్టారు కుర్చీ లోంచి లేచారనగానే చేతులు దులుపుకుని ఏమీ ఎరగ నట్లు రెండో లెక్క చెయ్యడం మొదలుపెట్టాడు. అత నిదివరకు రెండుమూడుమాట్లు ఆయనచేతిలో గట్టి దెబ్బలు తిని చదువుమీద శ్రద్ధవహించడం మొదలు పెట్టాడు. మాస్టా రతన్ని చూసీచూడనట్లు ఊరు కున్నారు. మూడోవరసలో నరసింహారావు మాస్టారి రాకను గమనించలేనంత తన్మయత్వంతో 'చోరాగ్రే సర చక్రవర్తి' అని ఒక పుస్తకం గోడకానుకుని చదువు తున్నాడు. మాస్టారు మరో రెండడుగులు వేసేసరికి 'చక్రవర్తి' ఎందుకనో పుస్తకం దింపి ఉలిక్కిపడి నంచు న్నాడు. వాడి కంగారు చూచేటప్పటికి మాస్టారికి జాలి వేసింది.

'పుస్తకం పూర్తిఅయిందా చక్రవర్తిగారూ' అన్నారు మాస్టారు.

ఈమాట విన్న కొందరు కుర్రాళ్ళు ఫక్కున నవ్వారు.

మాస్టారు ఏం చేస్తారో అని నరసింహారావు గడ గడ లాడిపోతున్నాడు.

ఆయ నా పుస్తకం అతని చేతిలోనుంచి తీసుకుని 'ఎక్కడ సంపాదించావోయ్ ఈ పుస్తకం?' అన్నారు.

నరసింహారావు తడబడిపోతూ 'మా పేటలో లైబ్రరీలోదండి' అన్నాడు.

'నువ్వు లైబ్రరీకిగూడా వెళ్తా వన్నమాట! బాగుంది. అయితే మీ లైబ్రరీలో ఇవ్వేనా పుస్త కాలు, ఇంతకన్నా మంచివి ఉంటాయా?'

నరసింహారావుకు కొంచెం ధైర్యం వచ్చింది.

'లేకేమండి? 'బర్మారాణి', 'నేనే నీ మొగుడు', 'రంకుల రాటం' ఇట్లాంటి గొప్పగొప్ప పుస్తకాలు చాలా ఉన్నాయండి.'

'నువ్వివన్నీ చదివావా?'

'చదివా నండి'

అతనికి పుస్తకాలు చదవాలన్న కోరికా, పట్టు దలా ఉన్నందుకు మాస్టారికి సంతోషం వేసింది కాని ఇట్లాంటివే 'గొప్ప గొప్పపుస్తకాలు' అనుకుంటున్నం దుకు ఆయనమనస్సుకు కష్టం వేసింది.

'అయితే ఈ పుస్తకం నా కొకమాటు ఇయ్యి! ప్రస్తుతం నువ్వు ఆలెక్క వేసి చూపించు. క్లాసు అయింతర్వాత నాదగ్గఱకు ఒకమాటు రా! నీకు సర దాగా ఉంటే నా దగ్గర చాలా పుస్తకాలు ఉన్నాయి, ఇస్తాను, చదువుదుగాని' అని నాలుగోవరసలోకి వెళ్ళి పోయారు మాస్టారు.

నరసింహారావు స్తబ్ధుడైపోయాడు. మాస్టారు తన్ను వేళాకోళంచేస్తున్నారో, నిజంగానే అంటు న్నారో గ్రహించలేకపోయాడు. భయంభయంగా లెక్క చెయ్యడం మొదలుపెట్టాడు.

నాలుగోవరసలో శ్రీమన్నారాయణ పుస్త కంలో లెక్క చెయ్యడం మానేసి మాస్టారి బొమ్మ వేస్తు న్నాడు. పోలికలుగూడా కుదిరాయి. కాని ఆయన్ని అవమానం చెయ్యాలన్న కుదృష్టి ఉండడంవల్ల దానికి లేనిపోని అలంకారాలన్నీ పెట్టడంతో అది అయ్య వారుమాత్రం కాలేదు.

మాస్టారు దగ్గరకు వచ్చేటప్పటికి శ్రీమన్నారా యణ అందరిమాదిరి కంగారుపడి పుస్తకం ముయ్యలేదు. మాస్టారు పుస్తకంతీసుకుని చూచారు. ఒక్కసారి క్లాసం తటికీ ఆ బొమ్మ చూపించి 'ఇ దెవరి బొమ్మరా?' అని ప్రశ్న వేశారు. ముందుబెంచీలో కూర్చున్న గోపీ 'శ్రీమన్నారాయణదండి' అన్నాడు. క్లాసు అంతా ఒక్కమాటు గొల్లుమన్నారు. శ్రీమన్నారాయణకు వాణ్ణి చావగొట్టేదామన్నంత కోపంవచ్చింది. కాని పక్కన మాస్టా రున్నారు. ఏం చెయ్యగలడు? మాస్టారు వాడి ముఖం చూచి 'అంత కోపం ఎందుకురా? వాడికి

తోచింది వాడు చెప్పాడు. నువ్వు వేశావు కాబట్టి నీది. పోనీ నువ్వెవరి దంటావో చెప్పు?' అన్నారు. క్లాసుఅంతా మళ్లీ గొల్లుమన్నారు. దీంతో శ్రీమన్నారాయణకు మరింత కోపం వచ్చింది. ఏం చెప్పడానికీ తోచలేదు.

మాస్టారుగూడా ఆలోచిస్తున్నారు, వీణ్ని ఏంచేస్తే బాగుపడతాడా అని. తెలివితేటలు లేకపోయాయా అంటే ఆ లోప మేమీ లేదు. ఇంటిదగ్గఱ చదువుకు తగిన వాతావరణం లేదా అంటే అదీ కాదు. తండ్రి పెద్ద పేరుమోగిన జిల్లామునసబు. తల్లికూడా చదువుకున్నదే! తక్కిన పిల్లలందరూ వీడికంటే పెద్దవాళ్లు బాగా చదువుకుని అభివృద్ధిలో ఉన్నవాళ్లేనట! మరి వీడికీ విపరీతప్రవృత్తి ఏమిటి? వీడికి చదువుమీద ఎందుకు ఆసక్తి లేకపోవాలి? ఈ చదువులో అనేక లోపాలు ఉండవచ్చుగాక! ఉన్న అవకాశాల్లో ఈ చదువే విద్యార్థుల మనస్సును ఆకర్షించేటట్లు తాను చెయ్యగలుగుతూనే ఉన్నాడే! ఎన్ని చేసినా వీడు మాత్రం మారడం లేదు.

ఇంతలో మాస్టారు ఆలోచన ఆపి 'ఏమోయ్ శ్రీమన్నారాయణా! ఏ మంటావ్?' అన్నారు.

శ్రీమన్నారాయణ ఉలిక్కిపడ్డట్టయి చటుక్కున పుస్తకం మూసేశాడు. అటూ ఇటూ కూర్చున్న కుఱ్ఱాళ్ళు పొంగివస్తున్న నవ్వు ఆపుకోలేకా, మాస్టారేమంటారో అన్న భయంతో బయటికి నవ్వలేకా, ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. మాస్టారు వాళ్ళని గమనించారు గాని, అంతలో ఏ మాలోచన తోచిందో ఏమో, శ్రీమన్నారాయణను బోర్డుదగ్గరకుతీసుకుపోయి రంగు సుద్దముక్కలు ఇచ్చి 'నువ్వు ప్రస్తుతం లెక్కలు చెయ్యవద్దుగాని బోర్డుమీద నీ ఇష్టంవచ్చిన చక్కని బొమ్మ గియ్యి. ఏం?' అన్నారు. శ్రీమన్నారాయణ పుస్తకంలో ఏం చేశాడో మాస్టారికీ, అతనికీ, అతని పక్కనున్న విద్యార్థులకూ తప్ప ఎవ్వరికీ తెలియదు. మాస్టా రిలా అనేటప్పటికి ఆ పక్కనున్న విద్యార్థులు 'ఇదెక్కడి మాస్టారురా' అని ఆశ్చర్యపడిపోయారు. మరే మాస్టరయినా ఆ పూట వాడు చేసిన పనికి పట్టరాని కోపం వచ్చి చావగొట్టేవాడు. ఈయనకూ కోపం వస్తుంది. ఈయనా అప్పుడప్పుడు విద్యార్థులను కొడ్తాడు. ఔషధప్రాయంగా ఉపయోగించే ఆ తాడనోపాయంతో ఆ విద్యార్థి సక్రమగతిలో పడతా డన్న అభిప్రాయం కలిగితేనే ఆపని జరుగుతుంది.

శ్రీమన్నారాయణ బొమ్మ గీస్తూనేఉన్నాడు. తక్కిన విద్యార్థులు లెక్కలు చేసుకుంటున్నారు.

ఇంతలో గంట కొట్టారు. మాస్టారు లేచి క్లాసు దాటి గుమ్మంఅవతల అడుగుబెడుతూ 'శ్రీమన్నారాయణా! బడి విడిచిపెట్టాక నాదగ్గరకు ఒక మాటురా' అని చెప్పి వెళ్లిపోయారు.

శ్రీమన్నారాయణ తదేకదీక్షతో తాను పుస్తకంలో గీసిన బొమ్మే మరింత అందంగా బోర్డుమీద వేశాడు. ఇందాకా మాస్టారికి సమాధానం చెప్పకుండా పుస్తకంలో ఏంపని చేశాడో ఆపనే అందరికీ తెలిసేటందుకు బోర్డుమీద స్పష్టంగా ప్రకటించాడు.

ఇం కెవరు పొరపాటుపడగలరు?

గుండ్రని అక్షరాలతో ఆ బొమ్మక్రింద 'లెక్కల టీచరు' అని చెక్కాడు.

---

'లెక్కలటీచరు' గారు ఆ పూటంతా శ్రీమన్నారాయణనుగురించే ఆలోచించారు, శ్రీమన్నారాయణకు చదువంటే ఉన్న ఈ అశ్రద్ధకు కారణ మేమిటా అని. ఒక్క లెక్కలలోనే గాదు, ఎందులోనూ అతనికి తెలియకపోవడం లేదు. కాని దేన్నీ అతడు చదవనేచదవడు. చదువు కావాలన్న ఆస్థ లేకపోవడమేకాక ఎందుకన్న నిర్లక్ష్యంగూడా ఉన్నది. ఈ నిర్లక్ష్యం పోగొట్టడానికి ఏం చెయ్యాలి? ఇదీ ఆయనసమస్య.

ఆయన సుమారు ఆరేళ్లబట్టీ ఉపాధ్యాయ వృత్తిలో ఉండి వివిధమనఃప్రవృత్తుల్ని ప్రత్యక్షానుభవంతో పరిశీలించాడు. తాను చదువుకున్న మనస్తత్వ శాస్త్రాన్ని వృథాపోనియ్యకుండా ఆ విజ్ఞానం అభివృద్ధి పొందించుకోవడంతోపాటు ఆచరణలోగూడా పెట్టి అనేక క్లిష్టమనస్తత్వాల్నే సరిదిద్దగలిగాడు. అంచేత ఆయనంటే భయంకన్నా గౌరవమే ఎక్కువ పాత

విద్యార్థులకు. అల్లరికుఱ్ఱవాళ్ళకు ఆయనంటే హడలు. చదువుకునే కుఱ్ఱవాళ్లకు ఆయన దేవుడు. ఎంత అల్లరి వాడైనా ఆయనదగ్గర ఒక ఏడాది ఉండేటప్పటికి నిజమైన విద్యార్థి అయితీరుతాడు. ఇంత అనుభవమూ కూడా శ్రీమన్నారాయణవిషయంలో ఈ సంవత్సరం ఈ తరగతిలో ఎందుకూ పనికిరాలేదు.

అసలు మొత్తానికి ఈ సంవత్సరం ఈ తరగతిలో చాలామంది విద్యార్థులు ఆయనకు మొదట్లో పెద్ద సమస్యలుగానే కన్పించారు. వాళ్లందరూ శ్రీమన్నారాయణతోపాటు బయటస్కూళ్ళలోనుంచి వచ్చి ఆయేడే చేరారు. వాళ్ళందర్నీ వివిధవిధాలుగా తా నెట్లాగో లొంగదీసి చదువంటే శ్రద్ధపుట్టించి వాళ్ళచేత అన్ని విషయాల్లోనూ సరియైన కృషి చేయించగలుగుతున్నాడు. కాని ఈ శ్రీమన్నారాయణే ఇంతవఱకూ లొంగలేదు. ఏ యత్నం చేస్తే లొంగుతాడో బోధపడడమూ లేదు.

ఆయన సాధారణంగా ఎవ్వరినీ కొట్టడు. ఒక విషయం తెలియలేదని విద్యార్థికి తెలిసేటట్లు చెప్పడానికి ఎంత కష్టమైనా ప్రయత్నం చేస్తాడేకాని విసుక్కొని చిరాకుపడి కోపగించి ఇంతవరకూ ఎన్నడూ కొట్టలేదు. ఆక్లాసులో దామోదర్ ఒకమాటు దెబ్బ తిన్నాడు. అంతే! దాంతో వాడు లెక్కల్లో క్లాసంతటికీ మూడవవాడుగా ఉంటున్నాడు. ఆయనే క్లాసు టీచరు కాబట్టి తక్కిన విషయాలు గూడా కనుక్కుంటూ ఉంటాడు. తక్కిన మాస్టర్లందరూ అప్పటినుంచీ దామోదర్ చూపుతున్న శ్రద్ధకు ఆశ్చర్యపడిపోయారు. మొదట్లో ఎందుకూ పనికిరాడనుకొన్న ఈ దామోదర్ యిట్లా ఎందుకు మారిపోయాడో ఇప్పటి ఎవ్వరికీ తెలియదు, వాడికీ లెక్కలటీచరుకూ తప్ప. రాజగోపాల్ దెబ్బలు తినలేదు గాని ఒకసారి చీవాట్లు తిన్నాడు. ఆ చీవాట్లు అతని మనస్సును ఎంత కలత పెట్టాయో, ఆపూట అతనికి ఎంతబాధ కలిగించాయో అతనికే తెలియాలి. కాని ఆ నాటినుంచీ ఈ నాటి వరకూ అతడు చదువు విషయంలో మాత్రం అశ్రద్ధ చెయ్యనే చెయ్యడంలేదు. కాని అల్లరిలో అమోఘం. ఒక్క లెక్కలటీచరు గారి క్లాసులో మాత్రం చెయ్యడు. ఆయనే అప్పుడెప్పుడు 'ఏమోయ్! రాజగోపాల్! నువ్వు గూడా చచ్చుబడి పోతే క్లాసులో ప్రాణమే లేదోయ్! చదువుకు చదువూ ఉండాలి, అల్లరికి అల్లరీ ఉండాలి. పెద్దవాళ్లు అయ్యాక అల్లరి ఎవ్వరూ చెయ్యరు. ఇప్పుడన్నా చెయ్యకపోతే ఎట్లా చెప్పు?' అంటూవుంటారు. ఏమన్నా ఆయనక్లాసులో మాత్రం అత నెన్నడూ చదువు తప్ప మరో విషయం ఎత్తుకోడు. గోత దెబ్బలూ తిన్నాడు, చీవాట్లూ తిన్నాడు. దాని కనుగుణంగా మారనూ మారాడు. ఇంచుమించు క్రమగతిలోనే ఉన్నాడు. కాని అప్పుడప్పుడు మళ్లీ వెనకడుగు వేస్తూ ఉంటాడు.

ఇట్లాగే ఇంచుమించు తక్కినవాళ్ళందరూ కూడా ఆయన అనుకున్న దారిలో పడ్డారు. ఇక ఎటు వచ్చీ ఆయనదృష్టి పడీకూడా ఏ మాత్రమూ మార్పు పొందనివాడు శ్రీమన్నారాయణే! అయితే అత నింతవఱకూ ఆయనచేతిలో దెబ్బలు మాత్రం తినలేదు. ఆ ఉపాయం కూడా ప్రయోగిస్తే ఏమైనా మారుతాడో ఏమో!

ఈరోజుల్లో విద్యార్థు లనబడేవాళ్లల్లో చాలా మందికి వాళ్లు ఎందుకు బడికి వస్తున్నారో వాళ్ళకే తెలియదు. పంపించే తలిదండ్రుల్లో ముప్పాతిక మందికి తమ పిల్లలు పెద్దవాళ్లయి ఉద్యోగాలు సంపాదిస్తారన్న ఆశ తప్ప మఱొకటిలేదు. మిగతా పాతికమందీ మిక్కిలి సంపన్నగృహస్థులై తమతమ పిల్లల్ని అదుపాజ్ఞల్లో పెట్టుకోలేక బడికైనా పోతే వీళ్ల ఇబ్బంది కొంత తగ్గుతుందని పంపుతూ వుంటారు. చదువు కేవలం విజ్ఞానం కోసం, మానవునకు దాన్ని ఆర్జించడం అవశ్యకర్తవ్యం అన్న అభిప్రాయంతో తల్లిదండ్రులూ విద్యార్థులూ ఏకోన్ముఖులై బడిని ఉపయోగించుకునే వారు ఎక్కడో నూటికి ఒకటే అరా ఉంటారేమో! ఒకవేళ అట్లాంటివాళ్లు కొంత ఎక్కువే ఉన్నా వాళ్లకా విషయంలో తోడ్పడే పాఠశాలలు అసలే లేవు. ఉపాధ్యాయులకు సరియైన అవకాశాలుయివ్వక పోవడం వల్లనేం, ఇచ్చినా ఉపయోగించుకోగల తాహతు

లేనివాళ్లు ఉపాధ్యాయ వర్గంలో చెలామణి అవుతూ ఉండడం వల్ల నేమి ఈనాడు భారత విద్యార్థి లోకానికి జరుగుతూఉన్న అపకారం ఇంతా అంతా కాదు. అసలే మన దేశం బానిసదేశం. అందులో నిరుపేద స్థితి. ఈస్థితిలో చదువుకోడానికి వచ్చే కొద్దిమందికీ మనం అన్యాయం చేస్తే దీని ఫలితం తరతరాలా మన దేశంలో భావిప్రజలు అనుభవించవలసి వస్తుంది. తన జీవితంలో తనకు తెలిసినంతవరకు తా నట్లాంటి అన్యాయానికి పాల్పడగూడదు.

శ్రీమన్నారాయణ ఎందుకు చదువుకోవడం లేదు? అతడు అతని తల్లిదండ్రులకు కడసారి బిడ్డ. అందుచేత గారాబం ఎక్కువ. చదువుకున్న కుటుంబంలో పుట్టాడు గదా, ఇంటికి దగ్గర చదువుకు తగిన వాతావరణం ఉన్నదిగదా, చెప్పితే, బోధపరిస్తే దారికి వస్తాడేమో అన్న ఉద్దేశంతో తా నిదివరకు అనేక పర్యాయాలు చెప్పడం అయింది. ప్రత్యేకంగా అతన్ని దగ్గర కూర్చోబెట్టుకొని కథలూ కబుర్లూ చెప్పి, 'ఇల్లాంటి వనేక విషయాలు నువ్వు చదువుకోవచ్చు, వాటిని చదువుకోడానికి భాషా పరిజ్ఞానం కావాలి. అంచేత తెలుగూ, ఇంగ్లీషూ శ్రద్ధగా చదువు' అని చిలకకి చెప్పినట్లు చెప్పాడు. అతనికి అందుబాటులో ఉండే చిన్నచిన్న పుస్తకాలు అనేకం లైబ్రరీలో నుంచి తీసి ఇచ్చాడు. లెక్కలు, సైన్సు ఇట్లాంటివి మూలసూత్రాలైనా తెలియకపోతే భావిజీవితంలో కలిగే కష్టనష్టాలన్నీ వివరించి చెప్పాడు. అన్నయ్యల ఆదర్శం చూపించి నువ్వు వాళ్ళకంటే ఎందుకు తక్కువై పోవాలి అని పౌరుషం కలిగించాడు. అయినా లాభం లేకపోయింది. ఇప్పుడేం చెయ్యాలి? ఇతని తెలివితేటలు చదువుగాని, మరొక వ్యాసంగం గాని ఏదైనా నిర్మాణాత్మకమైన కార్యక్రమంలో పడితే దేశానికి తప్పక ఉపయోగిస్తాయి. ఈ ఉత్సాహాన్నీ, ఈ యువకరక్తాన్నీ పసితనంలో ఆనకట్టవేసి క్రమగతిలో నడిపించకపోతే ఇదంతా ఏ మోసంలోనో, దొంగతనంలోనో పరిణతి పొంది లోకాపకారకం అయి పోతుంది. ఇతన్ని లొంగదియ్యడానికి ఒకే ఒక మార్గం ఉన్నది. ఇంకా ఉపేక్షవహించి ప్రయోజనం లేదు. అతని కేవిధంగానైనా చదువుమీద శ్రద్ధ కలిగించడమే ముఖ్యలక్ష్యమయితే దాన్ని సాధించడానికి దెబ్బలైనా ఇచ్చి తీరవలసిందే!

ఇంతలో ఒంటిగంట బెల్లు కొట్టివేశారు.

పిల్లలందరూ ఎక్కడివా ళ్ళక్కడికి వెళ్ళిపోతున్నారు. లెక్కల మాస్టారు ఉపాధ్యాయుల గదిలో శ్రీమన్నారాయణకోసం పావుగంటపైగా ఎదురుచూచి ఇవే ఆలోచనలతో ఇంటికి వెళ్లిపోయారు.

శ్రీమన్నారాయణ ఆమధ్యాహ్నం బడికి వెళ్లాడో లేదో కాని లెక్కలమాస్టారు అతన్ని కలుసుకోవడం మాత్రం పడలేదు.

మర్నాడు లెక్కల క్లాసులోకి శ్రీమన్నారాయణ వచ్చాడు. అతన్ని ప్రత్యేకం పిలిచి 'వాళ్లందరూ ఒకటి. నువ్వొక్కడివీ ఒకటి! నీ కివ్వాళ్టినుంచీ ప్రత్యేకంగా లెక్కలు చెప్తాను. పుస్తకం తెచ్చుకో!' అన్నారు. శ్రీమన్నారాయణ వెళ్లి పుస్తకం తెచ్చుకున్నాడు. మాస్టారు ఒక మాదిరిలెక్క చెప్పి అట్లాంటి లెక్కలు అరడజనుచూపించి వాటిని చెయ్యమన్నారు. శ్రీమన్నారాయణ చేస్తున్నట్లు కూర్చుండగా లెక్కల మాస్టారు తక్కిన క్లాసంతకూ క్రొత్తపాఠం చెప్పారు.

పిరియడు ఇంకా పదినిమిషాలు ఉందనగా శ్రీమన్నారాయణదగ్గరకు వచ్చారు. పుస్తకం చూశారు. రెండు లెక్కలు రైటు చేశాడు. ఇకామీద పుస్తకంలో లెక్కలు చెయ్యలేదు. నిన్నటిమాదిరి బొమ్మలూ వెయ్యలేదు. క్లాసులో తన స్నేహితులకూ, బళ్లో తనకు అత్యంతం ఇష్టులైన మాష్టర్లకూ తాను పెట్టుకున్న ముద్దుపేర్లన్నీ ఒక్కొక్కటీ అతిసుందరంగా అలంకరించి వ్రాశాడు. ఆమీద పెన్సిలూ, పెన్నూ రెండూ జోడించి పిచ్చిగీతలు గీస్తున్నాడు. ఆ స్థితిలో పుస్తకం మాస్టారిచేతిలోకి వచ్చింది.

మాస్టారు తాపీగా శ్రీమన్నారాయణముఖంవంక చూచాడు. అతను మెల్లగా భయంనటిస్తూ లేచి నిల్చున్నాడు.

'ఏమిటి దంతా ?'

సమాధానం లేదు.

'నిన్ను చెయ్యమన్న దేమిటి ?'

'లెక్కలు సార్'

'ఎందుకు మానేశావ్ ?'

సమాధానం లేదు. మాస్టారు కోపాన్ని ప్రకటించలేదు. కాని చెంపమీద ఒక్క దెబ్బ వేశారు. పాపం! గట్టిగానే తగిలిందేమో - కళ్లవెంబడి నీళ్లు పెట్టేశాడు. కాని లోపల్లోపల అహంకారంమాత్రం బాగా ప్రజ్వలించింది.

'నన్నెందుకు కొట్టాలండీ మీరు ?'

'ఎందుకు కొట్టానో నీకు తెలియదూ' అంటూ మాస్టారు మళ్లీ ఇంకోటి రెండో చెంపమీద వేశారు.

దీంతో శ్రీమన్నారాయణ తప్పకుండా అణిగిపోతా డనుకున్నారు మాస్టారు.

కాని, శ్రీమన్నారాయణ ఆఏడ్పు గొంతుతోటే 'మీకూ తెలుస్తుందిలెండి' అంటూ సరాసరి వెళ్లిపోయాడు బయటికి.

క్లాసులో పిల్లలందరూ ఏమౌతుందో తెలియక రోమాంచంతో నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

లెక్కలమాస్టారుమాత్రం ఏమాత్రమూ కళవళపడకుండా మర్నాటికి విద్యార్థులు చేసుకురావలసిన అభ్యాసం చూపించి, అంతలో బెల్లు కొట్టడంవల్ల వెళ్ళిపోయారు.

లెక్కలమాస్టారి చేతిలో దెబ్బతిన్నవాడు ప్రతివాడూ అణిగిపోయినవాడేగాని ఇల్లా ఎదిరించిన వాడెవడూ ఇంతవరకూ ఆనూక్కల్లో లేడు. శ్రీమన్నారాయణ ఈపని చెయ్యడంతో క్లాసులో చాలామందికి— అందులో ఇదివరకు ఆయనచేత దెబ్బలుతిన్న కొత్త కుఱ్ఱవాళ్లకు వా డొక మహావీరుడిలాగ కనిపించాడు.

తర్వాత పిరియడు తెలుగు. ఆయన ఆనాడు సెలవు. అంచేత ఇంకా వేరేమాస్టరు ఎవరూ రాలేదు. మానిటరే క్లాసు అల్లరిచెయ్యకుండా చూస్తున్నాడు. పావుగంటసేపైంది. లెక్కల మాస్టారు హెడ్మాష్టరు గదిలోకి వెళ్లి వచ్చారన్నవార్త అప్పుడే ఎట్లా అందిందో అందింది. కుఱ్ఱవాళ్ళంతా లోపల్లోపల గుసగుసలాడుతున్నారు. ఇంతలో శ్రీమన్నారాయణ రానే వచ్చాడు నవ్వుకుంటూ. వచ్చీరావడంతోటే 'ఒరేయ్ గాడా! నువ్వు పోయి నువ్వు మాదగ్గర నుంచోరా, ఎవరైనా వస్తుంటే లోపలికి వచ్చెయ్' అన్నాడు. శ్రీమన్నారాయణ అంటే ఎవ్వరికీ గౌరవం లేదుకాని ఎంత పెద్ద కుఱ్ఱాడికైనా భయంమాత్రం ఉన్నది. గాడ మారు మాట్లాడకుండా వెళ్లి నిలబడ్డాడు. శ్రీమన్నారాయణ క్లాసుకంతకూ హితబోధ చెయ్యడం మొదలుపెట్టాడు.

'మొట్టికాయ' ఇవ్వాళ తన్ను కొట్టాడు. రేపు ఇంకొకరిని కొట్టవచ్చు. ఇదివరకు ఎంతమందినో కొట్టాడు. ఇట్లా అందరినీ కొట్టుకూ ఉంటే విద్యార్థులు చేతకాని దద్దమ్మల్లాగా పడిఉండాల్సిందేనా? అసలు మాస్టరుకు విద్యార్థిని కొట్టేందుకు హక్కు లేదు. మాస్టర్లకి ఇచ్చే జీతాలు విద్యార్థులు కట్టే సొమ్మే. అంటే విద్యార్థికింద మాస్టరు జీతగాడన్నమాట. జీతగాడు యజమానిని కొట్టడమంటే ఎంత అవమానమో తెలుసుకోలేకపోతున్నారు విద్యార్థులు. విద్యార్థులందరూ ఏకమైనట్లయితే ఈ 'మొట్టికాయ'ని అవమానం చెయ్యడమే గాక వాడికి ఉద్యోగంకూడా లేకుండా చేసిపారెయ్యవచ్చు. వాళ్ళంతట వాళ్లేమీ చెయ్యకపోయినా సరే తాను చేసేపనికి అడ్డురాకుండాఉంటే చాలు వీడికి బుద్ధిచెప్పేపని తనది.

ఇల్లా ఉపన్యాసం సాగిపోతోంది. కొందరికి శ్రీమన్నారాయణధోరణి చాలా అసహ్యంవేసింది. వాళ్ళందరికీ లెక్కలటీచరు అంటే అపరిమితమైన గౌరవం. ఆయన తక్కిన మాస్టర్లవలె పాఠం తెలియకపోతే కొట్టడు. ఎన్నిసార్లు అడిగినా విసుక్కోడు. అడగాలి, తెలుసుకోవాలి అన్న శ్రద్ధ ఉంటేచాలు నెత్తి కెక్కించుకుంటాడు. పాఠం చెప్పడంకూడా చాలా సర్దాగా చెప్తాడు. చాలామంది చెప్తూఉంటే విసుగుపుట్టే లెక్కలు ఈయన చెప్తూఉంటే ఎంతో హుషారుగా ఉంటుంది. రోజ ఉంటే బాగుండునురా అని కూడా అనిపిస్తుంది. అట్లాంటి టీచరును పట్టుకుని ఈ డిట్లా కూస్తూఉంటే వాళ్లకు దుర్భరమైపోతోంది. కాని అట్లాంటివాళ్లు

క్లాసులో నలభైమందికీ పంద్రెండుమందికూడా లేరు. ఒక్క అరడజనుమందికి శ్రీమన్నారాయణతో సంపూర్ణాంగీకారం కుదిరిపోయింది. ఆ అరడజనుమందీ వీలు చిక్కితే లెక్కలటీచరును పట్టుకుని కొట్టాలన్న నిశ్చయానికిగూడా వచ్చారు. తక్కినవాళ్లల్లో చాలామందికి ఈయనబాధ అయితే తప్పించుకోవాలని ఉన్నదికాని వీడి ప్రసంగం మరెవరైనా వింటే క్లాసంతటినీ ఏం చేస్తారో అన్న భయంతో దిక్కులు చూస్తున్నారు.

ఇంతలో గొడ చటుక్కున లోపలికి వచ్చేశాడు.

శ్రీమన్నారాయణ తన చోట్లో తాను ఏమీ ఎరగనట్లు కూర్చున్నాడు. రెండునిమిషాలసేపు క్లాసు అంతా అతినిశ్శబ్దంగా ఉంది. శ్రీమన్నారాయణ గుమ్మంవైపు చూచి 'నాదగ్గర వేళాకోళా లాడతావా?' అని గొడను వీపుమీద ఒక్క చఱుపు చరిచాడు. ఆ దెబ్బ మోత ఇంకా ఆగలేదు, కాని హిస్టరీమాస్టారు లోపలికివచ్చేశారు. శ్రీమన్నారాయణ గొడను కొట్టింది ఆయన చూచాడుకూడా! కాని ఆయన ఆవిషయంలో ఏమీ జోక్యం కలిగించుకోలేదు.

## ౪

ఆరోజల్లా లెక్కలటీచరు మనస్సులో చాలా బాధపడ్డాడు. శ్రీమన్నారాయణను బాగుచెయ్యాలన్న ఉద్దేశంతో అతన్ని కొట్టక ముందు ఎంత బాధపడ్డాడో దానికి రెట్టింపు అనుభవించాడు, అతని విషయంలో ఏం చెయ్యాలో తోచక. హెడ్మాష్టరు చెప్పినదానికి ఆయనేమీ లెక్క చెయ్యనేలేదు. నిబంధనలప్రకారం విద్యార్థిని జరిమానా వేసిగాని, క్లాసులోనుంచి బైటకు పంపించిగాని మామూలుమాష్టరు శిక్షించవచ్చు. దెబ్బలు కొట్టి శిక్షించడానికి ఒక్క హెడ్మాష్టరుకే అధికారం ఉంది. వాణ్నీ వీణ్నీ కొట్టినా పర్వాలేదుగాని జిల్లామునసబు కొడుకును కొట్టితే! ఒకవేళ ఆయన ఏమైనా చర్య తీసుకునే సందర్భంలో హెడ్మాష్టరు తనకేమీ సహాయకారి కాలేదు. ఇదీ ఆరేళ్ల అనుభవం ఉండి విద్యార్థిని కొట్టడం తప్పుగా భావించి తప్పనిసరైయితేనే దాన్ని ప్రయోగిస్తాడన్న విశ్వాసం విద్యార్థులకే కలిగించిన ఉపాధ్యాయుణ్ని తన గదిలోకి పిలిపించి హెడ్మాష్టరు చెప్పింది.

లెక్కలటీచరు మనస్సులో పడ్డ బాధ అంతా శ్రీమన్నారాయణను ఎట్లా బాగుచెయ్యడమా అనేగాని దీన్నిగురించి కానేకాదు. వాణ్ని మళ్ళీ కలుసుకుందామనుకున్నాడుగాని ఆయనకు అతను కనబడనేలేదు. హెడ్మాష్టరు ఆయనతో చెప్పిన విషయం ఎట్లా ఊహించాడో ఏమో వాడుమాత్రం పట్టపగ్గాలు లేకుండా విద్యార్థులలో స్కూల్లో ఉన్నంతసేపూ రెచ్చిపోయాడు. అవును, జిల్లామునసబు కొడుకాయె! ఏంచేసినా చెయ్యగలడు. తక్కినమాస్టర్లకూ అదేభయం. వాడేంచేసినా ఏమీ అనరు. దారినిబోయే తద్దినాన్ని ఆహ్వానించుకునే ఈయనకుతప్ప వాడి విషయం ఇతర్లకేం పట్టింది?

తండ్రి ఊళ్ళో లేకపోవడంవల్ల శ్రీ న్నారాయణ జరిగిన విషయానికి అనేకఅబద్ధాలు జోడించి తల్లితో చెప్పాడు. వినయవతియైన ఆ తల్లినుండి శ్రీమన్నారాయణ దౌర్మార్గ్యానికి ఆసరా ఏమీ లభించక పోగా చీవాట్లుగూడా తగిలాయి. అయినా అతని దౌష్ట్యంమాత్రం చప్పబడలేదు.

మర్నాడు ఉదయం మొదటి పిరియడే లెక్కలు. శ్రీమన్నారాయణ చాలా హుషారుగా బడికి వెళ్లాడు. క్లాసులోకి వెళ్లడంతోటే తాను చెయ్యదలచుకున్న పని పిల్లల కందరికీ చెప్పాడు. కొందఱు అట్లా చెయ్యడం మంచిది కాదన్నారు. మాస్టారికి కోపం వచ్చి అందర్నీ పట్టుకు కొట్టుతారేమో అన్నారు కొందరు. శ్రీమన్నారాయణతో పూర్తిగా ఏకీభవించిన పెద్ద కుర్రాళ్లు 'అందర్నీ కొట్టడం మాటలా ఏమిటోయ్! నిన్న ఒకణ్ని కొట్టినందుకే చీవాట్లు తిన్నాడు. ఇవ్వాళ ఏమీ చెయ్యలేడు. మనస్సులో కుళ్లికుళ్లి చస్తాడు. వాణ్ణి అట్లా ఏడిపించాల్సిందే! లేకుంటే వాడి కంత పొగరా! ఈ దెబ్బతో మళ్ళీ ఎవణ్నీ చెయ్యిచేసుకోడు. చేసుకున్నాడా, ఇంకే ముంది, బలే జల్సా! స్కూలు స్కూలు అంతా మనరూము దగ్గరకే వస్తుంది. శ్రీమన్నారాయణా! నీ పని నువ్వు చెయ్యి! వీళ్ళే

మన్నా పాకార్యారంటే తగిన శాస్తి చేసే బాధ్యత మాది' అని అతనికి హుషారూ ఇచ్చారు, ధైర్యమూ చెప్పారు. ఇక శ్రీమన్నారాయణకు పట్టలేనంత సంతోషం కలిగింది. తక్కిన కుర్రాళ్లు కుక్కిన పేలల్లే నోరు కదప లేదు.

రెండో బెల్లు పూర్తికాక ముందే శ్రీమన్నారాయణ తాను చెయ్యదలచుకొన్న పని చేసేశాడు. వాళ్ళ క్లాసు గది ఒకమూల ఉండడంవల్ల వాడానాడు చేసిన పని తక్కిన మాస్టర్ల కెవరికీ చూసే అవకాశం కలగక పోయింది.

మూడో బెల్లు కూడా కొట్టారు. లెక్కల మాస్టారు మామూలుగా సుద్దముక్కలూ, డస్టరూ పుచ్చుకొని పాఠంచెప్పే మనస్థితితో సరాసరి క్లాసులోకి వచ్చి కుర్చీలో కూర్చుని హాజరుపట్టీ వెయ్యడానికి పూనుకున్నారు. పేర్లు పిలుస్తుంటే అక్కడక్కడ కొంచెం గుసగుసలూ, నవ్వులూ వినవచ్చాయి. మాస్టారు తల ఎత్తేటప్పటికి అంతా నిశ్శబ్దమయిపోయింది. హాజరు పట్టీ వెయ్యడ మయ్యాక శ్రీమన్నారాయణను పుస్తకం తెమ్మన్నారు మాస్టారు. జంకూ గొంకూ లేకుండా శ్రీమన్నారాయణ పుస్తకం తెచ్చాడు.

'నిన్న చెయ్యాలి లెక్కలు పూర్తి చేశావా?'

'లేదండి'

'ఇందుకే నిన్న కొట్టింది, ఇవ్వాళ మళ్ళీ కొట్టుతున్నదీని' అంటూ మాస్టారు గట్టి లెంపకాయ ఒకటి అంటించారు.

శ్రీమన్నారాయణకు కళ్ళల్లో నీళ్ళే కాదు, కాలికింద నేలకూడా గిరగిరా తిరిగిపోయింది. హెడ్మాష్టరు చెప్పినా ఈయన ఇట్లా ఎల్లా కొట్టగలుగుతున్నాడో అతని కేమీ బోధపడలేదు. వెంటనే అతనికి హెడ్మాష్టరు చెప్పారని తాను విన్నది అబద్ధమని తోచింది. ఆయనగూడా ఈయనతో కలిస్తే ఇక తన ఆటలేమీ సాగవనిపించింది. ఈ సందర్భంలో అమ్మ పెట్టిన చీవాట్లు జ్ఞాపకం వచ్చాయి. దాంతో శ్రీమన్నారాయణ మనిషి సగానికి సగం అయిపోయాడు. అనుకున్న దొకటి, అయిం దింకొకటి! ఇంకేం చెయ్యగలడు?

'ఇప్పుడైనా చేస్తావా, మరొకటి కావాలా?'

కళ్ళనీళ్లు తుడుచుకుంటూ 'చేస్తానండి' అని ఎట్లా అనగలిగినాడో ఏమోకాని అనడం మాత్రం అన్నాడు. మాస్టారిస్తున్న పుస్తకాన్ని తడబడుతున్న చేతుల్తో అందుకొని తన చోట్లో లెక్కలు చెయ్యడానికి కూర్చున్నాడు. కాని అతని గుండెలు ఇకముందేం జరుగుతుందో అని గుభేలు గుభేలు మంటున్నాయి.

అతనితో ఏకీభవించిన అరడజనుమంది కుర్రాళ్లూ అంతకుముందే అణగారిపోయి పుస్తకాలు తెరుచుకొని సిద్ధంగా కూర్చున్నారు. నాయకుడు లొంగిపోయిన సెన్సేషన్ అయింది వాళ్లకు!

మాస్టారు కొత్తపాఠం చెప్పడానికి బోర్డువంకకు తిరిగారు.

చూడగా ఆయనకు అమితమైన ఆశ్చర్యమూ, బాధా ఒక్కమాటుగా కలిగాయి. ఆయన మళ్ళీ క్లాసు వైపు తిరిగి, చేతిలో డస్టరు బల్లమీద పడవేసి కుర్చీలో కూర్చుండి పోయాడు. ఒక్కసారి నుదుటిమీద చెయ్యి వేసుకొని ఒక్క సెకండుకాబోలు ఏదో ఆలోచించాడు. కాని ఆయన తన మనస్సులో కలిగిన ఏభావాన్నీ ముఖంమీద ప్రకటించలేదు. చిరునవ్వు నవ్వుతూ 'ఇవ్వాళ మీకు పాఠం చెప్పను! ఈ పిరియడు కులాసాగా కాలక్షేపం చేద్దాము. అయితే దానివల్ల కూడా మనకు కొంత ఉపయోగం ఉండాలి. అందుచేత ఏదో ఒక విషయాన్ని గురించి మనలో మనం చర్చించుకుందాము. ఈ సభకు నేను అధ్యక్షుణ్నిగా ఉండను. నేను కూడా ఒక సభ్యుణ్నిగా మీతోపాటు కూర్చుంటాను. మీరందరూ కలిసి ఒక విద్యార్థి పేరు చెప్పండి. అతన్ని అధ్యక్షుణ్నిగా ఎన్నుకుందాము. విషయం మాత్రం నేను చెప్తాను. దాన్నిగురించి అందరూ ఎవరికి తోచింది వారు మీకు మాస్టరయిన నేను యిక్కడ ఉన్నానని గానీ, ఇది బడి అనిగానీ సంకోచించకుండా మీ మనస్సులో ఉన్నదున్నట్టు చెప్పేసెయ్యాలి! ఏమంటారు? ముందు అధ్యక్షుని పేరు చెప్పండి!' అన్నారు.

ఈమాటలు చాలామంది విద్యార్థుల చెవుల్లో పడ్డాయన్న మాటేగాని వాళ్ళకు నిజంగా అవి వినబడనేలేదు. - ఈయన ప్రవర్తనకు వాళ్లంత నిశ్చే

తన్మయులైపోయి తామున్న దెక్కడో కూడా తెలియని స్థితిలో పడిపోయారు. చిన్న ఒకరిద్దరు పెద్ద కుర్రాళ్లూ కూడా 'ఇది ఇంకెందుకో పెద్ద ఎత్తు వేస్తున్నాడురా బాబోయ్' అని అనుకొని నోరు మెదపకుండా తలలు వంచుకు కూర్చున్నారు. ఇదంతా తనమీదే విరుచుకు పడుతుంది, తప్పదు అని శ్రీమన్నారాయణ అణువణువునా గజగజలాడిపోతున్నాడు.

ఎవరి పేరో ఒకరి పేరు చెప్పమని నువ్వు నువ్వని ప్రతివాణ్నీ అడుగుతూ అయిదు నిమిషాలు గడిపారు మాస్టారు. కాని ఎవ్వరూ చెప్పలేదు.

'అయితే అదికూడా నేనే చెప్తాను. ఈ సభకు శ్రీమన్నారాయణ అధ్యక్షత వహిస్తే చాలా బాగుంటుంది. మీ అందరికీ అంగీకారమేనా?'

దీంతో క్లాసులో ప్రతి వాడికీ మరీ హడలెత్తింది. ఆయన మనస్సులోతు గ్రహించే శక్తి ఆ పిల్లల కేం ఉంటుంది పాపం!

'నేను నా తరఫునా, ఫోర్తు ఫారం విద్యార్థు లందరి తరఫునా, శ్రీ శ్రీమన్నారాయణ గారిని అధ్యక్షత వహించవలసిందిగా ప్రార్థిస్తున్నాను'.

శ్రీమన్నారాయణ కూర్చునే తల వంచేసుకున్నాడు. 'మీరు మరొకవిధంగా చెయ్యడానికి వీలు లేదు! మా ప్రార్థనను అంగీకరించక తప్పదు' అంటూ మాస్టరతన్ని రెండుచేతుల్తోనూ లేవదీసి తీసుకవచ్చి కుర్చీలో కూర్చోబెట్టారు. శ్రీమన్నారాయణకు తరుము కొని తరుముకొని దుఃఖమూ వస్తోంది, ఒకపక్క కొద్దిగా సంతోషం లాంటి దేదోకూడా కలుగుతోంది. కుర్చీలో కూర్చున్నాడన్న మాటేగాని ఇంతకూ తలయెత్త లేక పోతున్నాడు.

'ఈనాడు మనకు చర్చనీయాంశం ఈ బోర్డు మీద ఉన్నదానికి సంబంధించిందే! అంచేత దాన్ని అధ్యక్షులవారు సభకంతకూ ఒకమాటు చదివి వినిపిస్తారు.' అని అంటూ చిట్టచివరి పంక్తిలో విద్యార్థులపక్క బల్ల మీద కూర్చున్నారు.

శ్రీమన్నారాయణ ఇంకా తల ఎత్తి లేదు. అతని కేం చెయ్యాలో ఏమీ తోచడంలేదు.

'అధ్యక్షుల వారు ఆలస్యం చేస్తే వీల్లేదు. మన కున్న వ్యవధి చాలా తక్కువ' అని మాస్టారు మళ్ళీ హెచ్చరించారు.

ఇప్పటికి క్లాసులో చాలామందికి దిక్కు తెలియనితనం పోయి జరుగుతున్న దేదో తెలుసుకునే స్థితి వచ్చింది.

'ఇంకా లేవరేం అధ్యక్షుల వారు?' అని మాస్టారు ఇంకోమాటు అనడంతో క్లాసు అంతా ఒక్కమాటు నవ్వారు. దాంతో శ్రీమన్నారాయణకు లేవక తప్పిందికాదు. కాని అతను బోర్డువంకకు చూడ లేక పోతున్నాడు.

'అవసరమనితోస్తే అధ్యక్షుల వారు దాన్ని చదవడానికి ఎవరి సహాయమైనా పుచ్చుకోవచ్చు. పోనీ నన్ను చెయ్యమంటారా?'

శ్రీమన్నారాయణ చచ్చేటంత సిగ్గుతో అంగీకారసూచకంగా తల ఆడించి వంచేసుకున్నాడు.

మాస్టారు చదివారు.

'లెక్కల మాస్టారూ!

మీరు మమ్మల్ని ఇకముందు కొట్టినట్లయితే మేము మిమ్మల్ని కొట్టగలము.

ఫోర్తు ఫారమ్ విద్యార్థులు'

దీన్ని చదివేసి మాస్టారు ఊరుకోలేదు.

'ఇల్లా ఉన్న విషయాన్ని గూర్చి సభ్యులు మాట్లాడలేరేమో అని నాకు అనుమానం కలుగుతోంది. దీన్ని కొంచెం స్పష్టంచేసి మరొక విధంగా చెప్తాను. 'ఉపాధ్యాయుడు విద్యార్థిని కొట్టవచ్చునా, కొట్టగూడదా?' విషయాన్ని ఈ విధంగా నిర్ణయించుకుంటే అందరికీ అందుబాటులో ఉంటుం దనుకుంటాను. కాని మరొక విషయం మనవి చెయ్యాలి. అధ్యక్షులవారు కేవలం ముభావం వహించి అంతపనీ నాచేతే చేయిస్తున్నారు. ఇకమీద నేనేమీ చెయ్యను కాబట్టి అధ్యక్షుల వారు ఉత్సాహంతో ఈ సభను కొనసాగిస్తారని ఆశిస్తున్నాను'.

ఈ మాటలు విని క్లాసంతా మళ్ళీ ఒక మాటు గొల్లుమని నవ్వారు. ఈ మాటు శ్రీమన్నారాయణకు

కూడా నవ్వువచ్చింది. అతని కిప్పటికి పోయిన ధైర్యం కూడా క్రమక్రమంగా వచ్చి చేరుకుంది.

శ్రీమన్నారాయణ లేచి నిల్చుని 'ఈ విషయంలో ముందు మాస్టారు వచ్చి మాట్లాడితే బాగుంటుం దనుకుంటాను' అంటూ సగంసగం మాటలు మింగుతూ అన్నాడు.

'ఇప్పుడు నేను మాస్టర్ని కాను. నేనూ మీలో ఒకణ్ణే. కాని అసలు ప్రస్తావన తెచ్చింది మీరు కాబట్టి, మీచర్చ అంతా విన్నాక సభ పూర్తిచేసిం తర్వాత నా ఉద్దేశాలు నేను చెప్తాను' అని ఊరుకున్నారు మాస్టారు.

తర్వాత విద్యార్థులు ఒకరొకరే వచ్చారు. కొందరేమీ చెప్పలేక 'అధ్యక్షా! సోదరులారా! ఇవాళ విషయం ఉపాధ్యాయుడు విద్యార్థిని కొట్టవచ్చునా కొట్టగూడదా అనునది. నా అభిప్రాయం కొట్టగూడదు అని. ఇంతటితో నేను విరమిస్తున్నాను'. అని మాత్రం చెప్పి వెళ్లిపోయారు. మరికొందరు ఎంత బలవంతం చేసినా వాళ్ల చోటుల్లోనుంచే కదలలేదు. చివరకి కొట్టవచ్చునని ఇద్దరున్నూ, కొట్టగూడదని నలుగురున్నూ వాళ్ళకు వాళ్లకు తోచిన కారణాలతో కొంచెం సేపు మాట్లాడారు. కొట్టగూడదని చెప్పినవాళ్లు ఇంచుమించు ఇదివరకు శ్రీమన్నారాయణ క్లాసులో చెప్పిన ఉపన్యాసపు సారాంశమే వెలిబుచ్చారు. కాని వాళ్లందరూ కూడా లెక్కల మాస్టారు చాలా బాగా చెప్తారనీ, కొట్టడం మానేస్తే ఇంకా చాలా బాగుంటుం దనీ సలహా యిచ్చారు. కొట్టవచ్చునని చెప్పినవాళ్లు మాస్టరు లెక్కలమాస్టరు లాంటివాడైతేనే కొట్టవచ్చు నన్నారు. అంటే వాళ్ల ఉద్దేశ్యం చెప్పినపాఠం చదవక అశ్రద్ధచేస్తే తప్పకుండా కొట్టవచ్చునని. సభను ముగిస్తూ శ్రీమన్నారాయణకూడా రెండు ముక్కలు చెప్పాడు. 'ఏమీ చేతకాని నన్ను మాస్టారు అధ్యక్షుణ్ణిగా ఉండ మన్నారు. ఇందులో నే నేమైనా తప్పులు చేసిఉంటే వాటి నన్నిటినీ ఆయన క్షమిస్తారని అనుకుంటున్నాను.' అని తన చోటులోకి పోయి కూర్చున్నాడు.

ఇంతలో మొదటి పిరియడు అయిపోయింది. తర్వాత పిరియడు మాస్టారింకా రాలేదు. లెక్కల మాస్టారు క్లాసును మానిటరు కప్పగించి హెడ్మాస్టరు దగ్గరికి వెళ్లారు.

క్లాసులో అందరూ తలకొకవిధంగా అనుకున్నారు. హెడ్మాస్టరుతో కొందరిమీద రిపోర్టు చేస్తాడనీ, శ్రీమన్నారాయణను బళ్లోనుంచి పంపించేస్తాడనీ ఇట్లాగే ఏవేవో అనుకున్నారు. శ్రీమన్నారాయణమాత్రం ఆయన నటు వెళ్లిందే తడవుగా దస్తరు పుచ్చుకుని బోర్డంతా శుభ్రంగా చెరిపేశాడు. 'ఇంత మాత్రానికేనా అన్ని కబుర్లు' అని వేళాకోళంచేసిన ఒకరిద్దరి ముఖాలకూ ఆ దస్తరుతో వెల్లవేశాడు కూడా.

ఇంతలో మళ్లీ లెక్కల మాస్టారే వచ్చారు.

ఆయన కుర్చీలో కూర్చుని చెప్పిన మాట లివి:

'ఇవాళ ఈ పిరియడుకూడా నేనే తీసుకుంటాను. ఈ విషయం చెప్పిరావడానికే నేను హెడ్మాస్టరుదగ్గరకు వెళ్లాను.

నేను ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించి ఇప్పటికి ఆరు సంవత్సరాలైంది. అప్పటినుంచీ ఇప్పటివరకూ నాప్రయత్నం అంతా నిజమైన ఉపాధ్యాయుణ్ణిగా పనిచేయడానికే! కాని, నిజమైన ఉపాధ్యాయుడంటే ఎవరు? తనదగ్గరకు వచ్చిన ప్రతివిద్యార్థికీ చదువుమీద శ్రద్ధకలిగించి చదివించగలిగినవాడే నిజమైన ఉపాధ్యాయుడు. ఉపాధ్యాయుడు విద్యార్థి ఇచ్చే జీతంవల్ల బ్రతుకుతున్నా డన్న మాటలో యథార్థం లేకపోలేదు. కాని మీ రందరూ ఒక విషయం గ్రహించాలి. మీరు యజమానులు. ఉపాధ్యాయులు మీ సేవకులు. మీ యాజమాన్యం మీ తల్లిదండ్రుల దగ్గఱనుండి డబ్బుతీసుకు వచ్చి ఇచ్చేవఱకేగాని ఆపైన మీసేవకుల చేత ఏంపని చేయించుకోవాలో, ఎట్లా చేయించుకోవాలో మీకు తెలియదు. క్లాసులో అందరికీ ఒక విధంగా చదువురాదు. చాలామంది ఉపాధ్యాయులు పిరియడు కింత అని పాఠంచెప్పి ఎవడికి వచ్చినా రాకపోయినా తమదారిని తాము పోతూఉంటారు. అట్లాంటి వాళ్లను చూచి మీరు చాలా మంచివాళ్లనుకుంటూ ఉంటారు. బజారులోకివెళ్లి కొట్టువాడు పుచ్చువంకాయలు ఇస్తే పుచ్చుకోని మీరు మాస్టరు మీకు తెలిసేటట్లుపాఠం చెప్పకపోతే లెక్కచెయ్యరేం? మీ రెందు కిక్కడికి

వస్తున్నారో, మీరు ఖర్చుపెట్టే సొమ్మూ, కాలమూ, వీటివిలువ యేమిటో,మీభావిజీవితాలు ఈవయస్సులో మీరుచేసే పనులమీద ఎంతఆధారపడిఉన్నాయో మీకు బొత్తిగా తెలియదు. మిమ్మల్ని చూస్తే నాకు కోపం రావడం లేదుగాని జాలివేస్తోంది. నా సంగతి నాకంటే గూడా మీకే ఎక్కువ తెలుసు. నే నెప్పుడైనా ఎవ రిని ఎందుకు కొట్టానో మీకు తెలియంది కాదు. నా ఆశ ఒక్కటే! మీలో ప్రతిఒక్కరికీగూడా చదువు విలువ తెలియాలి, దానియందు ఆసక్తి కలగాలి, అభ్య సించాలి, అభివృద్ధి పొందాలి. సృష్టిలో ప్రతివాడికీ కూడా ఏచదువుగాని చెప్పేవిధంగా చెప్పితే రాకుండా ఉండడానికి వీల్లేదని నా పరమమైన విశ్వాసం. అంచే తనే నేను నాకు తెలిసినంతలో ఒకొ్కక్కవిద్యార్థికీ ఒకొ్కక్కవిధంగా చెప్పుతూఉంటాను. మూడువందల యేండ్లకు పైగా బానిసతనం అనభవిస్తున్న మన దేశం బాగుపడాలంటే ప్రతియువకుడూ నిజమైన విద్యావం తుడు కావాలి. మాస్టర్ల చేత మార్కులు వేయించుకుని ప్యాసయినా, కాపీలుకొట్టి ప్యాసయినా మీరు లోకాన్నే కాక మిమ్మల్నిగూడా మోసంచేసుకుంటున్నారు. ఇప్పుడు మన శ్రీమన్నారాయణ విషయమే చూడండి, ఎక్కడో థర్డుఫారమ్ ప్యాసయివచ్చి ఇక్కడ చేరాడు. అత నెట్లా ప్యాసయ్యాడో అతనికే తెలియాలి. ఇప్ప టికి నాలుగునెలలైంది ఈబళ్లో చేరి. వచ్చినదగ్గరనుంచీ నా అభిప్రాయాలన్నీ అతనితో చెప్పుతూనేఉన్నాను. తెలివిగలవాడుగదా, చెప్పితే చాలు అన్న ఉద్దేశంతో ఎన్నెన్నివిధాల చెప్పానో, నాకంటే మీ అందరికీ అతను చెప్పితేనే బాగుంటుంది. అతనికి చదువుమీద ఆసక్తి కలగాలని అనేకపుస్తకాలు తీసిఇచ్చాను. కాని అతను వాటిని చదవలేదు సరిగదా కొన్నిటిని చించి గూడా తెచ్చాడు. అతని విషయంలో ప్రతిరోజూ క్లాసులో ఏం చెప్పుతున్నానో, ఏం చేస్తున్నానో అనంతా మీఅందరికీ తెలుసు. ఇన్నిరోజులబట్టీ ఆలో చించిఆలోచించి అతనికి శ్రద్ధ కలిగించేందుకు మరేఉపా యమూ తోచక నిన్నను మొదటిమారు చెయ్యిచేసు కున్నాను. దానికి ఫలితంగా ఆతడు ఏవిధంగా ప్రవ ర్తించాడో మీకు తెలుసు. అత నల్లా అన్నందుకు నాకేమీ కష్టం కలగలేదు. కాని అతడేంచేస్తే మార్పు

పొందుతాడో తెలియక చాలా బాధపడ్డాను. ఇవ్వాళ క్లాసులోకి వచ్చేటప్పటికి మీ రీపని చేశారు. ఇది ఎవరుచేశారన్న ప్రశ్నతో నాకేమీ అవసరంలేదు. అది క్లాసులో బోర్డుమీదవ్రాసిఉన్నదికొబట్టి క్లాసంతా ఆవిషయాన్ని అంగీకరించినట్లే లెక్క. అందుచేత మీ రందరూ ఒక్కవిషయంమాత్రం తెలుసుకోవాలని నా ప్రార్థన. నే నీఉద్యోగం చేస్తున్నది కుఱ్ఱవాళ్లను కొట్ట డానికికాదు—కుఱ్ఱవాళ్లకు చదువుచెప్పడానికి. చదువు కోవడానికి ఇష్టంలేనివాళ్లు ఇక్కడికిరావడానికి వీల్లేదు. వాళ్లకు తెలియక వాళ్లు వస్తే వాళ్లకుగూడా చదువు చెప్పవలసిన బాధ్యత నామీద ఉన్నది. ఆ లక్ష్యం సాధించడానికి అవసరమైతే దెబ్బలుకొట్టడానికిగూడా నాబాధ్యతనుబట్టే నాకు హక్కుఉంది. నా ఉద్యోగం ఉంటుందా ఊడుతుందా అన్నదాంతో నాకేమీ సంబంధంలేదు. ఉద్యోగంలో నేను ఉన్నంతవఱకూ నాకర్మం నేను నిర్వర్తించవలసిందే!

మీ రందరూ మీ మనస్సుల్లో ఉన్న అభిప్రా యాల్ని నిర్భయంగా ప్రకటించగలిగినందుకు మీ అంద నా ధన్యవాదాలు.

నేను చేసినపనికి మీఅందరికీ ఇంకా కోపంగా ఉండి నన్ను కొట్టదల్చుకున్నట్లయితే నిరభ్యంతరంగా కొట్టవచ్చు.'

ఈ ఉపన్యాసం వింటున్నంతసేపూ శ్రీమన్నా రాయణ నిలువునా నీరైపోతూనేఉన్నాడు. ఉప న్యాసం పూర్తికావడంతోటే వెక్కివెక్కి ఏడుస్తూ 'క్షమించండి మాస్టారూ!' అంటూ ఆయనకాళ్లమీద పడ్డాడు.

అంతే! ఆనాటినుంచీ ఆ స్కూల్లో అన్ని విష యాల్లోనూ ఆక్లాసే ప్రథమం. ఆ క్లాసంతటిలోకీ శ్రీమన్నారాయణే మొదటివాడు.

ఇప్పుడు లెక్కలమాస్టారు కొట్టడంలేదు. నెల కొకనాడైనా క్లాసుకు సంబంధించిన ఏదో విజయాన్ని పురస్కరించుకుని విందులూ బహుమతులూ ఏర్పాటు చేస్తున్నారు.

దీన్నిగురించి అపార్థాలు తియ్యడంలో నిమగ్ను లైన పెద్దలు లేకపోలేదు. కాని ఎవరు నిజమైన ఉపా ధ్యాయులో శ్రీమన్నారాయణకే తెలుసు.

# రాజరాజు తనలో

= శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి =

గౌరవ మారఁగాఁ దెలుఁగు కన్నెకు
వన్నెలుఁ దీరఁదీయుముల్
తీరిచి దిద్ది లక్షణవతిం బొనరించిన
దిట్ట నన్నెభ
ట్టారకు సాధుజీవన తటంబున
దివ్యసుధాస్రవంతి జా
ల్వాఱుఁగఁ జేయు తీయనితలం
పొకఁ డేనొ యొసంగ ముంపఁగన్.

తడిసిన కన్నులం దొక వ్యథాభర
మాటలువాఱ, వా తెఱన్
వడఁకులు గ్రమ్మ, భావమున
నల్లని మబ్బులు చిమ్మ, నేదియో
నొడువఁగరాని శోకమున నోవుచునున్న
తెనుంగువాణి, మేల్
తొడవులు లేనిదాని వగతోఁ గని
రాజనరేంద్రుఁ డార్ద్రుఁడై.

తెరువుసెడి పాడువడిన జాతీయవాణి
యఱగొఱల్ గని కడుఁ గనికరము నూని
తరఁగ లంపఱ తెఱఁగునఁ దలఁపు లిటులు
పఱవె లోలోన భావనాంబరము విరియ.

"అనిబద్ధంబగు వాఙ్మయమ్ము గల
దేశాచారముల్ జాతిజీ
వనముం దిన్ననిదారి దిద్దుటకుఁ
జేవల్ కావు; యద్దేశవృ
ద్ధి నవీనంబుగ వాంఛ సేయుదుమొ,
తద్దేశీయ భాషాభివృ
ద్ధి నితాంతంబున జూడఁగా వలయు
నాదిన్ సాధుమార్గంబునన్.

తీపు లాలికించి నేఁ డుండి రేపు పోవు
రాజ్యమును నమ్మికొని, యక్షరమ్ముగాని
శాశ్వతత్వము మఱచి భాషాస్రవంతి
కాదరువు నీని యొకిమీని కేది యశము?

తెగులు పడిపోయి చెడియె వైదికమతంబు
రగులుకొని పోవుచుండె ధార్ష్ట్యముల దాడి
మిగిలి పొగచూరె బాసలో సొగసుఁదనము
కలదె యీ చీకటిని దాఁటి వెలుఁగుగనుట?

దొరనై యుంటినిఁ, గంటి వాఙ్మయపు
లోఁతుల్, భారతీమాతచేఁ
బరిహాసంబుల నందుచుంటి నిటు
లబ్బా! సైఁప దుర్వ్యాప బం
ధుర దంష్ట్రా వికటాట్టహాసములఁ
జేతుల్ చాచె; నాపైఁ గ్రుధా
భర మేచెం గనుదమ్ములం దదిగొ
శాపం బిత్తువో! శారదా!

అమృతప్రాయము నీ కటాక్షరుచి
కమ్మా! దోయిలింబట్టినా
రము, రారమ్ము జ్వలత్కృశాను శిఖ
లార్పన్ నేర్పుమై మా ప్రభు
త్వము పండింపుము; నీ దయాతిశయము
న్వర్షింపు; మాశాంత దే
శము నీ కోసర మర్థి సాఁచుకొనె
విశ్వాసంబు నిండారఁగన్.

నతు లర్పింతుము బిడ్డలందు
నభిమానం బుంచుమమ్మా! కృత
జ్ఞత చూపింతు మభిజ్ఞశేఖరుల
శాశాస్యంబు లిమ్మా! నిరా

కృతిఁ జూపించితి మిన్నినాళు
లిది సైరింపంగదమ్మ! సర
స్వతి! దేశస్థులకుం గృపామతి
నుపజ్ఞాభిక్ష నందింపుమా!
ఛందస్సుందరమైన పద్యకవితా
సారస్వతంబన్న మా
డెంద మ్మూర్మి సముద్రమై పొరలి
గొండ్లింజేయు నానందని
ష్యందంబై; పసిలేని పాటలకు
లోనై యున్న నీ కౌకళా
సౌందర్య మ్మెటు గూరు భారతి!
భవిష్య మ్మెంచి దుఃఖించెదన్.

ఏలల్, జోలలు, పల్లెపాటలు,
పదా, లేవేవొ మున్నైన గే
యాఽన్ మేలిమిమాలి డాఁగికొని
యవ్యక్తంబుగా నుంటి, వి
న్నాళుల్; సీసము, లక్కురల్,
రగడలుం, దరోజ్వజలున్, మంజరుల్
నీ లీలాభవనంబులే? తెలుఁగువాణీ!
చాలు నీ దుస్థితుల్.

అని మరియును:—

అదిర! తెల్లవెలంది కిద్ది యొక
నిద్రావస్థ: ఆ నిద్రకుం
దుది యధ్యాయముగా నవశ్యముగ
నెంతున్ నేఁటి మా జీవితం
బిది; నిద్రించిన మమ్ము మేల్కొలుప
మేమే కామె? నిద్రాణశా
రద మేల్కాల్పెద మింక, మేల్కానెద
మాంధ్రత్వమ్ము అంపిల్లఁగన్.

మతము, నీతియు, గౌరవంబు,
గుణసంపల్లబ్ధి, జాతీయ జీ
వితమున్, సర్వము వాఙ్మయాభ్యుదయ సుప్తిం
బెంపుదీపించు; భా
రతి కన్నీటికిఁ గాలువల్ పొడుచు
నిర్భాగ్యత్వ మీ నేలలో
ప్రతిబింబించెన్, మఱి దీని ద్రుంచఁగల
నేర్పుం దీర్పు మా కబ్బుతన్!

సొగసులు చిల్కరించు గడుసుందన
మందిన యాదికావ్యపుం
జిగిబిగి కూర్పులోన నిలిచెన్
రవివంశయశో విశాలతా
ప్రగుణత నేఁటిదాఁక నిశరంబుగ;
నెన్నొ గతించె నబ్దముల్
యుగయుగముల్ గతించినవియున్,
మఱి మాసెనె నాఁటి వెన్నెలల్!

వేదములు వేలు వేలుగ పింగడించి
చూపిన మనీషివరుఁడు వ్యాసుండు లేక
కాలగర్భపుఁ గటిక చీకటులు సోకి
నీరసిలిపోదె మన పురాభారతంబు?

అని చింతించి తెలుంగు కేఁడు
హృదయం బార్ద్రింబుగా, వేఁడిగాఁ
గను నిట్టూరిచి శారదాచరణ
సాక్షాత్కారముం గాంచెనో
యన నొక్కించుక సేపు ప్రానుపడి
సద్యస్స్తంభనంబైన భా
వన యేకో చపలాసదృక్షుమయి,
లేఁపన్ లేచె నొకుక్కుమ్మడిన్.

(నా "ఆంధ్ర పురాణము" చాళుక్యపర్వము నుండి)



# 2000 ఏళ్లకు ముందు..

పూర్వపువారు చందనమును పరిశుద్ధతకు పర్యాయపదముగా నిర్ణయించినారు. నేటివారు మోటారులలో "రోల్స్‌రాయిస్"ను ఉత్తమమయినదని చెప్పినట్లు, మంచివస్తువుల ప్రసంగములో చందనమును శ్రేష్ఠమయినదానినిగా ప్రశంసింతురు. చందనము, మధురపరిమళము, చలువగుణము కలిగియుండుటవలన చందనతైలము సౌందర్యాలంకార వస్తువులలో ముఖ్యముగా ఉపయోగింపబడుచున్నది. అశోకుని కాలమున యధార్థముగా అంగీకరింపబడిన విషయము నేడుకూడ యథార్థమే!

## శాండల్ సబ్బు



'పరిశుద్ధతకు ప్రసిద్ధమైనది చందనమే''

మైసూరు గవర్నమెంటు ప్రాడక్టు.

B-3. T4




# బిటా కేఫిన్

(తలనొప్పి బిళ్లలు)

అన్ని నొప్పులను, జ్వరములను కుదుర్చును.

తలనొప్పి, పంటినొప్పి, కాళ్లునొప్పి, నిద్ర లేకుండుట, కీళ్ల నొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట, వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును. వాడు కొను విధము పొట్లములో నుండును.

పొట్లం 3 బిళ్లలు 1 అణా.




# బిటాలాక్స

చాక్లెట్ భేదిబిళ్లలు.

సుఖవిరేచ నౌషధము

ఇవి సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును. పొట్లం 2 బిళ్లలు 1 అణా.

అన్ని చోట్ల దొరుకును.

Stockists: M/S DADHA & Co.,
P. T. Madras.

*Manufactured by*

**BOMBAY TABLET MFG., CO.,**
P. O. Box 2092, BOMBAY. 2




"తాత్కాలికంగా ఉపశమనము కలిగించే మందులను వాడడం చాలా పెత్తికనం."

అప్పటికప్పుడు వెంటనే గుణ మిచ్చుటయే గాక, ఉబ్బస వ్యాధియొక్క మూలకారణములను రూపుమాపి శాశ్వతంగా నయము చేయునది పురోహిత్ వారి శ్వాస హారి మాత్రమే. శ్వాసహారిని వాడుట ప్రారంభించిన వెంటనే, దగ్గుపోయి, శ్వాస ధారాళమగుటయే గాక, జీర్ణకోశము, ఊపిరితిత్తులు క్రమేణ బలపడి, ఉబ్బసము పూర్తిగా తగ్గిపోవును.

ఉబ్బసము, ఊపిరి సలుపకుండుట, నడుమునొప్పి, గొంతుకలో నసకలిగించు దగ్గు, మొదలగు గుండెజబ్బులకు శ్వాసహారి (నీలిరంగుప్యాకెట్టు)ను వాడుడు. మలబద్ధకము, పులితేపులు, వీటితో బాధపడు ఉబ్బస వ్యాధిగ్రస్తులగువారు శ్వాసహారి కాంపౌండు (ఎరుపు రంగు ప్యాకెటు)ను వాడుడు.

అందరు కెమిస్టులవద్దను, 3, 6, 12 ఔన్సులు సైజులలో 3-6-0, 5-12-0, 10-0-0లు ధరలుగలిగినవి లభించును

మద్రాసు స్టాకిస్టులు:
మెస్సర్సు: అప్పా & కో, చైనాబజార్ రోడ్,
,, శ్రీ క్రిష్ణన్ బ్రదర్సు, తంబుచెట్టివీధి,
,, అమృత రత్నాకర ఫార్మసీ, గోవిందప్ప నాయక్ వీధి.
,, పండాలిక్ & కో, హైదరాబాదు, సికిందరాబాదు.

తయారుచేయువారు
పురోహిత్ ఫార్మసీ
కొల్హాపూరు.




**PUROHIT**
**SHWAS-HARI**

# నేటి ఆహారసమస

— శ్రీ డి. వేం శ్వర్లు —

మన జీవనాధారము ఆహారము. మనకు ప్రస్తుతం ఆహారానికి చాలా చిక్కుగా వుంది. అయి దాదు సంవత్సరాల క్రితం యింత చిక్కులేదు. ఎప్పుడూ మన దేశంలో పంట మనకు సరిపోకపోవడమువల్ల ఇతర దేశాలనుంచి ఆహారపదార్థాలు దిగుమతి కాజడుతూండేవి. యుద్ధసంవత్సరాలలో దిగుమతులు తగ్గడంవల్లా, మన రాజకీయపరిస్థితులవల్లా ఆహారానికి మరీ చిక్కులు వచ్చాయి. మనం యింతవరకూ ఎన్నో కరువుల పాలై నాము. దేశంలో ఏదో ఒకమూల కరువులు సంభవిస్తూనే వున్నాయి. మొన్న మొన్నటి బెంగాలుకరువులో రెండు మూడులక్షలమంది చనిపోయారు. ఎన్నో రెట్లమంది తిండిలేక మలమల మాడిపోతూ చావుబ్రతుకులమధ్య కలకత్తావీథులంట తిరిగారు. ఇదేసమయంలో వ్యాపారస్థులు బాగుపడ్డారు. లక్షాధికారులు కోటీశ్వరు లయారు. ఆహారపుకంట్రోలుపేరు చెప్పి కొందరధికారులుకూడ డబ్బుచేసుకున్నారు.

మన దేశంలో యీపరిస్థితు లేర్పడడానికి కారణము నిన్నటివరకూ మనలను పాలిస్తూన్న ప్రభుత్వము దేశసౌభాగ్యమందు శ్రద్ధతీసుకొనకపోవుటయే. ప్రతి కరువుతరువాతా దాని కారణాలు కనుగొనుటకో, కరువు యికముందు రాకుండు మార్గములు సూచించుటకో ఇంగ్లండునుంచి మన దేశానికి చాలా కమిటీలు వచ్చాయి. ఆ కమిటీలు దేశమన్ని దిక్కులా చూచి పెద్దపెద్ద సాక్ష్యాలు సంపాదించి బ్రహ్మాండమయిన పుస్తకాలు తయారుచేశాయి. ఈ పుస్తకాలలో కరువునివారణ సూచన లేమీ లేవు; వున్నా వాటిని మన ప్రభుత్వం పాటించలేదు.

మన ముఖ్యవృత్తి వ్యవసాయము. ౧౦౦ కి ౭౦ మందియొక్క జీవనాధారము వ్యవసాయమే. కాని ఇక్కడే కరువులు వరుసగా వచ్చాయి. ఈ యుద్ధకాలంలోకూడా పాశ్చాత్యదేశాలలో ఎక్కడా కాటకాలు రాలేదు. ఇంగ్లీషుప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము కాకపోయినా, వారు తిండికి మనంత యిబ్బంది పడలేదు; మన దేశంలోమాదిరి అక్కడ కరువులు రాలేదు. యుద్ధం రాగానే బ్రిటిష్‌ప్రభుత్వము మొత్తం కావలసిన తిండిపదార్థా లెంతో ఎంచి, దేశంలో వీలై నంత పండించడానికి తగిన ప్రయత్నాలు చేసి, మిగతా దానిని అన్యదేశాలనుంచి దిగుమతిచేసే ఏర్పాట్లు చేసి, కరువురాకుండా చేసుకున్నారు. చంటిపిల్లలకు, బిడ్డల తల్లులకు, గర్భిణీస్త్రీలకు పాలు వుచితంగా యిచ్చారు. పారిశ్రామిక కేంద్రాలలో చౌకభోజనవసతు లేర్పరిచారు. ఇన్నివిధాలుగా ఆహారము ప్రజలకు అందజెయ్యడంవల్ల యుద్ధమునకు పూర్వంకంటె యుద్ధకాలంలో ప్రజలు ఆరోగ్యవంతు లయారు. సగటున పిల్లలు రెండుమూడంగుళాల పొడుగు ఎదిగారు.

ప్రస్తుతం మన జనాభా సుమారు ౪౦ కోట్లు. ఈలెక్కన మన జనాభా ఇంకముందుకూడా పెరిగితే, ౧౯౬౦ నాటికి ౫౦ కోట్లు, ౧౯౭౦ నాటికి ౬౫ కోట్లు అవుతుంది. ఇంతమందికి ఆహారము మన దేశంలో లేదు కాబట్టి, భూకంపమువంటి విపత్తు ఏదో వచ్చి భూభారాన్ని తగ్గిస్తుందనీ, లేకపోతే కృత్రిమముగానైనా మన జనసంఖ్యను కట్టుబాటులో వుంచడము చాలా అవసరమనీ అనేకుల అభిప్రాయము. కాని ఈ అభిప్రాయము నిరర్థకము. తగినంత తిండిగనక చూపగలిగితే, మన అధిక జనసంఖ్యే మనకు చాలా ఉపకరిస్తుంది; మనము మిగతా దేశాలకంటే ముందుకు రాగలుగుతాము. కాబట్టి మన మాలోచించవలసినది దేశంలో జనాన్ని తగ్గించే విధానము కాదు; దేశంలో పంటలు ఎలా ఎక్కువగా పండించగలమా అని.

## సరియైన ఆహారము

మనం తినే ఆహారము పిండిపదార్థాలు (Carbo-hydrates), కొవ్వుపదార్థాలు (Fats and oils), ధాతువులు (Minerals), వైటమినులు (Vitamins) ప్రొటీనులు (Proteins) మొదలగున వన్నిటితో కూడివుండాలి. వీటిలో ప్రతిదానికిని ఒక నిర్ణయ

కార్యం వుంది. పిండిపదార్థాలు మనకు కావలసిన వేడిని అందజేస్తాయి. పని చెయ్యాలంటే ప్రతియంత్రానికీ శక్తిని ఏదోఒకరూపంలో అందజెయ్యాలిగదా! బొగ్గుద్వారా రైల్వేయింజనుకు, పెట్రోలుద్వారా మోటారుకారుకు, విద్యుచ్ఛక్తిద్వారా ఎలెక్ట్రిక్ లైటుకు శక్తిని అందజేస్తున్నాము. ఇదేవిధంగా మనకు కావలసిన శక్తిని పిండిపదార్థాలద్వారా యిస్తున్నాము. మనకు రోజుకు అధమము ౨,౮౦౦ కేలరీల వేడిని యిచ్చే ఆహారము కావాలి. ౨,౮౦౦ కేలరీలు అంటే సుమారు పానుబొగ్గును అంటిస్తే వచ్చే వేడి ఎంతో అంతటిది. మిగతావి—కొవ్వుపదార్థాలు, ధాతువులు, వైటమినులు—కూడా చాలా ముఖ్యము. వాటిలో ఏది లేకపోయినా, మనిషి జబ్బుల పాలవుతాడు. మనం తీసుకునే తిండిలో ఇవన్నీ సరిఅయిన పంపకములో వుండాలి. అలా వున్నదే సరియైన ఆహారము (Balanced diet).

ఒక శాస్త్రజ్ఞుని ప్రకారము మనకు సరియైన ఆహారము కావాలంటే మనం రోజూ తినవలసినవి: బియ్యము (అన్నము) ౧౦ ఔన్సులు, గోధుమన్నము ౬, పప్పుపదార్థాలు (Pulses) ౪, పంచదార ౨, పాలు ౧౦, చేపలు, మాంసము ౪, కూరగాయలు ౫, ఆకుకూరలు ౫, కొవ్వుపదార్థాలు ౨, పళ్లు ౩ ఔన్సులు, ఒకటిరెండు కోడిగ్రుడ్లు. శాకాహారులు చేపలు, కోడిగ్రుడ్లు, మాంసములకు బదులు అధికంగా పాలు తాగాలి.

ఈ విధంగా మన దేశంలో అందరూ సరియైన ఆహారము తినాలంటే మనకు సాలుకు కావలసిన వస్తువులు: బియ్యము, గోధుమలు ౮౫౦, పప్పుపదార్థాలు ౧౬౦, పాలు ౪౦౦, పంచదార, బెల్లం ౭౦, చేపలు మాంసము ౧౬౦, కూరలు, పండ్లు ౪౦౦ లక్షల టన్నులు; కోడి గ్రుడ్లు ౧౫౦ లక్షలు.

## ప్రస్తుత పరిస్థితి

మనకు న్యాయంగా రావలసిన ౨,౮౦౦ కేలరీలలోనూ సగటున ౧,౮౦౦ కేలరీల ఆహారముమాత్రమే ప్రస్తుతం దొరుకుతోంది. అంటే, మనలో కొందరికైనా కడుపునిండా (౨,౮౦౦ కేలరీల సరియైన) భోజనము పెట్టేటట్టయితే, ౪౦ కోట్ల జనాభాలోనూ సుమారు ౧౫ కోట్లమంది, లేక ౧౦౦ మందిలో ౪౦ మంది చనిపోవలసివస్తుంది.

ప్రస్తుతం మన దేశంలో ముఖ్యమైన ఆహారపదార్థాల ఉత్పత్తి:

| | | |
|---|---|---|
| బియ్యము, గోధుమలు మొ. | ౬౦౦ | లక్షల టన్నులు. |
| పప్పుపదార్థాలు | ౮౫ | ,, |
| కొవ్వుపదార్థాలు | ౧౯ | ,, |
| పండ్లు | ౬౦ | ,, |
| కూరగాయలు | ౯౦ | ,, |
| పాలు | ౨౩౦ | ,, |
| మాంసము, చేపలు, కోడిగ్రుడ్లు | ౧౫ | ,, |

ఉత్పత్తిఅయే పదార్థాలు మనకందరికీ చాలక పోవడంవల్ల జరిగే దేమిటంటే, చాలామంది కావలసిన కేలరీల తిండి తింటారు కాని, అది సరియైనది కాక పోవడమువల్ల కొన్ని జబ్బులకు లొంగిపోతున్నారు. ఇంకా కొందరు జీవించడానికి కావలసిన కేలరీల తిండి కూడా లేక చావుబ్రతుకులమధ్య వున్నారు. ఈ పరిస్థితులలో చావుల సంఖ్య ఎక్కువగా వుండకతప్పదు. అందులో ఆడవారిలోనూ, పిల్లలలోనూ మరీ ఎక్కువ. ఇది ప్రస్తుతం మనమున్న పరిస్థితి. మన సగటు జీవితపరిమాణము ౨౮ సం. లు మాత్రమే. అమెరికా సంయుక్తరాష్ట్రములలో ౬౦ సం. లు. అలాగే చంటిపిల్లల చావుకూడా మన దేశంలో చాలా ఎక్కువ.

## రానున్న మార్పులు

ప్రస్తుతపరిస్థితులను మార్పుచేసి, దేశంలో అందరికీ అన్నిరోజులూ రెండుపూట్లా భోజనము పెట్టేందుకు తిండి పదార్థాల ఉత్పత్తి ఎన్నోరెట్లు పెరగాలి; ఎన్నో పెద్దస్కీములు పూర్తికావాలి; అనేక రంగాలలో కార్యక్రమాన్ని నడపాలి.

వ్యవసాయాన్నిగురించి ముందు చూద్దాము. మన దేశంలో వున్న భూమిలో నాలుగోవంతు మాత్రమే ప్రస్తుతం సాగుబడిచేయబడుతున్నది. మిగతా దానిలో కొంత చవిటిభూమి. దానిని కొద్దికృషితో వ్యవసాయయోగ్యముగా చెయ్యవచ్చు. కాని చాలా భూమి నీటిసదుపాయంలేక వుపయోగింపబడటంలేదు. ఈ భూములను సాగుబాటులోనికి తీసుకొనిరావడానికి ఆనకట్లను కట్టి, నదులలో నీటిపారుదలను వశముచేసుకొని, కాలువలద్వారా నీటిని వ్యవసాయయోగ్యమైన ప్రతి ఎకరపుభూమికీ అందజెయ్యాలి. వ్యవసాయాని

కే విధంగా నీటిని, పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని యిచ్చే ప్రాజక్టులను (Multipurpose Projects) నిర్వహించ డానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. బెంగాలుకు దామోదర్ స్కీము, బీహారుకు కోసీ, సోను స్కీములు, ఒరిస్సాకు మహానది, మన తెలుగు జిల్లాలకు గోదావరీ, తుంగభద్రా, మాచ్‌కండ్ స్కీములు ఎంతో ఉపకరిస్తాయి. మన గోదావరీస్కీముకు (రామపాదసాగర) ౮౬ కోట్ల రూపాయలు ఖర్చవు తుంది. వీటివల్ల మనకు తగినంత ఆహారము దొరకడమే కాకుండా, పారిశ్రామికాభివృద్ధికూడా కలుగుతుంది. ప్రతిపట్టణమునకూ, పల్లెకూకూడా విద్యుద్దీపములు రా గలవు. రైల్వేలనుకూడా విద్యుచ్ఛక్తివల్ల నడుపుటకు వీలవుతుంది.

ఇంకోముఖ్యవిషయం. మన వ్యవసాయరీతులలో చాలా మార్పులు రావాలి. తయారు ఎరువుల (Artificial Fertilisers) విలువను గుర్తించి, విరివిగా వాడాలి. అదే భూమిలో వందలాదిసంవత్సరాలుగా పంటలు పండిస్తూ వుండడంవల్ల భూసారము తగ్గి పోయింది. పోయిన ధాతువులను ఎరువులద్వారా మళ్లీ భూమికి అందజెయ్యాలి. ఈ ఎరువులలో ముఖ్యమైనది సల్ఫేట్ (Ammonium Sulphate). దీనిని చౌకగా తయారుచేసే విధానము ౩౦ సంవత్సరాలనుంచీ తెలుసును. భూమికి దాని ఆవశ్యకతకూడా బాగా గుర్తించ బడింది. కాని దీనిని మన ప్రభుత్వము రెండుమూడు సంవత్సరములక్రితమే గుర్తించింది. బీహారులో సింద్రీ అనేచోట దీనిని తయారుచెయ్యడానికి ఒక ఫేక్టరీ గవర్నమెంటువారు కడుతున్నారు. అది ఒక సంవత్సరము లోపుగా సాలుకు ౧౦ లక్షలటన్నుల సల్ఫేటును తయారుచేసుంది.

వరి, గోధుమపంటలేకాకుండా దుంపలపంటలు కూడా అభివృద్ధిచెయ్యాలి. వాటిలో ముఖ్యంగా చెప్పవలసింది బంగాళాదుంప. ఈ దుంపల పంటకు ఎక్కువ నీటిసదుపాయం అక్కరలేదు. ఎకరం ఒక్కంటికి పంటకూడా ఎక్కువ. దుంప పదార్థాలే కాకుండా, కొన్ని కొత్తపంటలు మనదేశంలో పండించాలి. వాటిలో చెప్పదగ్గది సోయాబీనులు. సోయాబీనులు చైనాలో చాలా ఎక్కువగా పండి స్తారు. ఈ మధ్య రష్యాలోనూ, అమెరికా సంయుక్త రాష్ట్రములలోనూకూడా సోయాబీనులను పండిస్తు న్నారు. సోయాబీనులలో బియ్యములోకంటె చాలా ఎక్కువగా క్రొవ్వుపదార్థాలు, ప్రోటీనులు, వైటమినులు వున్నాయి. సోయాబీనుపిండిని అనేకవిధములుగా వుపయోగించవచ్చు: గోధుమపిండివలె రొట్టెలు, ఫలహారములకే కాక, సోయాబీనుపాలు తయారుచేసి మామూలుగా పాలు వుపయోగించే అన్ని విధాలగానూ వుపయోగించవచ్చు. పైగా, సోయాబీనులు పారిశ్రామికంగాకూడా చాలా ముఖ్యము. ఇది చైనావారి ఇంద్రజాలపుపంట (Magic Crop). దీనిని మన దేశంలో పెంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

తరువాత మనం కూరగాయలూ, పండ్లను గురించికూడా చూడాలి. ప్రస్తుతం మన దేశంలో కూరగాయలపంట ౯౦ లక్షలటన్నులు. అందులో ౭౦ లక్షల టన్నులు బంగాళాదుంపలు. మిగతావి మామూలుకూరలు, ఆకుకూరలు. చలిగావున్న కొండప్రదేశాలలో కొన్నిచోట్ల కేబేజి, కాలిఫ్లవర్ పంట వున్నది. పండ్లు పండించే భూమి ప్రస్తుతం ౧౫ లక్షల ఎకరాలు. అందులో ౧౧ లక్షల ఎకరాల మామిడి, ౩ లక్షల ఎకరాల అరటి, ఒకలక్షఎకరాల లోపుగా నిమ్మ, నారింజ, బత్తాయికి వుపయోగింపబడుతోంది. మొత్తం పండ్లపంట ౬౦ లక్షల టన్నులు. కూరగాయలపంట, పండ్లపంట ఎన్నో రెట్లు ఎక్కువచెయ్యాలి. వాటిని పండించడమేకాకుండా, దాచుటకు చలిగదులు (Cold Storage Houses), దూరప్రదేశాలకు పంపేందుకు పండ్లఫేక్టరీలు (Fruit canning Works) కూడా స్థాపించాలి.

తరువాత పాలసంగతి చూద్దాము. మనదేశంలో ప్రస్తుతపుఉత్పత్తి ౨౩౦ లక్షల టన్నులు. అంటే సగటున మనకు దొరికేపాలు ౫ ఔ. కాని మనకు కావలసినది ౧౦ ఔ. పైగా, మన దేశంలో చాలామంది శాకాహారులు కాబట్టి సగటున మరొక ౫ ఔ. ల పాలు కావలసివస్తుంది. అందుచేత మన పాల పరిశ్రమ నాలుగయిదురెట్లకు పైగా పెరగాలి.

ఈ విధంగానే మాంసపరిశ్రమ, చేపలపరిశ్రమ కూడా అభివృద్ధికావాలి. ఇవన్నీ అభివృద్ధిపొందేవరకూ మనదేశంలో అందరికీ తగినంత తిండి వుండదు. తగినంత తిండి దొరకనంతకాలమూ మన మేరంగములోనూ ముందంజ వెయ్యలేము. ఈ ఆహారసమస్య రానున్న అయిదారు సంవత్సరములలోనూ తప్పక తేల్చబడునని ఆశిస్తున్నాము.

# వేదమూర్తులు

[నాటిక]

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

### ౧-వ దృశ్యం

[సాయంత్రం నాలుగ్గంటల వేళ. వైశాఖమాసం. ప్రవేశం పీసపాటి బ్రహ్మావధానులుగారు. ప్రయాణం చేసి అలసివచ్చినట్టు కనబడుతున్నారు. ధుమధుమలాడుతూ వచ్చి...సావట్లో ఉన్న చాపమీద అంగవస్త్రంతో కొట్టి...చదికిలబడి...]

బ్రహ్మ—(కోపంగా) వేషాలు వేస్తాడు... వేషాలు... నా దగ్గర... ఛ— ఇలాటివాళ్లని... కోటిమందిని చూశాను. కోటిమందిని...

(లోపలికి చూసి) ఇంట్లో ఒక్కరూ కనపడరేం...పెరట్లో దిగమారిపోయారు గావును...కాస్త వేసంగి అంకురిస్తే చాలు...ఇంట్లో కూచోలేరు. గాలి కావాలి, గాలి. దొంగా డెవడేనా దూరి ఇల్లు చక్కబెట్టుకుపోతే...ఇంక అంతా వాయువే...

ఇదిగో...నిన్నే...ఇంట్లో ఉన్నావా? ఎక్కడేనా అణిగిపోయావా? ... పాదప్రక్షాళనానికి...పెద్ద చెంబుతో నీళ్లూ...ఇంత మంచితీర్థమూ తగలెయ్యి...

అబ్బబ్బ—ఎండ లెలా మండిపోతున్నాయి—ఇప్పటివాళ్ల బుద్ధుల్లాగనే......

వేషాలు...నా దగ్గర...

గుడ్డొచ్చి (వెటకారపు నవ్వు) పిల్లని బెదిరించిందట......

(లోపలనుంచి సన్నంగా)

—వస్తున్నా...

—తెస్తున్నా...

బ్రహ్మ—ఓయి రామచంద్ర ప్రభూ! అంత వరకూ అణిగిఉంటారా—అల్లుడూ అనగానే వస్తుందండీ ఎంత తెగనీలుగైనా ... వెనకటికి ... గడ్డిపోచని అల్లుడూ అంటే...లేచి ఆడిందట; ఊరికే అన్నారా మహర్షులు— 'జామాతా దశమో...'

(సుభద్రమ్మ గారు—అవధానులు గారి భార్య ప్రవేశం)

సుభ—అప్పుడే...వచ్చారూ కొత్తపేటనుంచి? ఎంత ఎండపడ్డారూ! పన్ల తొందరేగాని ఒంటిసుఖం చూసుకోరమ్మా ఈ మనిషి...ముందు బోలెడు పెళ్లి పన్లు...అమ్మాయి సత్యవతీ, పిల్లలూ ఖులాసాగా ఉన్నారా? వెర్రిపిల్ల...ఇక్కడ ఉన్నప్పుడు పాకులాడ్డమే గాని అత్తారింటికి వెడితే ఒక్క ఉత్తరం ముక్కైనా రాయించదు. బద్ధకంమనిషి...అతను ఇంటి దగ్గిరే ఉన్నాడా? అల్లుడు శేఖరం...లోప లేమీ ఉండదు! పైకిమాత్రం అవోలా......

బ్రహ్మ—(చ్రుమని) వాడిపే రెత్తకు...నా దగ్గర...వేషాలు...వేస్తాడు...వేషాలు...నాదగ్గర... వేషాలు...

సుభ—(తెల్లబోయి) అదేమిటండీ?... అదేదో ఘనా...జటాలా పట్టుగున్నారు... వేషా లేమిటండీ... నా మొహం. అతనికి నాటకాల్లో సరదాగాబోలు... సరదా కొద్దీ దేన్లోనేనా వేశాడేమో ... అయితే మనకేం......

బ్రహ్మ—(విసుగ్గా) నీ మొహం...నా మొద్దులూనూ.

సుభ—చాల్లెద్దురూ—ఏమిటా మాటలూ... శుభం మళ్లే......

(ప్రవేశం—వామనయాజులు. అవధానులుగారి తమ్ముడు. ఒక పాడుంపట్టు ధ్వనిప్రధాన కావ్యంలా పీల్చి చెయ్యి దులుపుతూ...వచ్చి)

యాజులు—ఎంత సేపయింది పేటనుంచి వచ్చి? ఏమిటమ్మా వదినా...విశేషాలు...?

సుభ—(ముభావంగా)మీ అన్నయ్య నడగండి.

యాజులు—పేటలో...శేఖరం...అమ్మాయీ పిల్లలూ అంతా సుఖంగా ఉన్నారా? అన్నయ్యా, పిల్లల్ని తీసుకుని నాలుగురోజులు...ముందుగా రమ్మనకపోయావా? నిండుగానూ చేదోడుగానూ ఉండును.

బ్రహ్మ—అక్ఖర్లేదు. ఎవ్వడూ రానక్కర్లేదు నా యింటికి. ఒస్తే వాళ్ల ముఖం చూడను.

యాజులూ! చూడు. ప్రేమానుబంధాలు...పెట్టుకున్న కొద్దీ మనం అణిగిపోతాం. తెగ్గోసిపారెయ్యాలి. నా కొడుకు పెళ్లి జరక్కపోయినప్పుడు చూస్తాను. వీ రెవరూ వచ్చి ఉద్ధరించక్కర లేదు. ఏమిటో...ఆడది—దేవులాడుతుంది గదా...అని కదిలాను. గాని...

సుభ—ఏమిటో...ఏం చెప్పను. అంతా అయోమయంగా ఉంది నాకు...

యాజులు—చెప్పేదేమిటి వదినా? అన్నయ్య మనస్సుకి ఏదో కష్టం కలిగింది. లేకపోతే పిల్లంటే... పంచప్రాణాలుగదూ అతనికి......కాకపోయినా ఆ శేఖరం...ఉన్నాడే...చెప్పొద్దూ...కొంచెం...

బ్రహ్మ—కొంచెం అంటావేం? మెల్లిగా...ఆ తలవిసురు కెక్కడేనా హద్దుందీ?...విను. రైలు దిగి కొత్తపేట వెళ్లేసరికి పదిగంటల పొద్దెక్కింది.

యాజులు—ఆఁ, ఏం జరిగిందీ...?

బ్రహ్మ—ఆపళంగా ... గుమ్మంలో అడుగు పెట్టాను. ఒక పద్యాలా...రాగాలా...పాటలా... వాళ్ల మొహాలా...కచేరీ సావడి ఎగిరిపోతోంది. పడక కుర్చీలమీదా...కొయ్యకుర్చీల మీదా ఏడెనమండుగురు ప్రముఖులు, కూచున్నారు. ఏ కులమో తెలీదు గదా—క్రాపింగు జుట్టులు, సికిరెట్టులు...తెల్లార కుండా తాంబూలాలు. మధ్య ఒకదాన్లో ఈయన. ఒక పుస్తకం చదువుతున్నాడు. వీరంతా విరగబడి ఒకటే నవ్వులు...

సుభ—అతను రాసిందేదో స్నేహితులకి వినిపిస్తున్నాడు గాబోలండీ... ఈ కాలపువాళ్ల దంతా అదో...వరస...

బ్రహ్మ—అఘోరించాడు లే. వెయ్యిమాట్లు చిలక్కి చెప్పినట్టు చెప్పాను. "వైదికపాళ్లకి కవిత్వం ఏమిటోయ్, ఏదైనా నాలుగురాళ్లు సంపాదించేమార్గం చూడు. ఈ కవిత్వాలూ...పత్రికలూ తిండి పెడతాయా?" అని. ఋషితుల్యులు మా నాన్నగారు అనేవారు. కవిత్వం చెప్పేవాళ్ల చేతిలో కానీ ఉండదని శ్రీ మహావిష్ణువు శపించాట్ట. చూస్తున్నాం గదూ... నెలా వచ్చేటప్పటికి గిలగిలలాడుతూ ఉంటాడు.

సుభ—పోనిద్దురూ...ఒకరికి ఈడు తియ్యకుండా గౌరవంగా కాలక్షేపం చేస్తున్నాడు. మన్నేమీ అడగడం లేదుగదా...

బ్రహ్మ—అ...డ...గడం లేదు. పొడుచుగొచ్చింది...అభిమానం...పైమీద గుడ్డతో తోవే పోయేవాణ్ణి తీసుకొచ్చి కన్యాదానం చేశాను. ఇంకేం చెయ్యాలి? డబ్బువిషయంలో మాత్రం పిటకరాయిలాంటి ముండాకొడుకుని...నా దగ్గర తీసెయ్యి...ఆ శషభిషలు...నట్టింట బుట్టినవాళ్లకే దిక్కులేదు నా గీత దాటితే...నడింగా వచ్చినవాళ్లకొచ్చిందా?

సుభ—కానియ్యండి. నా కెందుకు—

యాజులు—మీ రుండండి వదినా—వాటికేం గాని...తర్వాత ఏం జరిగింది? శేఖరం చూశాడా?

బ్రహ్మ—అదే విశేషం. నీ కేమేనా వెర్రా ఏమిటోయ్—ఎందుకుచూస్తాడు, కళ్లు నెత్తినఉన్నాక. పుస్తకం అడ్డం పెట్టుకున్నాడు. తక్కిన కుంకలు 'భేష్...అద్భుతం' అని తల ఊపుతూ ఉంటే...ఈయన ఒళ్లు విరుచుకు చదువుతున్నాడు.

యాజులు—(ఎరగనట్టు) వాళ్లుకూడా చదువుకున్నవాళ్లే గాబోలు—

బ్రహ్మ—ఏడిశారు.అన్నీ నాటకంమొహాలు... ఒకడిమొహాన్నీ చదువుకున్న వర్చస్సు ఎక్కడా లేదు. బాగా కుదిరింది జట్టు. ఊరికే ఘోషించిందా వేదం, ఈ బాపతంతా పంక్తిబాహ్యులని...

యాజులు—బాగానే ఉంది. తలెత్తలేదేం?

సుభ—మీరు వచ్చినట్టు చూడలేదేమో...లేక పోతే శేఖరం అంత అమర్యాదస్తుడా?

బ్రహ్మ—తెకులు! వీడు చూస్తే ఎంత, చూడక పోతే ఎంత? ఘుందుజాట్లూ...ముక్కుద్దాలూ తప్ప ఇల్లుకొడితే తప్పైకు పెంకులు లేవు...ఎవడు నిలబడ తాడో నిలబడమనూ ఈ ప్రాంతంలో నా దగ్గర... పీసపాటి బ్రహ్మవధాన్లూ అంటే శ్రౌతస్మార్తాల్లో... మనమాట మనం అనగూడదు గాని...దండంబెట్టి తప్పు కోవలిసిందే...గ్రాసానికి లోటా?... పాతికెకరాల సుక్షేత్రఖండిక. గుమ్మం దిగక్కరలేదు...వీడి లక్ష్యం నా కేమిటి? పిల్ల ఉంది గనక......

సుభ—(నవ్వి) పోనీండి. అందుకే వెళ్లారు... పిల్ల కనపడిందా? సత్యం ఏమంది?...ఖులాసాగా ఉందా?

బ్రహ్మ—(అసంతృప్తిగా) ఆఁ, అంతా బాగానే ఉన్నారు...సావిట్లోంచి ఇంట్లోకి వెళ్లాను. అమ్మాయిని చూద్దామని. అప్పుడే వంటయిపోయింది. ఆశ్చర్యపడిపోయాను. అమ్మాయి ఎలా తేలిందని! పక్క పాపిడిజడా...మడత చీరా...కుర్చీలో కూచుని ఏదో నవలో గివలో చదువుతోంది...నాకు కంపర మెత్తి పోయింది. వట్టి కిరస్తానం!!...నా యింట బుట్టిన పిల్ల ...పట్టపగలు...తెల్ల చీర కట్టుగుని...పుస్తకం చదవ డమే...బాగా తయారుచేశాడు. మహానుభావుడు... అగ్నిష్టోమం చేసిన కొంపలో పుట్టిన పిల్లని......అన్ని మాలకూళ్లూ నట్టింట్లోకి ఆహ్వానిస్తాడు గదా. ఎలాంటి కుటుంబంలో పుట్టాడు—దర్భా వారంటే...ఆత్రేయ పౌరుషేయాల్లో ఓహో అనిపించుకున్నారు...అలాంటి చోట పుట్టి...నాటకాల జట్టు...ముతగ్గుడ్డలవాళ్లు... సభలు...చట్టుబండలు... ఈ గాంధీ...ఉన్నాడే... మన కొంపకు...గాని...స్వరాజ్యం తెస్తారుట వీరంతా ...సన్యాసుల్లాగు కాషాయజెండాలూ...వీళ్లూ...

యాజులు—ఆఁ, స్వరాజ్యం అంటే జ్ఞాపకం ఒచ్చింది...ఈ మధ్య శేఖరం కూలాళ్ళమీదా... గుడ్డాళ్ళమీదా కవిత్వం ప్రారంభించాట్ట...ఏ ప్రభు వునో ఆశ్రయిస్తే లాభిస్తుంది గాని...ఈ బైరాగిజట్టును పట్టుకుంటే ఏమొస్తుందయ్యా తెలియక అడుగుతాను.

బ్రహ్మ—జోగి జోగి రాసుకుంటే...బూడిద రాలిందిట......కుబేర్రాయణిం గారు ఎంత దొడ్డ ప్రభువు! మొన్న వా రెందుకో కబురంపితే ఈ ప్రబు ద్ధుడు...నా కిప్పుడు అన్నాట్ట.

జమీందార్లకి కుక్కలమీదుండే ప్రీతి కవుల మీద ఉండదుట. బయలుదేరాడు మొనగాడు, ప్రభు వుల్ని ఆక్షేపించడానికి. శ్రీవారికి లోటా? కో అంటే కోటిమంది. 'కర్తవ్యో మహదాశ్రయహ'... పని కొచ్చే లక్షణం...ఒక్కటి లేదు...ఎందుకూ...

సుభ—(విసుగ్గా) సరే...అల్లుడి ఆశీర్వచనాలు అలాఉంచండి. ఇంతకీ...అమ్మాయిని పెళ్లికి పిలి చారా? లేదా?

బ్రహ్మ—నాయిష్టం ఒచ్చినట్టు చేశాను. నా యింట్లో ఆడపీనుగు నోరెత్తితే నే నొప్పుకోను. నా మాట అలా జరిగిపోవలసిందే...

యాజులు—(నెమ్మదిగా) అదిగాదయ్యా... అమ్మాయి ఏమంది?...పంపుతా డందా? ఎప్పుడొస్తా నంది?

బ్రహ్మ—(బిగువుగా) నాధర్మం ఏదైతే ఉందో అది నేను నెరవేర్చాను. తర్వాత నాకు పూచీ లేదు. భోంచేసి వెళ్లమంది. అ...వ్వ...(నోటిమీద చేయి అడ్డంపెట్టుకున్న చప్పుడు) ఆ కొంపలో నాకు భోజ నమా? మడిగట్టుకు ఒండుతా నంది. వెర్రిబాగుల్ది. దాని మడి నాకు పని కొస్తుందా! దేవతార్చన చేసుకొనే ముండాకొడుకుని...ఒద్దన్నాను...ఆయనతో గూడా చెప్పాలిట...ఆ...య...న. అదృష్టంకొద్దీ దొరికాడు ...ఒక్కనిమిషం అక్కడ ఉండనన్నాను...గిర్రున తిరిగి చక్కావచ్చాను.

సుభ—(నిశ్చేష్టితురాలై) ఇదా మీరు చేసు కొచ్చిన పని? (జాలిగా)పాపం-వెర్రిపిల్ల - తమ్ముడు

పెళ్ళి అని ఎంత సరదాపడింది! ఇంకెలా వస్తుందీ? ఇంకది రానట్టే మరిదిగారూ!

బ్రహ్మ—(ఉగ్రుడై) రానక్కర్లేదు. వస్తే మాటాడ్డానికే వీలులేదు. తెలిసిందా...మాటాడారో ఎవరైనా, తలకాయ గోడకు కొట్టుకు చచ్చిపోతాను...పో...వెళ్లు...నా కక్కనపడకు......

......ఒరేయ్ సీతాపతీ, సీతాపతీ!......గదుల్లో మణిగిపోతారు. ఒక్కరూ కనపడరు.

సీతాపతి—(ప్రవేశం) ఏం...నాన్నా...చదువుకుంటున్నాను.

బ్రహ్మ—(వెక్కిరింపుగా) అంటుకుపోతోంది...చదువు ... ఊస్కూలు ఫైనలు రెండుమాట్లు దండయాత్ర అయింది. ఈమాటు ఏమవుతుందో.....ఆ పంచాంగం ఇలా పడెయ్యి...

(సీతాపతి పంచాంగం తెచ్చి పడేస్తాడు)

బ్రహ్మ—ఏం అలా పెట్టావు మొహం?...ఉన్నాయి...తామసాలు...తెలివి...తేటా మాత్రం శూన్యం...అయినింటబుట్టి...ఒక సంధ్యావందనమూ...నమకచమకాలా? కొంపపరపతి నాతో ఆఖరు......

సీతా—(ఉడుకుబోతుతనంగా) అస్తమానం...తిట్టకపోతే...పోనీ, ఈ చదువు మానిపించెయ్యకూడదూ...

బ్రహ్మ—ఏమిటీ? ఏమన్నావ్...ఈ చదువు మానిపిస్తే...ఎవడిస్తాడురా...రెండువేలు...నీ విఘ్నేశ్వరపూజ మొహానికి...దయచెయ్యి.........ఇంగ్లీషు ముక్క ప్రయోజనం కుర్రనాగమ్మ వీడికేం...తెలుసు...?

ఊఁ, యాజులూ! ఇలా చూడు. చవితి...వెళ్లగా పంచమి. వర్జ్యంగూడా వెళ్లిపోయింది...ఆ సంగతి మాటాడుకుందాం...ఏమన్నారు వారు?

యాజులు—అంత ఇచ్చుకోలేమనీ...అయిదువందలు దయఉంచి తగ్గమనీ...ఆడబడుచులాంఛనాలు ఎలాగా ఇస్తామనీ చెన్నుగారిచేత కబురంపారు.

బ్రహ్మ—(చర్రున లేచి) రెండు సంచులకూ గవ్వ తగ్గమని తక్షణం కబురంపించెయ్యి. ఆడబడుచులకు ఇవ్వకపోతే...మానెయ్యమను. వాళ్లకిస్తే నాబళ్లో ఏమేనా...ఒరుగుతుందా...అసలు...నా తాతగాని...తండ్రిగాని కట్నాలు పుచ్చుకు ఎరుగుదురా? బ్రహ్మర్షులు...కాలాన్ని బట్టి మారకతప్పదుమరి...కనక పుచ్చుకోవలసివచ్చింది. ఆ కుర్రకుంకని బియ్యేదాకా చదివించాలా? ఎక్కణ్ణుంచి తెస్తాను?

యాజులు—ఒప్పుకుంటారు. ఊరికే మాట వేసి చూశారు ఏం పలుకుతుందో అని...

బ్రహ్మ—ఏం? తీపుదిగదీసిందా ఒప్పుకోక—హాహ్హాహ్హా! తపస్సుచేస్తే దొరుకుతుందీ నా సంబంధం? పిల్లను చూపించకుండా పిల్లాణ్ణి తొక్కిపెట్టి...ఒప్పించాను. అది మన కుటుంబగౌరవం కాదన్నాను. అంతే. నే చెప్పినట్టూ...వారికి...ఏది...

యాజులు—ఆఁఆఁ అలాగే...తక్షణం. మన కాస్తైట్టే వ్యవధి లేదు. తక్కిన పన్లుగూడా చరచరా చూసుకోవాలి...

బ్రహ్మ—ఎంత? మనం తలుచుకుంటే. నువ్వు రేపు పట్నం వెళ్లు. ఇక్కడ పందిళ్లూ పాకలూ నేను చూస్తాను. బంధువుల పిలుపుకి రామదీక్షితుల్ని పంపుతాను.

యాజులు—అయితే బాజాబజంత్రీలకు చెప్పిస్తాను. కాని...మనవాళ్లు...బాండు...

బ్రహ్మ—పెట్టించవయ్యా. ఫలానావారింట్లో పెళ్లంటే దేవదుందుభులు మోగాలి...చిన్న సన్నాయి గూడా తగిలించు కావలిస్తే......అయితే—లాభసాటిగా చూడుమా. పడిపోతాం.

యాజులు—అన్నయ్యా, ఆ మాట చెప్పాలా నాకు?

బ్రహ్మ—పద. సంధ్యాకాలమయింది.

## ౨-వ దృశ్యం

[ఉదయం. చంద్రశేఖరంగారి ఇల్లు. శేఖరం పడకకుర్చీలో కూచుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. నవీనవేషం. తెలివి కనపడే ముఖం....చిన్న కొడుకు సుందరం...హఠాత్తుగా వీథిలోంచి పరిగెత్తుకుంటూవచ్చి...]

సుందరం—నాన్నా, నాన్నా! అమ్మ నిన్న నేం...తాతయ్యగారి నూతిలో...

చంద్ర—ఆఁఆఁ, అమ్మా? నూతిలో పడిందా? ఏమి టీదారుణం? బతిగిందా?...చెప్పు.

సుందరం—పడీపడగానే వెంటనే వెంకట్రావు బాబయ్య ఉరికి తీశాడు. ఇప్పుడు నెమ్మదిగా...పడు కుని ఉంది.

చంద్ర—(తేరుకుని) అమ్మయ్యా...బతికింది గదా...ఎంత సాహసం చేసింది!

సుందరం—నాన్నా! నే నేం...నిజంగా హడిలి పోయాను.

చంద్ర—పిచ్చిమనిషి—శతవిధాల చెప్పాను- 'నిన్నక్కడ ఎవరూ తిన్నగా చూడరు. మీఅమ్మమాట నెగ్గదు. మీ నాన్న కర్కోటకుడు. మాటపట్టింపే గాని ...మన పేగుగదా అని చూడడు. అగౌరవం భరించ లేవు.' అని ఎంత చెప్పినా వినందే...మాచెల్లెల్ని చూడా లనీ, అమ్మ ఏడుస్తుందనీ, తమ్ముడు పెళ్లికోసం ఎన్నాళ్ల నుంచో ఉవ్విళ్లూరుతున్నాననీ, మాయింట్లో నాకు అడ్డేమిటనీ మొండిపట్టు పట్టి నిన్ను తీసుకువెళ్లింది—అనుభవించింది—పాపం ఎంత బాధపడిందో అమాయకు రాలు...

ఏంజరిగింది సుందరం?

సుందరం—నిన్న సాయంత్రానికి పాతపేట వెళ్లాం అమ్మా, నేనూను. వీధిలో అరుగుమీద కూచుని తాతయ్య పందిళ్లు వేయిస్తున్నాడు. అమ్మ చరచర బండిదిగి గుమ్మంలోకి వెళ్ళి 'నాన్నా, పెళ్ళిపనులన్నీ అయినట్టేనా' అని తాతయ్యని పలకరించింది. తాతయ్య ఇటువేపు చూడకుండానే...'వెళ్లువెళ్లు. ఇంట్లో మీ అమ్మ ఉంది.' అని అరుగు దిగి ఎక్కడికో వెళ్లిపోయాడు. అమ్మ తెల్లబోయింది. లోపలికి వెళ్లాం. అమ్మమ్మ గుడ్లనిండా నీళ్లు పెట్టుకుని చూస్తూ ఊరుకుంది. మామయ్య గదిలోంచి ఇవతలికి రాలేదు. పిన్ని కనబడనే లేదు. అమ్మ గబగబా కాళ్లు కడుక్కువస్తానని పెరట్లోకి వెళ్లింది. దభీమని చప్పుడయింది. అంతా పెరట్లోకి పరిగెత్తాం. బాబయ్య దిగి తీశాడు.

చంద్ర—బాగానే ఉంది. అన్నయ్య ఏడీ? భద్రం, భద్రం!!

భద్రం—(ప్రవేశించి) ఏం నాన్నా...?

ఇదుగో సుందరం—పాతపేటనుంచి ఎప్పు డొచ్చాడూ?

చంద్ర—విన్నావా సంగతి?

భద్రం—ఏమిటి?

చంద్ర—మీ అమ్మ...నూతిలో పడిందట. చప్పున వెంకట్రావు ఉరికి తీశాడట. చూశావా పుట్టింటి సౌభాగ్యం......?

భద్రం—అసలు అమ్మను వెళ్లనివ్వకూడదు. తాతయ్య వచ్చి...ఆప్యాయంగా ఒకపూట ఉండి... సలక్షణంగా మిమ్మల్ని పెళ్లికి పిలవనప్పుడు...అమ్మ వెళ్లడంలో ఏం నవబుంది? పొరపాటుచేశారు...ఎంత ప్రమాదం దాటింది?

చంద్ర—(వెగటుగా నవ్వి) మామగారి శరీరా నికి ముసలితనం వస్తూన్నకొద్దీ అహంకారానికి మాత్రం యౌవనం పొంగుతోంది. ఎందుకూ...వేదాలు చదివారు. ఉపనిషత్తులు ఒప్పజెబుతారు. ఒక్కముక్క లోపలికి ఇంకలేదు.

నిజంగా చూస్తే...జాతి అధఃపతనానికి విదేశ నాగరికత కాదు. ఈ శుష్కఛాందసులే ఎక్కువ తోడ్పడ్డారు...

భద్రం—పైగా...ఇంటికి వస్తే మీరు మాటాడ రనీ...కోరి అగౌరవపరిచారనీ, మీగర్వానికి మితిలేదనీ యాగీట...విన్నారా?

చంద్ర—మొన్నకు మొన్న మామగారు ఎప్పుడు వచ్చారో ఎప్పుడు వెళ్లారో...దైవసాక్షిగా నాకు తెలి యదుసుమీ. మీ అమ్మ చెబితే...ఆశ్చర్యం వేసింది!

భద్రం—ఆయన మహా మనకుచూపిన ఆదరాభి మానాలేమిటి? పోనిస్తురూ...ఇంటికి వెడితే కొంటిపిక్క పెట్టేట్టు మాట్లాడ్డమేగాని...ఒక్కనాడు మీతో మన స్ఫూరా మాట్లాడాడూ?...చెయ్యనివ్వండి యాగీ... లోకం మిమ్మల్నీ ఎరుగును.

చంద్ర—పోనిద్దూ. ఏంచేసినా పెద్దవాడు. వేదవృద్ధు. అందుకు గాదుగాని.. అంతవాడు అబద్ధాలు చాటించడమా అని నా విచారం.

భద్రం—(ఎగతాళిగా) ఒక్క నమకపారాయణతో అన్నీ చెల్లు. ఆయనకేమిటి మహానుభావుడు... మనకూ భయం...ఏమైనా ఉంటే గింటే......

చంద్ర—(నవ్వి) తప్పు. తాతయ్యని అలా అనకూడదు. అంత దురుసు పనికిరాదు నాన్నా...

భద్రం—(కోపంగా) యోగ్యులెగ్గి పనికిరావు. నిజమే. ఇక్కడ ఇది గాదు మార్గం......ఒరే సుందరం! లే...తాతయ్యగారింటికి వెడదాం నా హాల్దాలూ...పెట్టె సర్దుకువస్తున్నాను నిమిషంలో.

చంద్ర—భద్రం! ఏమిటిది?

భద్రం—ఏమీ లేదు. అమ్మ ఇంకక్కడ ఒక్క గడియ ఉండడానికి వీల్లేదు. సుందరం నాతో వచ్చి తక్షణం అమ్మను తీసుకువస్తాడు. నేనొకసారి పట్నం వెళ్ళి నాలుగురోజులుండి...మామయ్య పెళ్ళికి వెడతాను. నన్నొకరు పిలవక్కర్లేదు.

చంద్ర—నీ ఉద్దేశం బోధపడ్డంలేదు భద్రం!

భద్రం—మామయ్య పెళ్ళి ఎలా జరుగుతుందో... చూస్తాను...

చంద్ర—అంటే?

భద్రం—క్షమించండి. ఇప్పుడు నన్నడగొద్దు. సుందరం, రా. గైలు దాటిపోతుంది. (సుందరంతో బయలుదేరి తోవలో)

భద్రం—(గొంతు కొంచెం తగ్గించి) చూడు, సుందరం! నేను చెప్పినట్టూ జ్ఞాపకం ఉంచుకో. అక్కడికి వెళ్ళి చెప్పటం చే...నువ్వు నాన్నపక్షం; నేను తాతయ్యపక్షం. ప్రతిమాటా అలాగే మాట్లాడుకుంటాం. వెంటనే నువ్వు నాన్న తీసుకు రమ్మన్నాడని అమ్మను తీసుకు చెక్కాలిరా. నేను... ఆపైన నా పని చూస్తాను.

సుందరం—సరే. పద.

### 3-వ దృశ్యం

[పెళ్ళివారి విడిది. దీపాలవేళ. పెళ్ళికి ముందు జరిగే హంగామా...బాకా ఎత్తి సాయబు చెవులు ఖంగుమనేలా ఒకసారి ఊది ఊరుకున్నాడు. సన్నాయి డోలు చప్పుడుతో విలక్షణంగా చల్లగా మోగుతూంటుంది. హడావడిగా ... బ్రహ్మావధానులుగారు విడిదిలోంచి పందిట్లోకి వచ్చి...]

బ్రహ్మ—అఁ అఁ, నెమ్మదిగా.....పందిట్లోకి రానీయండి బల్లు...

యాజులూ, యాజులూ!......ఒక్కరూ సమయానికి కనపడరు...

అనంతం! మామయ్య...ఆ బరకాలు...సావిట్లో ... ఒరే నిలయ్య, విసనికర్ర లేవిరా?

శతవిధాల చూస్తున్నా.....ఒక్కడికీ చురుకు లేదు.

రామ్మూర్తి! అప్పాల కంజాయింపు...పిల్లో... ఏదో సక్కుమాలిన పేరు...ఆ లైట్లు వ్యవహారం... నువ్వు దఖలు పుచ్చుకోవాలి సుమీ! ఆ శయ్యానం ఏదీ...ఎగిరిపోయాడు అప్పుడే ఎక్కడికో...పెట్టి 'తెప్పిస్తా'నని చెప్పి ఉన్నాడే. రమణయ్యా! నీ బద్ధకం తగలెయ్యా! ఆ ఆవలింత లేమిట్రా?...లే, ఆ ఎదురు సన్నాహానికి ఏం కావాలో చూస్తే తెప్పించరా...

ఇదిగో...శాస్త్రులు బావగారు! దయచెయ్యాలి దయచెయ్యండి. సుదినం. శ్రమ అనుకోకుండా దయ చేశారు.

అయితే...సీతమ్మక్కయ్యా. రుక్మిణి పిల్లలూ ఏరీ...ఇదిగో.....మాటల్లోనే వచ్చారు. అక్కయ్యా! లోపలికి పదండి...లోపల మీ వరాలు....ఇదిగో.... నిన్నే...అక్కడేం చేస్తున్నావ్? అఁ, రుక్మిణీ, నీ మగుడు రాలేదుగదూ...సరే లే...అతని కూతురు పెళ్ళికి నేనూ ఇలాగే చేస్తా......హా హాహా ...గడుసుదానవు.... పద లోపలికి. చాలా ఎండబడివొచ్చారు. (సన్నాయి అనుతుంది.)

(ప్రవేశం : సుభద్రమ్మగారు)

శుభ—పట్నంనుంచి ... కర్పూరదండలూ... పువ్వులూ...బట్టలూ ఇంకా ఏమీ రాలేదు....

బ్రహ్మ—(ధీమాగా) అన్నీ వస్తాయి. దివ్యచక్రంగా అరణ్యం మెంటుచేశాను...వందలకొద్దీ పెళ్ళిళ్లు నతిమీద నడిపిన మండాకొడుకుని....నాకు చెప్పాలీ నువ్వు! గడియలోనో గంటలోనో అన్నీ పట్టుకుని... భద్రం కారులోంచి దిగుతాడు.

శుభ—(వింతగా) ఎవరూ? మన పెద పిల్లగారి...భద్రమేనా?

బ్రహ్మ—ఒక్క దెబ్బని—తండ్రికీ వాడికీ పోలిక ఉందీ? బంగారంలాంటి కుర్రాడు. వాడి యోగ్యతే వేరు. కోపమొచ్చి తల్లి వెళ్తూఉంటే...ఏమన్నాడు? 'వెళ్లనీండి తాతయ్యా! నాన్న రాకపోతే దిగడిందా? నే నుంటాను. నాన్న మీ మనస్సు కనిపెట్టలేక పోయాడు. ఇలాంటప్పుడు సహాయపడకపోతే....ఎందుకూ మేమంతా ఉండీ? ఏం కావాలో చెప్పండి. పట్నం వెళ్లి నిమిషంలో తెస్తాను'. అని చేతిలో పని అందుకు వెళ్లాడు. అదీ బుద్ధంటే!

శుభ—(నిరుత్సాహంగా) వాడి మొహం.... పులును చేదు...ముక్కలు తీసి...ఏమిటో ఎంత వైభవం జరిగితే ఏమిటి? ఎంతిమంది వస్తే ఏమిటి?..నట్టింటి పెద్దాడబిడ్డ చీరకట్టుకుని పందిట్లో కనబడక పోయాక... ఏంచేస్తాను...చేసిన పూజ అలాంటిది.

బ్రహ్మ—నిన్న ఆ చవటమాటే అనొద్దన్నాను. కట్టుకున్నవాడు రాలుగాయి అయాక...ముద్దుముచ్చట్లు ఎలా జరుగుతాయీ అంట—

శుభ—కన్నవాళ్లూ అంతే అయితే...

బ్రహ్మ—నోరు ముయ్యి. అట్టే నాకు పిపాళం త్రించక లోపలికెళ్లి...నీపని చూడు.

(కారుహారన్ మోగుతుంది)

అడిగో...భద్రం వచ్చినట్టున్నాడు...వచ్చావా ...బాబూ! ఏం బస్సులో రాలేదా? ఇంతాలస్యం అయిందేం?...సరే...ఒరే కాసీ! ఈసామాను లోపల పెట్టు

భద్రం—(ప్రవేశించి) అబ్బబ్బ-ఏమి ఎండలు పేల్చేస్తున్నాయ్! అసలు......బస్సులోనే ఒద్దామనుకున్నాను. బయలుదేరాను. తోవలో మాతో కాలేజీలో చదువుకొనే ఒక అబ్బాయి కనిపించాడు. అతనికి స్వంత కారుంది. మాటల ధోరణిలో సీతాపతి మామయ్య పెళ్లికి వెడుతున్నానని చెప్పాను. అతను గూడ మామయ్యను ఎరుగును. తోలిరోజు ఇద్దరూ స్కూలు ఫైనలు చదివారు. ఈ సంగతి విని అతిడూ సరదాపడి స్వంత కారులో వెడదామని బయలుదేరాడు. తోవలో కారు కొంచెం ట్రబుల్—అంటే కొద్దిగా ఇబ్బంది పెట్టింది. ఎట్లాగో కొట్టుకు ఒచ్చేశాం...

బ్రహ్మ—భేష్! రాజాబుద్ధి నీది...అయితే...

సీతాపతి—(చప్పున వచ్చి) భద్రం! వచ్చావూ? నీ కోసమే ఎదురు చూస్తున్నాం. తెచ్చావా? చెప్పినవన్నీ...ప్రకాశరావా? ఏడీ, కారులో ఉన్నాడా?

బ్రహ్మ—ఆఁ, పరిగెత్తు. కారుదగ్గికో, పట్టకారుదగ్గికో—ఏమి టాతొందర! ఏమి టా ఖంగారు? ఏదో మాటాడుతూంటే...ఎక్కడో పట్టిమొద్దూ...

సీతా—(చిన్నబోయి) నాకెందుకు లెండి. కానియ్యండి.

బ్రహ్మ—బాబూ భద్రం! ఆ గోతాం.... వెండిసామాను పెందుకుపెట్టే...నీ ఒద్దిలో ఉంచి జాగర్తగా చూడు.

భద్రం—వెయ్యికళ్ళతో చూస్తాను. ఇన్నిసార్లు చెప్పాలా తాతయ్యా?

బ్రహ్మ—ఒకేయ్, నీ తెలివిలో శతాంశం ఉంటే మీమామయ్య బాగుపడిపోను. చూడు, నట్టిబుద్ధావతారం. ఎంతసేపూ జుట్టు సవరించుకుంటూ....మాట నసుక్కుంటూ.. ఏం మనిషి?...

సరే. లేవండి త్వరగా...ఆ ఒచ్చినాయనకి ఏం కావాలో చూడు...వస్తా...పెళ్ళివారింటికి ఒక కబురు చెయ్యాలి...(వెడతాడు)

భద్రం—మామయ్యా...మాట...ఇలా రా...

సీతా—(సందేహిస్తూ) నాన్న 'తిడతాడేమో.

భద్రా—(నిర్లక్ష్యంగా) అంత హడలిపోతూంటావు గనకనే నిన్నాయన చలివిడిముద్దలా చేసి కూచో బెట్టాడు. రా! మాటాడక—

సీతా—పద—

బ్రహ్మ—లేవండి. లేవండి. పెళ్ళివారింటికి వెడదాం. లగ్నం సమీపిస్తోంది. అనంతం! విశ్వనాథ! నారాయణా! రమణయ్యా! ఏం బద్ధకాల్రా? ...యాజులూ! ఆ సీతాపతిని త్వరగా లేపి తీసకురా... చరచర మంగళస్నానాలు కావాలి. ఇదిగో...నిన్నే ...ఆ వెధవాళ్ళంతా గబగబ తెములండి నాన్నక...... భద్రం ఏడీ?......

యాజులు—(ఖంగారుగా వచ్చి) అన్నయ్యా... సీతాపతి ఎక్కడా కనిపించడం లేదు...భద్రం జాడా కనపడదు......

బ్రహ్మ—(తెల్లబోయి) ఆఁ, చూడవోయ్... చల్లగాలికి ఎక్కడో ఒరిగి ఉంటారు. లేపు—

యాజులు—లేరన్నయ్యా. విడిదంతా గాలించేశాం. ఏమిటో అంతా ఇంద్రజాలంలా ఉంది.

సుభ—(చరచరా వచ్చి) ఇదిగో...మిమ్మల్నే... మీ పెట్టెమీద ఇదేదో ఉత్తరంలా ఉంది చూడండి...

బ్రహ్మ—ఉత్తరమా......ఏమి టీదారుణం? యాజులూ, కళ్ళజోడు దగ్గర లేదు. చదువు—

యాజులు—సాహసం. ఇవి సాక్షాత్తూ సీతాపతి అక్షరాలే...

బ్రహ్మ—ఏమిటోయ్...ఏముందో చదువూ...

యాజులు—ఏదో...కొంపములక ఉంది. "శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ... నాన్నగారికి—సీతాపతి కృతానేక నమస్కారములు......"

బ్రహ్మ—ఏ....డి....సి...నట్టే ఉందిలే... మర్యాద...ఊఁ, తర్వాత...

యాజులు—"విస్తరించి వ్రాయడం అనవసరం. ఇంతవరకూ మీరు పన్నిన చీకటింట్లోనే కొట్టుకుంటున్నాను. పుణ్యాత్ముడు భద్రం వచ్చి కన్ను తెరిచాడు. రెండు వేల రూపాయలు మీరు హరించి పదేళ్ళ కొరకంచు కంగుపిల్లని నాకు కట్టిపెట్టడానికంతా సిద్ధం చేశారు. పిల్లని పెళ్ళికొడుకు చూసుకోవడం మన సాంప్రదాయానికి విరుద్ధమని నన్ను అణచిపెట్టారు. నిజమే అనుకున్నాను...కాని భద్రం రాగానే ఈ సంగతంతా చెప్పి, చాటుగా పిల్లని చూపించాడు. నా తల తిరిగిపోయింది...నేనూ, భద్రం నా స్నేహితుడి కారులో వెడుతున్నాం. మీరు మమ్మల్ని వెదుక్కునే సమయానికి మేము మీకు ఏభై మైళ్ళదూరంలో ఉంటాం. పట్టుకోడానికి ప్రయత్నించి శ్రమపడకండి.

మీ ఆస్తిగాని, ఐశ్వర్యంగాని నాకక్కరలేదు. స్వేచ్ఛగా బతకదలిచాను. సెలవు."

బ్రహ్మ—(పెద్దనిట్టూర్పు విడిచి) ఏమిటే..... భద్రమా!...వాడేనా ఈ ద్రోహమంతా...

భద్రం కాదురా...వీడు నాపాలిటి వీరభద్రుడై పోయాడు. తండ్రికసి తీర్చుకోడానికి వచ్చాడు. సరే... పదండి. ఎంతదూరం వెడతారో...చూస్తాను...చర్మం ఒలిపిస్తా...ఎవరనుకుంటున్నారో...

యాజులూ...ఇంకెందుకూ...బళ్ళు కట్టించు.

యాజులు—ఎంతపని చేశాడు! విశ్వాసఘాతకుడు...లేవండి. సామాను సర్దండి.



# పర్వతాలమధ్య పలవరింతలు

శ్రీ రా. వెం. మ. గం. రామారావు

మిన్నుతో మన్ను, మన్నుతో మిన్ను,
నన్ను చూచే కాబోలు నవ్వులాడేయి
నవ్వులో నున్నాయి అగ్నిహోత్రాలు,
నాల్కలో నున్నాయి రక్తాల పీల్పులు
ఈ రక్త శృంగార, మీ క్రొత్త భాష,
కప్పి వెలిబుచ్చె ముసుగుదగ్గుల ప్రకృతి
ఘోష.

ఆ ఘోషలో నేను తాళలేకనుపోతే,
ఉదకమండంవీథి ఉగము లుర్రమేయి.
చలిగాలి చీదర వణకి పోయాను
వడగాలి ధాకకు అదరిపోయాను
నా జన్మతీరని నవ్వుకొన్నాను.

నా నవ్వు కా నవ్వు కొక్కింతదూరమే;
శబ్దాల నొక్కింత స్వరభేదమున్ననూ,
శబ్దనాదాలలో నక్షత్రాళాలలో
సంగీతరాగాన సాగిపోవచ్చు.

కాని నా వెర్పును అవిరెండు ఒకటి;
అర్థాంలోనున్న శతయోజనాల
దవ్వులో సామీప్య సంపర్క మెట్లు?
నేను నేనే, నాది నాదే;
—అహంభావంలోఅనంతుడను నేను;-
విశ్వంతో నాకు వియ్యం సున్న.

ఐనా,
పొంగిపొంగి నేను పూంకరించిన సొంపు,
విశ్వమే నేనంచు విర్రవీగిన తూగు,
తలచి కొన్నాను, పిలిచికొన్నాను.
తలపులే తన్నేయి నాతలఁ;
పిలుపులే పిసికేయి నా మెడ.
కాలిపోయాను, సమసిపోయాను

విశ్వ కల్యాణంపు విన్యాసముంలోన
అణువైన కానట్టి నా ధ్వంస మొకలెక్క!
—నాపిలుపైన ఎవరైన వింటారో!

కానిండు, కానిండు—నా మాటెవఁగ్గాడి;
కైలాసమున్నది, బడబాగ్ని యున్నది;
పసిఫిక్కు ఉన్నది, విషవాయువున్నది;
తాజ్మహాలున్నది, పిరమిడ్లు లున్నవి;
అమెరికా యున్నది, ఏటంబాంబుంది;
సంగీత మున్నది, సాహిత్య మున్నది;
గాంధిజీ యున్నాడు స్టాలినున్నాడు;
సూర్యు డున్నాడు చుక్కలున్నాయి;
—నిత్య కల్యాణం, పచ్చతోరణం!



1. దేవతా విగ్రహాలు, తదితర ప్రతిమలు 2 వన్నెవన్నెల నెమలీ, కోడిపుంజులు



# ఆంధ్రుల జానపదకళా సౌందర్యానికి మచ్చుతునకలైన కొన్ని కొండపల్లి బొమ్మలు




# ఇండోనీషియన్లు: వారి ఆచార వ్యవహారాలు

= డా. ఆల్ఫియన్ వై. హెల్మి =

ఎవరీ ఇండోనీషియన్లు? ఏదేశంవారు వీరు? ఆ దేశమెక్కడవున్నది? వీరి ఆచారవ్యవహారాలేమిటి? వీరి జీవిత క్రమమెట్టిది? ఆశయాలూ, అభిరుచులూ ఎలాంటివి?

—ఈ సమస్య తరుచు చెవినీ, కంటాపడుతూవున్న ఈ జనాంగాన్ని గురించి చాలామందికి ఈ ప్రశ్నలు ఉదయించడం సహజం. నిజంగా ఎంతోమందికి వీరిని గురించి ఆట్టే విశేషాలు తెలియవన్నా తప్పులేదు. కాబట్టి నా యెరిగినవి మనవిచేస్తున్నాను.

ఇండోనీషియా అన్నది నైరృతి పసిఫిక్కులోని ఒకానొక ద్వీపసముదాయానికి పేరు. ఆ ద్వీపసముదాయం ఆక్రమించుకొనివున్న భూభాగ, జలభాగాలను మొత్తంగా లెక్కగడితే అమెరికా సంయుక్త రాష్ట్రాలంత వైశాల్యం తేలుతుంది. భూభాగమే ౭,౩౫౦,౦౦ చదరపుమైళ్లుంటుంది. అది భూమధ్యరేఖ మీద పడమరనుండి తూర్పుకు సుమారు ౪౬ డిగ్రీల అక్షాంశ మేరనూ, ఉత్తర దక్షిణాలుగా ౬ మొదలు ౧౧ డిగ్రీల రేఖాంశ మేరనూ విస్తరించివుంటుంది. ౧౯౪౧ యుద్ధానికి పూర్వం అది డచ్చివారి ఏలుబడిలో వుండేది.

ఇండోనీషియా అన్న ఈ పేరు భారతదేశమని అర్థమిచ్చే 'ఇండోస్', ద్వీపమని అర్థమిచ్చే 'నసీస్' అనే రెండు గ్రీకుపదాలనుంచి వచ్చింది. కాగా, దీనికి 'భారతీయద్వీపాలు' అన్నది ప్రతిపదార్థమని చెప్పినట్టయింది. ఈ సముదాయంలో సుమత్రా, జావా, బోర్నియో (బ్రిటిషుప్రాంతాలు మినహాయించి), సెలిబీస్ అనే పెద్దద్వీపాలున్నూ, బాలీ, లంబోక్, సుంబావా, ఫ్లోరిస్ మొదలైన చిన్నద్వీపాలున్నూ, ఒక్కమాటలో చెప్పవలసివస్తే, మొలూకాలూ, న్యూగినీ పడమటిభాగాలతో సహితమైన "పెద్దా చిన్నా సుండాద్వీపాలు" చేరివున్నాయి.

ఈ దేశంలోవారంతరూ ఒకే కులగోత్రాలకు—ఇండోనీషియన్ (మలే) వంశానికి—చెందినవారైనా,

కొండలు, పర్వతాలు, అడవులు, నదులు, సరస్సులు, సముద్రాలు మొదలైన రకరకాల భౌతిక పరిస్థితుల సన్నివేశకారణంగా అనేక వర్గాలుగానూ, తెగలుగానూ, శాఖలుగానూ విభక్తమైవున్నారు. ఇందు మూలాన ఏమయిందంటే, ఒకే కులగోత్రాలకు చెందిన కుటుంబాలు కూడ ఒక్కొక్కప్పుడు ఆయా స్థానిక సంస్కృతి సంస్కారాలకు అనుగుణంగా అనేక రకాల తెగలుగా మారిపోవలసివచ్చింది. పరాయివారు ఈ దేశానికి వెళ్లి నాలుగుచోటలూ పరిశీలించి చూడడం పడినప్పుడు అక్కడి రకరకాల జనాలను చూచి వారు ఆశ్చర్యపోక మానరు. సుమత్రాలో మరీ ఉత్తరాన ఉన్నవారు భారతీయుల రూపుకు దగ్గరగా కొంత నలుపుదేరివుంటారు. దానికి కొంచెం దక్షిణాన ఉన్నవారు చామనచాయగా ఉండి మలేద్వీపకల్పంలోని మలేలను ఇంచుమించుగా పోలివుంటారు. మరి సుమత్రాకు పడమట ఉన్న నియాసుద్వీపంలోని స్త్రీలు చూడబోతే లేతవర్ణంలో దరిదాపుగా జపాను స్త్రీలలాగే పసిమిరంగు కలిగివుంటారు. సుమత్రా దక్షిణప్రాంత వాస్తవ్యులు చైనీయుల తరహాకు చెందివుంటారు. చూడబోతే ఇన్నిన్ని రకాలు వీరిలో కనిపిస్తున్నా, జాతిమొత్తానికి ప్రత్యేకమైన ఒక సామాన్యలక్షణమాత్రం అందరిలోనూ ఏకరీతిని మూర్తీభవించి వుంటుంది.

పాశ్చాత్యులు చెప్పే అర్థప్రకారంగా సంస్కృతి సంస్కారాలు కలిగినవారు కాకపోయినప్పటికీ ఇండోనేషియన్లలో అత్యధిక సంఖ్యాకులకు మామూలు నాగరికతకేమీ లోటులేదు. వారూ గొప్ప నాగరికతగలవారే. కాదనడానికి కొంచెమాత్రమూ వీలులేదు. యూరోపులో మధ్యయుగాలనాటి పరమాంధకార శతాబ్దాల్లోకూడ వీరు తమవి అని చెప్పుకోదగిన ప్రత్యేక కళాసంస్కృతులను బాహాటంగా తీర్చిదిద్దుకొని ఉంచినారు. జావా, సుమత్రాలలోని ౮, ౯ శతాబ్దాలనాటి ప్రాచీన స్మారకాలను కొంచెం పరకాయించి చూడండి. అదే కాలంలో యూరోపులో నిర్మితమైన దేన్నయినా అవి తలదన్నేవిగా ఉంటాయి. జావానీయ కవితకూడ సరిగ్గా అదేప్రాయం. అందులో శక్తి ఆవేగమూ, నయమూ నాణ్యమూ, అందమూ చందమూ నిండి తొణికిసలాడుతూవుంటాయి. చెట్టులోపలిబెరళ్లను తమ మాత్రపు పొడుగు వెడల్పులలో కత్తిరించుకొని, ఒక్కొక్కటి చదరంగా ఒక్కొక్క పుటగా ఉండేటట్టు వాటిని నిడుపులుగా మడిచి, వాటిపైన నాటుసిరాతో వ్రాసిపెట్టిన బాపతు వేరు వేరు తరహాల రచనలు — వివిధ విధాల ప్రాముఖ్యంగల రచనలు సుమత్రాలో అప్పటికే ఎంతో ప్రసిద్ధిగడించినవున్నవి. చెట్ల బెరళ్ళమీదనే కాక వెదుళ్ళమీదా, వెదురుబద్దలమీదా కూడా వ్రాసే అలవాటున్నట్టు నిదర్శనాలు కనిపిస్తున్నవి. ఆ ప్రాచీన వ్రాతలుకూడ ఎంతో ముచ్చటగా, స్పష్టంగా వ్రాయబడేవి. ఇండోనేషియన్లలో — అందులోనూ ముఖ్యంగా జావానీయులు, బటకులు, లంపోంగులలో (చివరి రెండూ సుమత్రాలో భాగాలు) చదువనూ వ్రాయనూ నేర్చినవారి సంఖ్యకూడా చిరకాలంనుంచి ఎక్కువగానే ఉంటూవచ్చింది. బహుశా యూరోపులో అనేక దేశాల్లోకూడా అంతసంఖ్య ఉండేదికాదేమో అని సైతం అనిపిస్తుంది.

సంగీతంలోనూ ఇండోనేషియన్లు ఎన్నడూ వెనకబడినవారుకారు. బాలీ, జావానీయుల సంగీతం బహుళప్రఖ్యాతమయింది. వారి నాట్యాభినయాల గొప్పదనం సంగతి సరేసరి. అది ఏనాడో రూఢియైపోయిన విషయం. యుగయుగాల క్రిందటనే ఉద్భూతమైయున్న ఈ ప్రాచీన జావా-బాలీ సంగీతం అసలు మూలసూత్రాల్లోనే పాశ్చాత్య సంగీతానికి అక్షరాలా విభిన్నమైన బాపతు. నేటివరకూ చూచినాకూడా అందులో పాశ్చాత్యప్రభావం ఈషణ్మాత్రమైనా తలచూపింది లేదు. తమ సంగీత నాట్యాలను ఎప్పటప్పుడూ అవసరంకొద్దీ పునర్వికాసానికి తీసుకురావలసివచ్చినప్పుడు కూడా బాలీ గాయకులు అపూర్వమైన సొంత పద్ధతులనే అనుసరించేవారు. తాళ, స్వరమేళాల విషయంలో ఇండోనేషియన్లు చాలా పట్టుదలగలవారు. తోడిమానవులతోగాని, ప్రకృతితోగాని, పరమాత్మతోగాని సమైక్యతాభావం పాటించకపోవడమంటే అదొక మహాపాతకంగా పరిగణిస్తారు వారు. ఈ సమైక్యతాభావం ముస్లిం పండుగపర్వాల రూపమైన రెండు గొప్ప సందర్భాల్లో బాగా వ్యక్తమవుతూవుంటుంది.

ఆ సందర్భాలేవంటారా?—రమధాన్ ఉపవాస మాసా నంతరమున్నూ, యాత్రాకాలంలోనున్నూ. (ఇండోనీషియన్లలో చాలామంది ఇస్లాం మతావలంబకులు) ఈ సందర్భాల్లో, పరస్పరాభినందనలు చెప్పుకొన్న తరువాత, ఇండోనీషియన్లు ఏమరకుండా ఈ విన్నపం చేస్తూవుంటారు: "ఇదివరలో నేను నీ విషయంలో ఏదైనా తప్పుచేసిగాని, ఎంచిగాని ఉన్నట్టయితే నన్ను క్షమిస్తావని గట్టిగా నమ్ముతున్నాను". మిత్రులైనాసరే అమిత్రులైనాసరే ఎవరినైనాకాని క్షమార్పణ కోరడం మరచిపోవుట అన్నది ఇండోనీషియన్లు ఈసడించుకొనే విషయాల్లో ముఖ్యమయింది. ఈ సామరస్య సమైక్యతాభావ కలిమివల్లనే, క్రైస్తవులు, బ్రాహ్మణులు, బౌద్ధులు మొదలైన ఇతర మతాల వారెందరో ఉన్నప్పటికీ, ఇండోనీషియాలో మత సంఘర్షణ లన్నవి పేరుకైనా తలచూపలేదు. క్రౌర్యమూ, మొరకుతనమూ, దురభ్యాసాలూ—అనే ఇవి ఇండోనీషియన్లపాలికి పరమ హేయాలు.

ఇంతేకాదు, ఇండోనీషియన్లు కళాపిపాసువులు కూడా. అది వారి సహజప్రవృత్తి. మామూలు పల్లెవాసులుకూడా సంగీత, వాస్తుశిల్పాల్లో ఏది మంచి అభిరుచో ఏదికాదో ఇట్టే పోల్చగలుగుతారు. ౭-వ శతాబ్దినాటికే ఇండోనీషియాలో ఎన్నో సుందర దేవాలయాలు వెలసివున్నవి. ఆ నుంచి ౧౪వ శతాబ్దం వరకూగల కాలం జావా సుమత్రాలపాలికి మహోత్తమమైన కళాయుగం. బాలీలో ఇప్పటికిన్ని ఆ ప్రాచీన సంప్రదాయాలు సజీవంగా నిలిచివున్నవి. ఇక్కడి వారికి వస్తువిన్యాసంలో, అలంకార సంవిధానంలో వివేచనతో కూడిన మేళ్జ్ఞానం పుట్టుకతోనే అబ్బివుంటుంది. వారు ఏది తీర్చిదిద్దినా అందులో వ్యక్తిత్వమూ, కళాశీలితా గోచరిస్తూవుంటుంది.

వ్యాయామక్రీడల విషయంలోనూ వారిది అందెవేసిన చెయ్యి. ఆటలంటే వారిపాలికి గొప్పకళ. ఆ ఆటల్లో ఎంత ప్రమాదం నిక్షిప్తమైఉంటే వాటి కంతకంత ఎక్కువవెల. ఈ ఆటల్లో ఎక్కువ వ్యాప్తి గాంచింది గుఱ్ఱాలమీద జింకలవేట. ముష్టియుద్ధంకూడా వారికి మరొక అభిమానక్రీడ. వీటికితోడు ఇప్పుడిప్పుడు పాశ్చాత్య సంసర్గంవల్ల ఫుట్‌బాల్, టెన్నిస్, బాస్కెట్‌బాల్ మొదలైన పరదేశీ ఆటలుకూడా విస్తారంగా వ్యాప్తి పొందుతున్నవి.

ఇండోనీషియన్ ఇండ్లు సాధారణంగా కొయ్యతో (అందులోనూ విశేషించి టేకుకొయ్యతో) నిర్మింపబడినవి. జావాలో వీటిని వెదుళ్లతో నిర్మించుకొంటూవుంటారు. ఇవి శాశ్వతంగా ఉండడంమాత్రమే కాక చాలా సౌకర్యంగానూ వుంటాయి. వీరి గ్రామాలు వీలయినంతమట్టుకు సర్వసామాన్యంగా ఏ నదులతీరానో, ఏ కొలనుగట్టులందో నిర్మింపబడడం మామూలయిపోయింది. స్నానపానాలకూ, రవాణా రాకపోకలకూ అనుకూలంగా ఉంటుందనేదే ఇందలి ఉద్దేశ్యం.

ఇండోనీషియను తెగల్లో ఆచార వ్యవహార స్మృతి ప్రతిపాదితమైన ఒక గొప్ప సంప్రదాయం ఇక్కడ పేర్కొనకతీరదు. ధనవంతులూ, బలవంతులూ అయినవారు బీదలూ, దుర్బలులూ అయినవారికి విధిగా సహాయపడుతూ వుండవలెను. గ్రామపెద్దలు వారి విషయమై చాలా ఎక్కువ బాధ్యత తీసుకొంటారు. బీదాబిక్కివారిలో కలిగే తగవుతగాదాలను తీర్చడంలోనూ, వారికి కావలసిన సౌకర్యాలను వీలయినంతగా సమకూర్చడంలోనూ వారు మహాశ్రద్ధ వహిస్తారు.

సొంత ఆస్తులమీద అద్వితీయమైన హక్కు చలాయించడమనేది అక్కడలేదు. తూర్పుసీమలోని చాలామంది జనంవలెనే, తమకు కలిగినదేదో దాన్ని తోడిజీవులతోపాటు సరిసమానంగా పంచుకోవలెనన్న సమదృష్టి వారికి రూఢమైపోయింది. ఉదాహరణకు: ఒక వరిపొలం ఖామందు ఉన్నాడనుకోండి. సాగుకయ్యే ఖర్చు వెచ్చాలూ, శిస్తుకిస్తులూ భరించేవాడు తానొక్కడే అయినా పంటకటామణి గోమట్టుకు సర్వసమానంగా అందరికీ హక్కుభుక్తాలిస్తాడు. అందరికీ భాగాలు పంచుతాడు.

వరిసాగుకు సన్నాహాలు ప్రారంభించేముందరనే గ్రామస్థులంతా కలిసి, ఒకచోట సమావేశమై, వారిలో వారికి ఆ వ్యవసాయ విషయంలో ఉన్న అభిప్రాయ భేదాలను తీర్చుకోవడం ఈ ద్వీపాల్లో చాలాచోట్ల

ఆధారంగా వున్నది. ఇందువల్ల రైతులకూ, భూస్వాములకూ ఉన్న విభేదాలు తీరిపోయి, ఏ తగాదాలూ లేకుండా తరువాతి కార్యక్రమం సవ్యంగా జరుగుటకు వీలవుతున్నది.

ఊళ్లో ఎవరింట ఏమి జరిగినా అది సంఘంవారి నందరినీ ఆకర్షించి తీరిందన్నమాటే. గ్రామాంతరాల్లోని నిష్కల్మషహృదయులైన ప్రజలు సంఘంలోని ప్రతీవాని కష్టసుఖాలనూ మనస్ఫూర్తిగా గమనిస్తూ ఉంటారు. ఎవరింటనైనా ఒకరియింట వివాహం జరిగిందనుకోండి: సంఘమంతా ఆ ఉత్సవంలో పాల్గొన్నదన్నమాటే. సంఘంలోని ప్రతివ్యక్తీ ఆ ఉత్సవానికి సంబంధించిన సమస్త సాంప్రదాయిక కార్యకలాపాల్లోనూ వరునిపక్షంలో త్రికరణశుద్ధిగా తోడ్పడి తీరవలసిందే. వధువు ఇంకొక ఊరిదయినట్టయితే సంఘంలోని ప్రతిఆడదీ 'మా ఊరి కోడలు, మా ఊరికోడలు' అంటూ వెళ్లి ఆ కొత్తవధువుతో పరిచయం చేసుకొంటుంది. ఇలా పరిచయం చేసుకొని ఆమెతో మాటా పలుకూ ఆడడానికని సాయంకాలం వేళల్లో కొన్నిగంటలు ప్రత్యేకిస్తూ వుంటారు.

ఇండోనీషియన్లు ఇంత నాగరికతగలవారుగదా మరి—అయినా వారిలో చాలామంది మూఢవిశ్వాసపరులున్నారు. దక్షిణ సుమత్రాలో శుక్రవారంపూట ప్రయాణంచేయడం నిషిద్ధం. అంత అవసరమైన పనేదయినా తటస్థిస్తే శాంతిహోమాదికం చేసుకొనిగాని వెళ్లడానికి వీలులేదు. అలాగే మరికొన్ని ప్రాంతాల్లో శుభారంభాలకు మంగళవారం అంత మంగళప్రదం కాదు. ఇలాగే ఇంకా ఎన్నో పిచ్చినమ్మకాలు వారిలో పాదుకొని ఉన్నాయి.

ఇండోనీషియన్లు మనలాగే బియ్యపన్నం తినే జాతికి చెందుతారు. వారు రెండుపూటలూ బియ్యపన్నమే తింటారు. కూరలుచేసుకొంటారు. కూరలతోబాటు చేపలూ, మాంసమూకూడా వ్యంజనాల్లో ఉపయోగిస్తూవుంటారు. పోపుసామగ్రి విస్తారంగా పండే దేశంవారు కాబట్టిన్నీ, తగ్గరకపు జీవితప్రమాణానికి చెందినవారు కాబట్టిన్నీ వారు తమ కూరాపులుసులను కారంగా చేసుకోవడానికి మమతపడుతూవుంటారు. అయితే కాయగూరలను వండుకొనేటప్పుడుమాత్రం వారు మిరపకాయలుగాని, మిరియాలుగాని లేకుండానే వండుకోవడంకూడా కద్దు. అటువంటి కారంలేని కూరలను వారు 'సాయూరు' అంటారు.



# ఆంధ్రుల జానపద శిల్పకళాప్రపంచం

## ౨. కొండపలి బొమలు

= శ్రీ సుధాంశు కుమారరాయ్ =

మన దేశంలోని కళాకారులు భారతీయకళను వ్యక్తీకరించుటకు అవలంబిస్తూ వచ్చిన ప్రాతిపదిక పద్ధతులననుసరించి, అందులో నే నేమీ ప్రామాణికుడను కాకపోయినప్పటికీ, పనికట్టుకొని ఏదో నాకుతోచిన రీతిని నాకుతోచినది చెప్పబూనుకొన్నందుకు పాఠకులు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. భారతీయ కళా ప్రపంచంలో నా ఓపినంతమట్టుకు నే చేసిన పరిశోధనల సందర్భంలో నా అంతరాత్మకు తట్టిందేదో దాన్నే నేను వ్రాస్తున్నాను. జానపదకళాశిల్పాలను కరతలామలకంగా అర్థంచేసుకొని ఆకళించుకొనుటకు నాకు తోడ్పడినంతకంటే పలురెట్లుగా అవి నా పాఠకులకు తోడ్పడతాయని నా ఆశ.

మానవజీవులు రెండుపద్ధతుల్లో రెండుభాగాలుగా ఆత్మవ్యక్తీకరణచేసుకుంటూ చరిస్తూవుంటాయి. (౧) అంతరంగంలోని "అభిప్రాయం" "ముఖసీమ"లోనే ద్యోతకమవుతూ వుంటుంది. ముఖకండరాల సహాయంతో వెలికివచ్చి ముఖసీమలో ఒక విచిత్రదృశ్యాన్ని సృష్టించేది "భావన" (అంతస్సులోనే ఆలోచించుట) అనే ఒకానొక ప్రవృత్తి. దాన్నే మనము "భావము" అనేపేర పిలుస్తాము. ఈ భావం మనస్సులోని ఆంతరిక సందేశాన్ని మనకు తెలియజెప్తూవుంటుంది. దాన్ని శాంతము, కరుణము, బీభత్సము, హాస్యము మొదలైన తొమ్మిది రసాలుగా విభజించవచ్చు. చిరునవ్వుగాని, పెనునవ్వుగాని మానవశరీరంలోని మరి యే యితర అంగాంగాలలోనూ వ్యక్తంకావడానికి వల్లపడుట లేదు. ఆ హక్కు ఒక్క ముఖసీమకే ఉన్నది. సాధారణంగా మనం ఇతరులు మాట్లాడగా వినేటప్పుడు ఆ మాట్లాడే వ్యక్తి ముఖంలోని కవళికల సహాయంతో వాని ఆ మాటలనూ, వాటి అసలు అంతరార్థాన్నీ ఉన్నదున్నట్టుగా అర్థంచేసుకోవలెననే ఉద్దేశ్యంతో మన కండ్లను నేరుగా ఆ వ్యక్తి ముఖంమీదికి కేంద్రీకరించి చూస్తూవుంటాము. "మాటలు" అనేవి అసలు కళాకారుల దృష్టి కిందికి రానేరావు. కాగా, లోపలిభావానికి సంపూర్ణంగా, స్పష్టంగా, నిర్ధారణగా నిర్దిష్టరూప మివ్వజాలిన భావమొక్కటే కళాకారులకు మిగిలిన సాధనోపాయం. (౨) ముఖం మినహాయించి మానవశరీరంలోని మిగిలిన అంగాలన్నీ శక్తియొక్క స్వరూపాన్ని మనకు వెల్లడిస్తూవుంటాయి. వస్తువులకూ, వస్తువులకూ గల వ్యవహారాల నిర్వహణకై ఉచిత శక్తిసంపత్తితో వాటిని ఎత్తడమూ, కదిలించడమూ జరుగుతూవుంటుంది. ఈ వ్యవహారాలకు శక్తి బదలాయింపులో, లేదా వలసలో అవసరమైవుంటుంది. అదే భంగి, లేక భంగిమ.

భారత దేశంలో నాగరిక కవితాకారులవలెనే నాగరిక కళాకారులుకూడ ముఖ్యంగా నవరసకళ-భావకళనే భావిస్తూవచ్చినారు. కాని జానపదకళాకారులు మాత్రం జానపదప్రజలవలెనే తాము పుట్టి పెరిగిన ఆ ఒక్క సర్వసాధారణ భంగిమలనే అవగాహనచేసుకుని, శక్తియొక్క వలసలతో నిండిన "భంగి" విద్యను, శక్తి విద్యను మాత్రమే వెల్లడింపజాలిన పనినే ముఖ్యంగా నిర్వహిస్తూవచ్చినారు. మనదేశీయమైన నాగరికకళకు నిదర్శనమైనట్టి నటరాజ శివునియొక్కా, ధ్యానిబుద్ధునియొక్కా విగ్రహాలను ఉదాహరణకు తీసుకొని చూద్దాము. అలా చూచినప్పుడు వాటిలోని భంగి భావానుగుణంగా రూపొందివున్నట్టు మనము చూడ

గలుగుతాము. కాని, కొండపల్లి బొమ్మలతాలూకు ఈ నిదర్శనాలు ఎదిరి ధ్రువాన్ని—"భంగి" విద్యను ప్రదర్శిస్తాయి. ముఖభావాలు శూన్యమై, అవి మనకు లోపలి అంతరంగాన్నేమీ చూపడంలేదు. లోనున్న రహస్యాలను చెప్పబూనడమూ లేదు. మరేమంటే, వలసపోయిన శిక్షణకు సంబంధించిన ఏవో కొన్ని ప్రత్యేకమైన అంతిమ స్వరూపాలను అవి మనకు చూపెట్టుతాయి. ఈ బొమ్మల్లో పక్షులు, పురుషులు, స్త్రీలు, చెట్లు మొదలైనవి శక్తి ఒక్కటి మాత్రమే ప్రసాదింపజాలిన "హుందాతనం"తో చిత్రింపబడివుండటం చూడవచ్చు. తిరువాన్కూరు, మైసూరు రాష్ట్రాలలోని చందనపు బొమ్మల్లోనూ, దంతపు బొమ్మల్లోనూ వున్నట్టు ఈ బొమ్మల్లో శృంగార ప్రవృత్తి యేమీ మనకు కనబడదు. ఆదిరసమైన శృంగారాన్ని ప్రధానాంశంగా పరిగణించే "భావ" విద్యాప్రసూతి కానేకాదు కాబట్టి ఈ కొండపల్లి బొమ్మలు అసలు నిజమైన జానపదకళాఖండాలన్న విషయం గట్టిగా స్పష్టపడుతున్నది. మరి యిప్పుడు కళలో ఈ "హుందాతన" మన్నదేమిటో కొంచెం గమనిద్దాము. హుందాతన మనేది పరినిష్ఠితత్వం వల్లనూ, విజయంవల్లనూ సాధింపబడే ఒక గుణవిశేషం. భారత జాతీయ సైనికుల సలాముల నందుకొంటూ, సైనిక దుస్తుల్లో ఉన్న సుభాసు చంద్రబోసు, కెప్టెన్ లక్ష్మిల ఫోటోలను మీలో చాలామంది చూచేవుంటారు. అవి భావచిహ్నాలనేమీ ప్రదర్శించడంలేదు. ఒక విజయ భంగిమను, క్షణికమైన ఒక విభవాన్ని మాత్రమే వాటిలో మనం చూడగలుగుతాము. అలాగే మనుష్యులు, చెట్లు, పశువులు, పక్షులు మొదలైనవాటి జీవిత క్రమంలో ఇటువంటి విజయక్షణాలు సకృత్తుగా ఎప్పుడో కాని తటస్థపడేవి కావు. కొండపల్లివారైన ఈ జానపదకళాకారులు బహు తెలివితేటలు కలవారు కాబట్టి ఆ అపురూప సన్నివేశాలను, కలిగిన అవకాశాన్ని కోలుపోకుండా, అప్పటికప్పుడు తమ బొమ్మల్లో పట్టి ఉంచగలిగినారు. ఇంతే కాదు. ఆ బొమ్మలు ఆ కళాకారులకుగల బలమైన పరిశీలనశక్తిని కూడా చూపజాలివున్నవి. కొండపల్లి కళాకారులు కుతర్కాలకు ఆస్పద మివ్వకుండా ఉండగలందులకై గంభీరభావాలతో గుంభితమైన ముఖముద్రలను తప్పనిసరిగా తప్పించుకొంటూనే వచ్చినారు. పైగా, వారు మనుష్యుల విషయంలోనూ, జంతువుల విషయంలోనూ వివిధ విధాలయిన దేహభంగిమలను కల్పిస్తూవచ్చినారు. ఆ భంగిమలు శక్తివాహకములైన గొప్ప లక్షణాలతో ఒప్పుతూ వచ్చినవి. ఒకొక్కప్పుడు ఈ జానపద కళలో నాగరికకళాప్రతిబింబాలుకూడ వచ్చి పడకమున్నా లేకపోలేదు. నిదర్శనం కావలిస్తే కొండపల్లి దశావతారాల బొమ్మలు చూడవచ్చు. ఈ బొమ్మల సంప్రదాయం ౧౦ వ శతాబ్దినాటి దక్షిణదేశపు కంచు ప్రతిమ లంత ప్రాచీనమనడంలో సంశయింపబనేలేదు. వాటిలో ౧౦ వ శతాబ్దంనాటి అలంకారాల తీరులూ ముద్రలే సాక్షాత్తూ కనిపిస్తుంటాయి. సీతారాముల బొమ్మల్లోకూడ ఈ నాగరిక కళావాసనలు చిమ్ముతూవుంటాయి. సీతారాముల ఎడమభుజాలను ౧౦ వ శతాబ్దంనాటి స్త్రీ పురుష ప్రతిమల శిల్పంతో పోల్చిచూస్తే ఈ సంగతి ఎవరికైనా గమనానికి రాక మానదు. ఇంతతోనే, అంటే ఇలా నాగరిక కళాప్రభావం వీటిమీద కనబడినంతమాత్రంచేతనే ఇవి నాగరిక కళాప్రసూతి అని చెప్పగూడదు. ఎందుకంటే, భారత దేశంలో జానపద కళాశిల్పాలు, సదా మాతృపాత్ర నిర్వహిస్తూవచ్చినవి. అది మరీమరీగా ఎన్నో కాలిక కళలకు జన్మ ఇస్తూవచ్చింది. ఆ కాలిక కళలు కాలధర్మం చెందిపోయినప్పుడు జానపద కళ వాటిని, చనిపోయినవారి అస్థికలను భూమాత వహించినట్టుగా చేతుల్లోకి తీసుకొని, తల్లివలె తిరిగీ దాన్ని ఆ తరువాతి నాగరిక కళారూప నిర్వచనకు బాధ్యురాలిని చేస్తూ వచ్చింది. కాగా, భారతీయ కళాచరిత్రలో ఈ కొండపల్లి అవతారాల బొమ్మలు విచిత్రమైన స్థానమేర్పరచుకొన్నాయి.

కొండపల్లి సీమలోని తక్కిన బొమ్మల్లో కాలిక కళయొక్క ప్రభావమేమీ కనబడడంలేదు. వాటిని రెండు రకాలుగా విభజించవచ్చు: ఒకటి పశుపక్షులు; రెండు స్త్రీ పురుషుల గ్రామజీవనం. ఈ బొమ్మలన్నీ బహు నిరాడంబరంగా, బహు సాజాకుగా తీర్చి దిద్దబడినవి. దక్షిణదేశ దేవాలయశిల్పాల్లో కనిపించే ఆడంబ

రాలు వీటిలో కానరావు. ప్రతిమా శిల్పశాస్త్రపు సూత్రాల అనుసరణ శోభకూడా ఇవి పోలేవు. కొండపల్లి తాలూకు కొయ్యబొమ్మలను బెనారెస్, బీర్భూమ్ (బెంగాలు) లలోని కొయ్యబొమ్మలతో సునాయాసంగా జతకట్టవచ్చు. వాటిలాగానే ఇవన్నీ భారతదేశంలోని బొమ్మలూ బొమ్మసామగ్రితాలూకు జీవత్సంప్రదాయాలను రూఢిగా రూపిస్తూవుంటాయి.

ఈ కొండపల్లి బొమ్మలలో నిక్షిప్తమైవున్న వర్ణన్యాసాన్ని నేనింకా ఇప్పటిప్పుడే జాగ్రత్తగా అధ్యయనం చేస్తున్నాను. అంగుళం ఇప్పటిప్పుడే ఈ బొమ్మల్లోని వర్ణవిన్యాస విశేషాలనుగురించి నా అభిప్రాయాలు వెల్లడించడం భావ్యంకాదు. కాని ఒక్క సంగతిమాత్రం నేను గట్టిగా చెప్పగలను. ఈ బొమ్మల్లో కొండపల్లి సాంప్రదాయిక కళాకారులు అనువర్తింప జేసివున్న వర్ణవ్యాకరణం అచ్చంగా వారి సొంతమే. ఎక్కడనుంచిగాని అరువు తెచ్చుకొన్నదికాదు. నాగరిక కళాప్రభావంకూడ వీటిమీద అంతగా వచ్చి పడలేదు. అయితే, జానపద చిత్రాలలోని ఆంధ్ర సంప్రదాయాలతో దగ్గరి చుట్టరికం కలిగివున్నట్టు మాత్రం ఇవి నిస్సంకోచంగా తెలుపుతున్నవి.

ఈవ్యాసం ముగించేముందర బెంగాలులో కీ. శే. జి. యస్. దత్తుమహాశయునిచే ప్రారంభింపబడి దినదినాభివృద్ధిగా కొనసాగుతున్న జానపద కళోద్ధరణ ఉద్యమ చరిత్రను సంగ్రహంగా ఏకరువు పెట్టదలచి తిప్పలేదనుకుంటాను. పైగా అది ఆంధ్రదేశంలోకూడా అటువంటి ఒక ఉద్యమం ఏ కళాభిమానుల ధర్మానమో బయలుదేరడానికి దోహదం కల్పించినా కల్పించవచ్చునని నాకొక ఆశ. లేకపోతే, ఆంధ్రదేశంలోని ఈ ప్రజాశిల్పకళ ఆలనపాలనలులేక అంతరించిపోదూ? అలా పోనివ్వగలసిందేనా? తల్లికళ తీపి స్తన్యంతో మన పిల్లలకు జవజీవాలు కల్పించడం మన కవశ్యకర్తవ్యం కాదూ?

జానపద కళాశిల్పాలయొక్కా, నాట్యనృత్యాల యొక్కా విలువ కీ. శే. జి. యస్. దత్తు, ఐ. సి. యస్. గారు మొట్టమొదటగా కనిపెట్టారు. ౧౯౩౧ జనవరిలో వారు ఇంగ్లాండు వెళ్ళినప్పుడు లండనులోని రాయల్ ఆల్బర్టు హాలులో జరిగిన అఖిల ఇంగ్లాండు జానపద నాట్యోత్సవాన్ని తిలకించే అవకాశం వారికి తలవనితలంపుగా కలిగింది. ఆ దేశంలోని సంస్కార పరాయణులలో గొప్పగొప్పవారంతా ఆ జీర్ణోద్ధరణ ఉద్యమంలో ఎలాఎలా ఉత్సాహంతో తోడ్పడుతూవున్నారో కూడా ఆ సందర్భంలో దత్తుగారు ఆకళించుకో గలిగినారు. ఆనాడు వారు చూచిన ఆ జానపద నాట్యాలూ, విన్న పదాలూ, పాటలూ ఆయనకు వెంటనే తనజన్మగ్రామంలోని, ఆచుట్టుపట్ల గ్రామాలలోనీ ఆటపాటలను స్ఫురణకు తెచ్చినవి. అంతేకాదు. ఏఅంశంలో చూడబోయినా తనదేశపు ఆటపాటలు ఆ ఇంగ్లాండు ఆటపాటలకంటే ఎంతో గొప్పవిగా కూడా తోచసాగినవి. అంతతో ఆయనలో ఒక ఆవేశం ఇంద్రజాలక్రియవలె పుట్టుకొనివచ్చినది. దానితో ఆయనకు అదివరకెన్నడూలేని ఆత్మాభిమానమూ, తన జాతీయ సంప్రదాయాల యెడలా, జాతీయ కళల యెడలా అపూర్వగౌరవమూ ఏర్పడినవి. ఆ ప్రదర్శనశాలలో కూర్చున్నవాడు కూర్చున్నట్టుగానే తన దేశానికి తిరిగి వెళ్ళిన మరుక్షణమే అటువంటి ఒక జీర్ణోద్ధరణోద్యమం ఉపక్రమించి తీరవలెనని స్థిరసంకల్పం చేసుకొన్నాడు. సంకల్పశుద్ధి ఉన్నప్పుడు కార్యము సానుకూలమవుటలో అన్యథా ఎందుకు జరుగును? ఇప్పుడు కాదప్పుడు ఈ ఉద్యమం లేవదీయవలెనన్న పట్టుదలతో, ఆతను లండనునుంచి తిరిగి స్వదేశానికి వచ్చిన కొన్నాళ్ళకే ౧౯౩౧ నవంబరులో మైమెన్సింగు అనే ఊరిలో బెంగాలు జానపద నాట్యసంరక్షణకై ఒక సంఘం నెలకొల్పినాడు. అదే మరికొన్నాళ్ళకు— ౧౯౩౬ లో బెంగాలు గ్రామీణ ఆనువంశిక సంరక్షణ సంఘంగా (Rural Heritage Preservation Society) గా మారింది. దత్తుగారి పర్యవేక్షణక్రింద ఈ సంఘంవారు గ్రామగ్రామానికీ తిరిగి అక్కడ శిథిలావస్థలో ఉన్న ప్రతి జానపదకళనూ పరిశీలించి, పల్లెపదాలనూ, పల్లెటూరి కళాశిల్పాలనూ సేకరించుకొనిపోయి జీర్ణోద్ధారం చేస్తూవచ్చినారు. ఈ విషయంలో వారు చేసినది ఇంతా అంతా కాదు. ఇలాగ

ఎక్కడెక్కడనుంచో ప్రాచీన జానపద కళాఖండా లను కష్టపడి సేకరించుకొనివచ్చి, నలుగురికీ తన కృషి చూపవలెననీ, నలుగురికీ ఈ ప్రాచీనకళలో అభిరుచి కల్పించవలెననీ కలకత్తా నగరంలో ౧౯౩౨ సంవత్స రం మార్చిలో ఒక పెద్ద జానపద కళాప్రదర్శనంకూడా ఏర్పాటుచేసి, జయప్రదంగా నిర్వహించినాడు. ఇటు వంటి ప్రదర్శనం భారతదేశంలో జరగడానికి ఇదే ప్రథమం. అదే సందర్భంలో ఈ కళలలోని విశిష్టతనూ, విలువనూ దర్శకలోకానికి వెల్లడించుటకు అనేక యత్నాలు చేయబడినవి. అటుతర్వాత ౧౯౩౨ ఏప్రిల్ లోనూ, ౧౯౩౩ సెప్టెంబరులోనూ దత్తుగారు కలకత్తా విశ్వకళాపరిషత్తులో జానపద కళలమీదా, జాతీయ సంస్కృతికీ వాటికీగల సంబంధంమీదా చక్కని ఉపన్యాసాలిచ్చినారు. ఆ తర్వాత వ్రతాచారి ఉద్య మం (దీని స్థాపకుడు తానే) ద్వారా బెంగాలులోని అనేకమంది యువతీ యువకులను చేరదీసి వారికి ఈ జానపద కళాసంప్రదాయాలతో పరిచయం కల్పించి వారినికూడా ఈ ఉద్యమంలోకి లాగుకొనినాడు.

అటువంటి సేవాజీవిని దురదృష్టవశాత్తూ బెం గాలు రాష్ట్రం ౧౯౪౧ జూనులో కోలుపోవలసివచ్చింది. కాని, ఆయన ఉపక్రమించిన ఉద్యమం మాత్రం అమో ఘంగా సాగుతూనే ఉన్నది.

ఈ మహనీయునిలాగానే అదే ఆదర్శంతో ఆంధ్రదేశంలోని కళాకారులూ, కళాభిమానులూ ముం దుకువచ్చి, తమదేశంలో కొనఊపిరితో నామమాత్రం గా నిలిచివున్న జానపద కళాశిల్పాలను అవి నామ రూపరహితంగా మాసిపోకముందే జీర్ణోద్ధారంచేసి, జాతీయ వికాసంతో వాటి విలువను ఒక్క ఆంధ్ర లోకానికేకాక యావద్భారతానికీ చాటే ప్రయ త్నాలు ఎందుకుచేయరా అనీ, ఇకనైనా తప్పక చేస్తా రనీ, తమజాతి ప్రాచీనప్రతిష్ఠను శాశ్వత బ్రహ్మ కల్పంగా నిలుపగలరనీ నేను మరీమరీ ఆశిస్తున్నాను.



# కలిగ … రంప

## కలలో 'పాకిస్థాన్'

ఆ రాత్రి నేను నా పక్కదగ్గరకు వెళ్ళి కూర్చునే సరికి గడియారము టంగు టంగుమని ౧౧ గంటలు కొట్టింది. ఆవులింతలు అల్లకల్లోలము చేయుట మొదలు పెట్టినవి. పగలంతా ఎక్కువ శ్రమపడుటవల్ల గాబోలు వెంటనే నిద్ర కన్నులమీద కలియబడుతూవుంది. అంతే.

భారతదేశాన్ని హిందూస్థాన్, పాకిస్థాన్ అనే రెండు భాగాలుగా విభజించారట. పంజాబు, బెంగాల్ మొదలగు రాష్ట్రాలలో రెండేసి మంత్రివర్గాలు స్థాపించారట. కేంద్రంలో రెండు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. జిన్నాగారు తన మంకుపట్టు నెరవేరిందనే సంకుచితమైనదృష్టితో వార్తాపత్రికలనిండా ప్రకటనలు చేశాడు. తన ప్రయత్నం నెరవేరింది. ఇక తన ప్రజలు హాయిగా, సుఖంగా, స్వేచ్ఛావిహారులుగా, స్వతంత్ర వాయువులు పీలుస్తూ నిరాటంకంగా, నిరపాయంగా, నిర్విఘ్నంగా జీవిస్తారనే సంతోషాతిశయాలతో జిన్నాగారు తమ పాకిస్థాన్ రాష్ట్రాలలో వేదికలపై వుపన్యాసాలు దంచుతున్నారు. ప్రజలు అఖండంగా సంతోషాతిశయాలతో పూలమాలలతో ఆయనను ముంచెత్తేస్తున్నారు. పాకిస్థానును గూర్చిన పట్టుదల, త్యాగం కొనియాడుతూ మౌలానాలంతా "జిన్నా సాహెబ్ జిందాబాద్" అంటూ కవిత్వాలు కదంతొక్కిస్తున్నారు. జిన్నాసాహేబుగారు వంగి వంగి నడుమును సాగదీసుకొంటూ 'ఈ స్వరాజ్యసృష్టికి నేనేగదా బ్రహ్మ' అని లోలోన వుబ్బికి వుబ్బిపోతున్నాడట.

నాలుగుమాసాలు గడచినవట. ఇంకేముంది ? పాకిస్థాన్‌లో కలకలం బయలుదేరింది. అమాయికబీద ప్రజల "అన్నమో అల్లా" అను శోకధ్వనులు మిన్నుముట్టాయి. కారణాలు పత్రికల్లో శరపరంపరగా గుప్పించివేస్తున్నారు.

ధాన్యం హిందూస్థాన్‌లో అధికోత్పత్తి. నూనెగింజలు పాకిస్థానంలో లొజ్జు. పంచదారకు హిందూస్థాన్‌దే పైచెయ్యి. ప్రత్తి హిందూస్థాన్‌లో ఎక్కువ. జనుము పాకిస్థాన్‌లో కొంచెము ఎక్కువ. ముడిఇనుము, మాంగనీసు హిందుస్థానంలో హెచ్చు. హిందువులధికసంఖ్యాకంగా వున్న భాగంలోని ఆదాయం అర కోట్లరూపాయలు మినహాయిస్తే ౩౬ కోట్లుమాత్రం. హిందూస్థానపు ఆదాయం అర కోట్లు. పాకిస్థాన్‌లో నుంచి హిందూఖండపు ఆదాయం అర కోట్లు. జమ్లా ౧౨౦ కోట్లు. పాకిస్థానపు ఆదాయం కృశించటమే కాకుండా ఎదుగు, బొదుగులేని ఆదాయం. భూమిశిస్తు లాంటిది. శాయిరీసుంకం ఆదాయపుపన్ను లాంటిది. వృద్ధికాదగిన వుత్పత్తి ఎక్కువగా లేదు. మహమ్మదీయులు అధికసంఖ్యగా ఉన్న పంజాబ్, కాశ్మీరం, బెలూచిస్థానం, సింధు, తూర్పుబెంగాలులలో ఖనిజ సంపద లేనేలేదు. వ్యవసాయాదాయం అభివృద్ధి చెందాలంటే హిందూస్థానంలో తయారైన వస్తువు లెన్నో దిగుమతికావాలి. దేశప్రజలమీద మరియొక దేశప్రజలు, రాష్ట్రప్రజలమీద మరియొక రాష్ట్రప్రజలు ఆధారపడవలసివుండుట తప్పదు. అందుచేత పాకిస్థాన్ ప్రజలు ఆర్థికంగా, నైతికంగా, పారిశ్రామికంగా, ఆహార రీత్యా చాలా వెనుకబడి మలమల మాడుతున్నారు.

హిందూస్థాన్‌నుండి ఏ విధమైన సహాయమూ, సహకారమూ జిన్నాగారు కోరలేదట. పైపెచ్చు హిందువులు ఆరాధించే భానుని రెండుభాగాలుగా చేయనున్నాడట. లేకపోతే పాకిస్థాన్‌లో సూర్యుడు తిరగకుండా ఆకాశమునకు అడ్డంగా గోడకట్టేవిధం

దేమైనావుందా అని శాస్త్రపరిశోధకులతో చర్చిస్తూన్నాడట.

కరువుకాటకంలో చాలామంది ప్రజలు మరణించారట. అన్నివిషయాల్లోనూ సహాయం పొందుతూని గంపెడాశతో ఉన్న జిన్నాకు టర్కీ, ఆఫ్ఘనిస్థాన్, ఇరానులు సహాయంచేయుటకు నిరాకరించాయట.

హిందూస్థానమంతా పాకిస్థాన్ చేద్దామనే దురాశకు, అమానుషచర్యకు ఇక స్వస్తిచెప్పాడట

ఇప్పుడు పాకిస్థాన్‌రాష్ట్రములో జిన్నాగారి నాహ్వానించేవాడు వొక్కడూ లేడు. ముస్లింలీగు నాయకులంతా ప్రజల ఆశీర్వాదాలు తీసుకోలేక జిన్నాగారి దగ్గరకు వచ్చి కష్టనిష్ఠూరాలు మొరపెట్టి గడ్డంపూపుతున్నారట. అంతతో ఆయన చంద్రమార్కు సిగ్రెట్టుకొష్టి మరచిపోయి, జ్యోతిలుకూడ జ్ఞప్తికి రాక "మయోస్లి మొగ్రో" అంటూ తన పరివారంతో గాంధీజీదగ్గరకు సంప్రదింపులకు బయలుదేరారట. నెహ్రూకూడా గాంధీగారి ఆశ్రమానికి విచ్చేశాడట. అందరూ రాజీకి వచ్చారట. ప్రజాస్వామ్యపద్ధతులమీద భారతదేశమంతా ఎన్నికలు పెట్టుటకు అంగీకరిస్తూ తుదినిర్ణయానికి వచ్చారట.

ఎన్నికలు సక్రమంగా గడిచాయి. జవహర్ పండితుని స్వతంత్ర భారతదేశపు రిపబ్లిక్కుకు ప్రథమాధ్యక్షునిగా ఎన్నుకొన్నారట. నెహ్రూపండితుని పూలమాలలతోనింపి స్వతంత్రస్వర్ణరథంమీద వూరేగిస్తూంటే భారతదేశ భాగ్యవిధాత మహాత్మాగాంధీ సారథ్యం చేస్తున్నాడట.

ఎక్కడచూచినా కరతాళధ్వనులు, సంగీతాలు, జైజేలు, జిందాబాద్‌లు, జోహార్లు అనే శబ్దాలు విపరీతంగా చెవులు చిల్లులుపడేటట్లు మారుమ్రోగుతున్నాయి. ఆ ఆనందంతో నేను పూలమాలలు తీసుకొని నెహ్రూపండితునకు, గాంధీజీకి వేయడానికి బయలుదేరానట.

ఇంతలో ఒకపిల్లి మీద దుమికింది. నేను తుళ్ళిపడిలేచి మంచంమీదనుండి క్రిందపడిపోతూ, అంతలోనే తమాయించుకొని, ఆ విధంగా జరిగితే చాలా బాగుండేదికాని, "జిన్నా తన మంకుపట్టు విడుస్తాడా?" అని అనుకుంటున్నా. ఇంతలో పనిమనిషి తలుపుకొట్టింది. తలుపు తెరచి చూచేసరికి లో...కం...తె...ల్ల...వారిం...ది.

శాన్న కృష్ణ

# శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి సత్కారము

రాజమండ్రిలోని వైశ్యసేవాసంస్థాపనకు కారకురాలై, వారికే అయిన ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలకు అధ్యక్షపదవిని అనితరసాధారణముగా నిర్వహించినట్టిన్ని, రాజమండ్రి ఆనరరీ బెంచి మేజస్ట్రేటు, ఆంధ్రవిశ్వవిద్యాలయంవారి సెనేటు, ఎకడెమిక్ కౌన్సిళ్ళలో సభ్యురాలు, రాజమండ్రి పురపాలక సంఘసభ్యురాలు ఇత్యాది గౌరవోద్యోగాలు కొన్ని సంవత్సరాలపాటు నిర్వహించినట్టిన్ని, కేసరిగారి 'గృహలక్ష్మి' స్వర్ణకంకణ ప్రదానాన్ని, రాజమండ్రి మునిసిపాలిటీవారు ఒకప్పుడు జరిపిన కుతపోటీపరీక్షలో రజితపతకాన్ని ఇంకా ఇలాంటి అనేక బహుమానాలను అందుకొన్నట్టిన్ని ఉభయభాషాప్రవీణ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి గతనెల ౧-వ తేదీనాడు రాజమండ్రి పురవాసులు బహువైభవంగా షష్టిపూర్తిఉత్సవం జరిపి, ఘనమైన నిధిని సమర్పించి గొప్పగా సత్కరించిరి. కామాక్షమ్మగారు గావించిన సంఘసేవను, ఆమె జీవిత విశేషాలను ఉగ్గడిస్తూ ఆమె శిష్యురాలు ఉభయభాషాప్రవీణ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు రచించిన ఒక రచననుండి (భారతీయవైశ్య) కొన్ని భాగముల నీదిగువ ఉల్లేఖిస్తున్నాము:

"లోకంలో కొందరు పుట్టుకతోనే గొప్పవాళ్లుగా ఉంటారు. కొందరు పుట్టినతర్వాత స్వప్రయత్నంచేత గొప్పవాళ్లుగా ఔతారు. ఇందులో పుట్టుకలోనే గొప్పవాళ్లుగా ఉండేవారు మనకు ఆదర్శప్రాయులే. కాని వారి జీవితచరిత్రలో మానవ ప్రయత్నానికీ, ప్రబలమైన కృషికీ అట్టే ప్రాధాన్యం కనబడదు. వారు కారణజన్ములు. ఇక పుట్టినతర్వాత స్వప్రయత్నంచేత గొప్పపదవిని పొందిన ఆదర్శప్రాయు

తైనవారి చరిత్రలకలన మానవశ్యపు ప్రజ్ఞాపారమితం కానబడుతుంది. మా పిన్ని కామాక్షమ్మగారు ఈ రెండవ శ్రేణికి చెందిన ధన్యజీవి. చిన్నతనంలో ఆమె అందరివలె సామాన్య వితంతువు.

ఆమె ధనసంపన్నమై ఉన్నతస్థితికి చెందిన నాళంవారి కుటుంబంలో ఏలోటూ లేని పరిస్థితులలో పెరిగింది. ఐనప్పటికీ జ్ఞానమెరిగినతర్వాత, తన అనాథ స్థితి వ్యర్థం చేసుకొన్నతర్వాత, ఆమె ప్రతిక్షణమూ తన జీవిత సార్థక్యంకోసం తన పరిసరాలతో మానసికంగా ప్రబలమైన పోరాటం సల్పింది. "అయ్యో! నా జీవితం ఇలా నాలుగు గోడలమధ్యనా వ్యర్థం కావలసిందేనా? ఏ ధర్మాన్నో నేను దేశానికిగాను, అనను పక్షం ఒక సంఘానికైనా నేను సేవచేయలేనా" అని ఆరాటపడేది. కొన్నాళ్ళు కల్లాగైతేనేం ఈ తీవ్ర సంఘర్షణలోనుండి ఆమె నిశ్చితాభిప్రాయం సంఘసేవ అనేది తప్తకాంచనంలాగా నిలువబడి నిశ్చలరూపం దాల్చింది.

ఆ పరిస్థితిలో శ్రీ నాళం రామలింగయ్యగారు ఆమె అభిప్రాయాలకు దోహదమిచ్చి వైశ్య సేవా సదనం స్థాపిస్తానని అభయమిచ్చారు. అది మొదలు ఆమె సదనసంస్థాపన జరిగేవరకూ 'నిద్రపోలేదు. నీరు త్రాగలేదు.' ఏదో వంకతో ఆమె మద్రాసునుండి పడి పడివచ్చి, ఎన్ని తీవ్రప్రతిబంధకాలున్నా లెక్కచేయక అనుకొన్న ముహూర్తాన సదనము స్థాపించి తన ఈప్సితం, పట్టుదల నెరవేర్చుకొన్నది.

ఐతే ఈ విషయంలో కామాక్షమ్మగారిని గురించి విశిష్టంగా చెప్పవలసినది ఒకటివున్నది. ఆంధ్రదేశములో సాధారణంగా వున్న బాలవితంతువులు అత్తిళ్ళల్లో, పుట్టిళ్ళల్లో సర్వచాకిరీచేస్తూ అదేపరమార్థమని నమ్మి అన్నగార్లు, వదినగార్లు, అత్తగార్లు, మామగారు నానాబాధలు పెట్టినా ఉన్నా నోరు కదపలేనిస్థితిలో వుంటారు. స్వతంత్రత వుండదు. ఒకవేళ వారికి ఏమైనా కొన్ని భావాలంటూ కలిగాయో, అవి అజ్ఞానతమసచ్ఛాదితులై ఈనుతూనే వుంటాయి. అప్పట్లో ఏదో గురువులవద్దకు వెళ్లాలని, వాళ్ల పాదసేవలు చేయాలని, వ్రతం అని, పురాణం అని, హరికథలని, అక్కడకు వెళ్ళాలని ముచ్చటపడేవారే కాని, విద్యాగంధం వారికి లవలేశంకూడా వుండేదికాదు. అట్లాంటి ఆలోచనల దాకైనా పోయేవాళ్ళు కారు. ఒకవేళ ఎవరయినా సాహసించినా కుటుంబపెద్దలు వాళ్ళగొంతుక పిసికి పారేసేవారు.

ఐతే, శ్రీమతి కామాక్షమ్మగారి పరిస్థితి మాత్రము అలాంటిదికాదు. అప్పట్లోనే నాళంవారి కుటుంబము చాలా ధనసంపన్నమైందే కాక చాలా విజ్ఞానవంతమైనదకూడా. కామాక్షమ్మగారు మద్రాసులో తన మేనమామగారయిన శ్రీ నాళం లక్ష్మీకాంతంగారి యింట్లో పెరిగేది. పైనవ్రాసిన బాధలు ఆమెకు లేనేలేవు. ఆమె అప్పుడప్పుడు రాజమండ్రి వచ్చి వుండడముకూడా ఉండేది. అపుడే శ్రీ మా నాయనగారు నాళం కృష్ణారావుగారు గౌతమీ గ్రంథాలయము కొత్తగా తెరచి, స్త్రీలకోసం ఇంటింటికి పుస్తకాలు పంపించి స్త్రీలలో విద్యావిజ్ఞానాలు ప్రచారం చేసేవారు. మా పిన్నికూడా ఈ ప్రచారానికి ఆకర్షితురాలయి పుస్తకాలమీద పుస్తకాలు తెప్పించి గౌతమీ గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ తిరగవేసింది. ఆరోజులలోనే ఆమె వీరేశలింగంగారి చరిత్ర చదవడం, సేవాబీజాలు మనస్సులో నాటుకోవడం జరిగాయి. ఇంతకీ చెప్పవచ్చేదేమంటే, సామాన్య సంసారాలలోవలె కామాక్షమ్మగారికి చిన్నతనంలో అందరు బాలవితంతువులకువలె కష్టాలులేకపోయినా ఆమెలో సేవాశక్తి, స్వాతంత్ర్యపిపాస రగులుకొన్నాయేకాని, మామూలు కథాకాలక్షేపాలకు ఆమె మనస్సులో మొదటనుండి తావు యేర్పడలేదు. ఆమెలోని ఈ విశిష్టగుణమే, ఆంధ్రదేశంలో ప్రప్రథమ స్త్రీవిద్యా జాతీయసంస్థకు కారణభూతమయింది.

సదన సంస్థాపన జరిగింది. జరిగినతరువాత తన పని అయిపోయిందని ఆమె ఊరుకున్నారా? లేదు. అప్పుడు మళ్ళీ చదువును మొదలుపెట్టి ఉభయభాషా ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణత పొందింది. అంతలో అప్పుడు మళ్లీ మొదలుపెట్టి కుట్టుపని నేర్చుకొన్నది. అపుడు మళ్లీ మొదలుపెట్టి హిందీచదివింది. ఇంగ్లీషు

చదివింది. ఏదయినా ఒక కొత్త ప్రయత్నం ఉన్నది అంటే ఆమె ముందు చేపట్టి చవిచూస్తేగాని నిద్ర పోయేదికాదు. అంతేకాదు ఆగినదా తాను పరీక్షలో నెగ్గగానే తన పిల్లలంతా ఆ పరీక్షకు చదవాలని ఆమె మహిళా సదనాన్ని, ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలగా మార్చేవరకు పట్టినపట్టు విడవకుండా సాధించింది.

## నిరాడంబరత

సరే ఇట్లా సదన పరిపాలనలో ఆమె వెనుకా ముందూ చూస్తూ ఆలోచిస్తూ, ఆధిపత్యం సాగించుకు పోతుంటే ఆ కామాక్షమ్మగారంటే ఎలా వుంటుందో, పెద్ద ప్రిన్సిపాలట. ఆమె మనతో మాట్లాడుతుందో లేదో అని చాలామంది దూరదూరాలనుంచి వచ్చేవారు. వారు వచ్చేటప్పుడు ఎంత సంకోచంతో వచ్చేవారో ఆమెతో మాట్లాడి వెళ్ళేటప్పుడు అంత సంతోషంతోను, సంతృప్తితోను వెళ్ళేవారు. దానికి కారణం ఆమె నిరాడంబరత. ఎంత అధికారులు వచ్చినా, ఎంత నిరుపేదలు వచ్చినా ఆమె సహజంగా తన సహృదయంతో వారినెదుర్కొని వాళ్ళ ఇంటితోబుట్టువుల్లాగ వాళ్లతో ఆప్యాయంగా మాట్లాడి వచ్చినవారి పనులుచేసి పంపేది.

ఇక తన సదనంలో ఉండే పిల్లలను ఆదరించటంలోను, అతిథి ఆదరణ విషయాల్లోను మా పిన్నిని చెప్పి ఇంకొకరిని చెప్పాలి. తల్లికంటేకూడా ఎక్కువగా ఆమె పిల్లలను పోషించుకొంటుంది. పట్టి రోజులలో యెన్నిఊళ్లు సంచారముచేసినా పిల్లలకు యేదయినా ఆపదవచ్చిందంటే చాలు ఆమె వాళ్ళమంచం దగ్గరనుంచి కదలనైనా కదలదు. దానితోడు ఆమెకు ఎక్కడెక్కడి మూలవైద్యాలో తెలుసు. ఆమెది అమృతహస్తం—ఏమో ఆయువు మూడితే చెప్పలేము కాని లేదా ఆమె వైద్యం చేసిందంటే ఎంత మొండి రోగమైనా తిరిగి తీరవలసిందే.

ఆమె చిన్నపిల్లలలో చిన్నపిల్ల. పెద్దలలో పెద్ద. పిల్లలందరితో ఆమె ఆటలు ఆడుతుంటే ఉత్సాహంతో పరవళ్లు తొక్కుతుంది. అయినా ఆమెలో ఒక గొప్ప గుణం ఉన్నది. ఏపిల్లల నెట్లా శిక్షణలో పెట్టాలో ఆ విద్య ఆమెకే తెలుసునవాలి. ప్రేమించినపుడు ప్రేమించి లాలించేది. అట్లాఅని అవినయాన్ని సహించేదికాదు. వెంటనే శిక్షించవలసివస్తే కఠినంగా శిక్షించడానికి మొహమాటపడేదికాదు. మళ్లీ ఉత్తరక్షణంలోనే ఆ పిల్లలకే పిలిచి అతిప్రేమతో బుజ్జగించి వాళ్లు సంతోషంగా పూనుకొనేటట్లు వాళ్ళచేత పనులు చేయించేది.

సదన పరిపాలనలో ఆమె అడుగడుక్కీ ఎన్నో ఆపత్తులను ఎదుర్కొనేది. మహామహా ఆర్థికసంపత్తి, సాధన సామాగ్రి స్తోమత, బలసంపద కలవారికే ఒక్క గృహం నిర్వహించుకోవటమే చాలా కష్టసాధ్యమైన కార్యం కదా! అటువంటప్పుడు వందలమీద సంఖ్య ఉన్న ఆ పిల్లల సంస్థను పరిపాలించటం ఎంత కష్టమో చెప్పనక్కరలేదు.

ఆమెది భలే పుష్టి. భగవంతుడి పుణ్యానవలన ఆమె సంకల్పం సన్మార్గంలో ప్రవహించి [illegible] పంటపండింది. ఎన్ని కష్టాలు వచ్చినా ఎదుర్కొని కాలానికూడా ఎదురీదటమే కాని వెనక్కు అడుగు పెట్టటం ఆమె స్వభావంలో ఎఱగదు. కష్టాలు వచ్చిన కొలదీ ఆమె పనిలో రాటుదేలింది. కష్టాలు వచ్చిన కొలదీ ఆమె పట్టుదల ప్రబలమైనది. కష్టాలు వచ్చిన కొలదీ ఆమెకు ఓర్పు, ఉత్సాహమూ అతిశయించినవి.

కష్టాలు వచ్చినకొలదీ అభివృద్ధిమార్గంలో ఆమె చకచకా పైకి సాగిపోయి విజయం చేపట్టి ఆ సంతోషం పూర్తిగా అనుభవించింది.

కార్యసాధనపట్ల ఆమె న్యూనతాధిక్యాలు పాటించలేదు. ఒక్కొక్కప్పుడు దాసీపని చెయ్యవలసివచ్చినా ఆమె జంకిపోలేదు. ఆంధ్ర యూనివర్సిటీ సెనేటు మెంబరుపదవి వచ్చినపుడు "ఆహా" అని పొంగిపోలేదు. రెండూ ఆమె సమానంగానే భావించి అనుభవించింది. సదనబాలికల సౌకర్యాలకోసం నేను సెనేటుకు, సిండికేటుకూ మెంబరుగా వెళ్తూ ఉన్నానని త్రికరణశుద్ధిగా ఆమె భావించి అలాగే ఆ పదాన్ని నిర్వహించింది. అంతకంటే అతిశయం పడలేదు. అదే భావనతో సదనంలో పిల్లలకు పరిచర్యచేయడంలో ఆమె ఎన్నడూ నీచపడలేదు.

అట్టి మహానుభావురాలిని, సంఘసేవాధురీణను, పరోపకారశీలను, నిరాడంబర వ్యక్తిని, మృదుల స్వభావను, విజ్ఞానసంపన్నను సన్మానించి తెలుగుదేశం తన్ను తానే సన్మానించుకొన్నది.



# విమర్శనము



౧. కవిప్రియ

౨. దీక్షితదుహిత

౩. పద్మావతీచరణచారణ చక్రవర్తి

౪. రత్నాకరము

మొదటి మూడూ పద్యనాటికలు; రత్నాకరము గీతికాసంవాదము. శ్రీ శివశంకరశాస్త్రిగారి రచనలు సాహితీసమితి ప్రచురణలు.

శ్రీ శివశంకరశాస్త్రిగారు అంటే ఇప్పటి తెలుగు చదువరులకు 'ఫలానా' అని పరిచయం చెయ్యనక్కరలేదు.

శాస్త్రిగారి పేరు ఉచ్చరించగానే సాహితీసమితి, హృదయేశ్వరి, అన్నివిషయాలమీద ఆచార్యులులా మాట్లాడే ఆయననేర్పు, బోలెడు కథలూ వరసగా జ్ఞాపకం వస్తాయి. నవ్యసాహిత్య ప్రసక్తిలో ఆయన్ని విడిచి మాట్లాడడం దుర్లభం.

వక్తగా, కవిగా, పండితులుగా ప్రసిద్ధులు. ఈయన ఖండకావ్యాలు, కథలు కన్న ఇటీవల పద్యనాటికలు చాలా వ్రాశారు. లోకానికి ఈయన ఖండకావ్యాలమీదా, కథలమీదా మోజుఅయితే — ఈయనకు తన పద్యనాటికలమీద వల్లమాలిన అభిమానం.

ఇదొక చిత్రమైన సన్నివేశం!

వేదములలోనూ, ఉపనిషత్తులలోనూ ఉన్న ఛందోబద్ధమైన వాకోవాక్యములు (సంభాషణను) తప్పిస్తే లౌకిక సంస్కృతసాహిత్యంలో నాటకమంతా పద్యాలతో నడిచే రచనలు కనబడవు.

సుప్రసిద్ధసంస్కృత నాటకరచయితలు భాస, కాళిదాస, భవభూతి, హర్షదేవాదుల నాటకాల్లో పద్యాలుంటాయి. అయితే అవి చమత్కారమూ, భావావేశమూ, రసస్ఫూర్తీ కలగవలసిన చోటమాత్రమే ఉండి తక్కిన సాధారణసంభాషణం అంతా స్వచ్ఛమైన వచనంలో సాగుతుంది.

ఇప్పటి సారస్వతసమాలోచనాపరులలో ఒకవైపు తీవ్రంగా ఉన్న వాదం ఏమంటే — నాటకంలో అసలు పద్యాలే పనికిరావు. నాటకగమనాన్నీ, సహజత్వాన్నీ ఈ పద్యాలు చంపుతున్నాయి. పద్యం రాగానే సంగీతం వస్తుంది. దానితో నాటకంలో ఉద్దేశించిన సన్నివేశసౌందర్యం, రసానుభూతీ, సంగీతం చాటున మాటుపడి, నాటకప్రయోజనం ధ్వంసమై పోతున్నది కనుక వచననాటకాలు తప్ప ఇంకొకరకం ఈ తరానికి పనికిరావు అని గర్జిస్తున్నారు.

రెండోవైపువారు కొందరు నాటకమంతా పద్యాలతోటే నిర్వచనంగా ఎందుకు వ్రాయకూడదు, సారస్వతప్రక్రియలో ఇదొక క్రొత్తశైలి ఎందుకు కారాదు అని పట్టుబట్టి నాటకాలు పద్యాల్లోనే వ్రాస్తున్నారు.

రెండవ శ్రేణికి ప్రతినిధి శివశంకరశాస్త్రిగారు.

ఈయన సుమారు ౧౦ నాటికలు పద్యాల్లోనే వ్రాశారు ఈయన్ను అనుసరించిన ఒకరిద్దరు రచయితలుగూడా ఉన్నారు. కాని, ఈ పద్యనాటికలకు రావలసినంత ప్రఖ్యాతి రావడంలేదు.

కారణం — నే నిట్లా అనుకుంటాను.

సారస్వతశాఖల్లో అన్నిటికంటె నాటకం ఎక్కువ జీవిత సమీపవర్తి. కనుక దానిలో జీవితప్రతిఫలనరూపమైన సహజత్వాన్ని ప్రజలు మిక్కిలి పట్టింపుగా చూస్తారు. కవులుగూడా ఈ దృష్టితోనే శ్రేష్ఠకావ్యాల్లో ఉపయోగించని ప్రాకృతం పాత్రలనుబట్టి వాడవలసి వచ్చింది. సామాన్యసంభాషణకు పద్యాలు వాడకుండా చాలవరకు జాగ్రత్తపడి, భావావేశమును బట్టి పద్యము లుంచారు. ఒకవేళ అస్థానపతితములైన పద్యాలుంటే-నటులు వాటిని తీసివేసి ఆ కాలజీవితానికి చేరువగా తేవడానికి ప్రయత్నించడం కద్దు.

ఈ సందర్భంలో—

పద్యనాటిక రంగస్థలంమీద పెడితే—మామూలు మాటలకుగూడా మాటిమాటికీ వచ్చేపద్యాలు ప్రజలకు వికృతంగా ఎబ్బెట్టుగా కనబడకతప్పదు. దానితో ప్రదర్శనం రక్తికట్టడం కష్టం.

అంతేకాకుండా ఛందోబద్ధమైన వాక్యసరణి సాధారణవచనంలా ప్రేక్షకులకు అవగాహన కాదు. ఈ కారణాలవల్ల పద్యనాటికలు ప్రజలకు దూరమైపోవడానికి చాలా వీలున్నది. కాబట్టి ఇవి పేరునకు నాటికలైనా శ్రవ్యకావ్యాలవలె స్తిమితంగా కూర్చుని చదువుకోడానికే ఎక్కువ ఉపయోగిస్తాయి.

'కవిప్రియ' నాటికలోని ప్రతిపాద్యవిషయం బిల్హణకవీంద్రుని కథ. బిల్హణీయం అనే సంస్కృత కావ్యంలోని కథను శాస్త్రిగారు మార్చినారు. అసలు కథలో — కవిని రాజకుమారిగాని, రాజకుమారిని కవిగాని చూచే అవకాశం ఇవ్వకుండా రాజు ఇద్దరికీ మధ్య తెరకట్టించి కొంతకాలం జరుపగా హఠాత్తుగా తెరకవతల నిజం తెలుసుకున్న ఇద్దరూ ప్రేయసీప్రియులౌతారు. తర్వాత రాజుకు తెలియడం, దండనవిధి. కవిచిత్తశుద్ధి తెలిసి రాజు కవికి పుత్రికనిచ్చి వివాహం చెయ్యడం జరుగుతుంది.

శాస్త్రిగారు యవనికావృత్తాంతం మార్చడంలో ఏమిగుణం చూచినారోగాని, దానివల్లనే ఎక్కువ నాటకత్వం పరిభ్రష్టమై ఉండునని నా తలంపు.

రాజపుత్రి ప్రేమ క్రమవికసితం కాక హఠాత్తుగా స్పష్టమైపోవడంవల్ల రసస్ఫూర్తి కొంత లేతిపడ్డది. ముగ్ధ అయిన యామిని రంగవరంగంలో ప్రవర్తించిన విధం చూడగా కులపాలికాసహజమైన లజ్జాసంకోచాల మాధుర్యం సడలి, రాజకుమారీ, కవిగారూ కూడ తొందరపడినట్టు కనబడుతుంది. ఇక్కడ నాయికలోని ముగ్ధాత్వం పట్టున ముదిరిపోవడం ఆస్వాద్యం కాదేమో!

'కవిప్రియ'లోని కొందరు పాత్రలు పట్టిన సంస్కృత వాక్యాలూ, శ్లోకాలూ మాట్లాడుతూంటారు!

"అలమలం కవివరా! ఆచార్యసత్తమా"

"కిం కారణం కవివరేణ్యా దరస్మితో౽సి

భీతిర్న కిం తవ"

కవిముఖానూ, తక్కిన కొన్ని పాత్రలముఖాననూ కేవలశ్లోకములే ఉన్నవి.

మణిప్రవాళశైలిగ తెలుగు కావ్యంలో ఈ సంస్కృతం కలగలుపు చెయ్యడంలోని ఔచిత్యం ఏమిటో తెలియదు. ఇది కేవలం తెలుగు పత్రికలకు అర్థంకాదు. సంస్కృత పండితులకు ఈ రకంచదివే కుతూహలం ఉండదు. ఇక సరిగ్గా శాస్త్రిగారివంటి సంస్కృతులు కొందరుమాత్రం చదవడమే దీని ప్రయోజనమా? దీనివల్ల కావ్యప్రయోజనం కోరి సంకుచితం చేసినట్టయింది. ఆ వాక్యాలకూ, శ్లోకాలకూ తెలుగు చెయ్యకం కవి తొలగించుకోలేని బాధ్యత అయి ఉన్నది.

ఇందులో సాధారణంగా కావ్యాల్లో కనిపించని వింతమాట లున్నవి.

౧. కురుసరో (కురియరో అనుటకు).

౨. శిక్షాదండనం (పాణినీయంలో విద్యాభ్యాసం).

౩. ఎల్లుట (ఎల్లుండి).

౪. పాండురపటవాసభాతి (ఇవార్థంలో భాతి సంస్కృతమా?)

౫. ఇత్యాదులు.

౨. 'దీక్షితదుహిత'లో తీసుకున్న కథ చక్కనిది. అప్పయ్య దీక్షితులవారి పుత్రిక మంగళాంబ తండ్రిగారి శిష్యుడు చంద్రమౌళిని ప్రేమించి హృదయమిచ్చి, తుదకు తండ్రిగారు, వితంతువైన తనకు వివాహం సమ్మతించకపోగా, లోలోపలి అనురాగ వ్యథతో ఇద్దరూ బాధపడి తుదకు వేరుపడతారు.

కవిప్రియవలెనే ఇందులోకూడ మంగళాంబ చంద్రమౌళిని కలుసుకొన్నట్టు చూడగా ముగ్ధప్రేమ క్రమంగా రసస్థితికి మారక తలవనితలంపుగా శృంగారంపై మెట్టుకు వెళ్లడం అసహజమనిపిస్తున్నది. ఇందులోకూడా పాత్రలు ఉండుండి సంస్కృతం మాటాడ్డం ఉన్నది. ఇందులో వింతమాటలు—అనవ (వితంతువు), బ్రాహ్మణం (బ్రాహ్మణ్యమని యర్థము), యోచించు (యోజించు) ఇత్యాదులు.

'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' గీతగోవింద కర్త జయదేవకవీంద్రుని సన్మానకథ.

గౌడలక్ష్మణసేన భూకాంతుడు జయదేవకవిని సగౌరవంగా సభకు రావించి విద్వాంసుల సముక్షాన గీతగోవిందమును విని ఆనందించి సన్మానించి గజారోహణోత్సవం జరపడం, కవిభార్య పద్మావతి భర్త ప్రతిభకు, ప్రేమకు ముదితురాలై అంతఃపురసన్మానాలంకారాలతో అలంకరించుకొని నాట్యం చెయ్యడం ఇందలి ప్రధాన ఇతివృత్తం.

సంభాషణలూ, పాత్రపోషణా సాఫుగా నడిచాయి. కవిప్రేమార్ద్రహృదయం, స్త్రీగౌరవం బాగా చిత్రితములైనాయి. ఇంకూడా సంస్కృతకవిచరిత్ర వినా, ఇందులోని సంభాషణలకు గీర్వాణవాసన తగలలేదు. అయితే మురారికవి 'కష్టా వేనవ్యథా' అనే శ్లోకాన్ని శాస్త్రిగారు అక్షరాలా తెలిగించి అసంగతి స్మరించకపోవడం మరపుచేతనే అనుకుంటాను.

ఇక—ఇందులో పైనాటికల్లో ఉన్నంతమాత్రమైనా నాటకీయసన్నివేశవినివేశనం లేదు. కనక నాటికాదృష్టితో చూస్తే ఇది పద్యసంభాషణ పరంపరగా కనిపిస్తుందిగాని ఘటనాచాతుర్యసుందర నాటకం అనిపించదు.

'రత్నాకరము' లో పాత్రలు నలుగురే ఉన్నందువల్లనూ, కదలిక తక్కువగా ఉన్నందువల్లనూ శాస్త్రిగారు దీనిని గీతికాసంవాద మనిఉంటారు.

భ్రమరిక అనే ఒక యువతి వివాహిత అయినా అత్తవారిల్లంటే అయిష్టపడి ఒకసారి తమ బంధువులింట ఆకస్మికంగా చూచిన త్రిలోచనుడనే ఒక యువకుణ్ణి ప్రేమిస్తుంది. తన ప్రేమకథ శాంత అనే చెలికత్తెతో ఈమె చెప్పితే ఉత్తరభాగంలో త్రిలోచనుడు ధూర్జటి అనే తన మిత్రునితో చెబుతాడు.

సంభాషణ సరళంగా, శృంగారకథాసహజమైన ఔచిత్యంతో చల్లగా సాగుతుంది. అంతకన్న దీనినిగురించి చెప్పవలసిన విశేషం లేదు.

తుదిమాట : శ్రీ శివశంకరశాస్త్రిగారు రెండుమూడు మంచి వచననాటికలు వ్రాశారు. 'వేణీ




వేప గుణములు కలిగియున్న కేరళా వేపసబ్బు, చర్మమును రక్షించి, దేహచ్ఛాయకు కాంతి నిచ్చును. చక్కని చర్మ ఆరోగ్యానికి ఇదే తగిన సబ్బు.

MANUFACTURERS :—
.ERALA SOAP INSTITUTE
...CALICUT...

FAS-KS-4

మాన్యుఫాక్చరర్స్ :
కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్,
కాలికట్.

సంహారం' 'స్త్రీ విరోధి' చదువదగ్గవి. ప్రదర్శనానికి గూడా 'ఫసందు'గా ఉంటాయి. ఆయన హృద కొన్ని చిన్నకథలు తెలుగు పాఠకులు ఆదరంగా చదవకపోలేదు.

నిజం చెప్పవలసివస్తే శాస్త్రిగారి ఈ పద్యనాటికలు ఇప్పటితరానికి ఎదురీత అనకతప్పదు.

ఈ నాటికారచనలో గూడా శాస్త్రిగారికి మురారిధోరణి పట్టుబడిందిగాని భాసకాళిదాసమార్గం కాదు.

భాషలో, భావచిత్రణంలో శాస్త్రిగారి సంస్కృతపక్షపాతం ఈ నాటికల్లోంచి ఎంతయినా ఉదాహరించవచ్చు.

భాషలో, కల్పనలో జీవితానికెంత దగ్గరగా వస్తే నాటకత్వంలో అంత విజయం.

భావశిల్పంలో, పదప్రౌఢిమలో ఎంతఉన్నత శీత మెక్కితే కావ్యానికంత మెరుగు-కదా-

శాస్త్రిగారు లోకాన్ని చూచి తమ మార్గమేదో సులువుగా నిర్ణయించుకోగలిగిన ప్రజ్ఞావంతులనే నా నమ్మ

'ఆనందవర్ధన'

## చిత్రాంగద

నవరచనావళి (౮/౮ జేశిగర్ సామివీధి, మైలాపూరు, మద్రాసు) వారి తృతీయ ప్రచురణ. వెల రూ. ౧-౮-౦.

ఈ గ్రంథమాలికవారు ఇంతకుముందు రెండు మంచి కథానికా సంపుటాలు ప్రచురించారు.

ఇప్పుడు నాటిక—

ఈ నాటికకు ఆదికవి శ్రీ రవీంద్రనాథ ఠాకూరు.

ఆయన వంగమాతృకకు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారి అనువాదం ఇది.

భారతంలోని చిత్రాంగద కథకు రమణీయమైన కావ్యరూప మిచ్చి, రవీంద్రకవి, ఈ నాటికను రచించినట్లు కనబడుతుంది.

దీనికి కవి నాటిక అని పేరుపెట్టినా దీనిలోని గంభీరమూ, సుందరమూ అయిన కవితా ధోరణి దీన్ని లోకానికి కావ్యంగానే చూపిస్తుంది.

ముందు పురుషభావపూరిత అయిన చిత్రాంగదలో, మన్మథవసంత సహాయంవల్ల క్రమంగా వికసించిన స్త్రీత్వ, లావణ్యగరిమలు ఆమె హృదయంలో కాఠిన్యాన్ని తొలచి ప్రేమమాధుర్యాన్ని నింపడం, అర్జునుని ప్రేమించి, ఎదుటికి వచ్చిన అతన్ని గుర్తించక మాటలాడడం ఇందులోని ఘటనాచాతుర్యాలకు ఉదాహరణాలు.

సుపరిచితమైన రవికవి కవితా మాధుర్యాలను గురించి ఇప్పుడు ప్రసంగం ఎత్తుకోవడం అనవసరమైన అవసరం. అనువాదంగురించి ఒక మాట.

మనకు సరిగ్గా ఇంగ్లీషు 'బ్లాంక్ వెర్స్'లాంటి, వచనానికి బాగా దగ్గరైన రచన లేదు. కనుక 'ఎంత కంటె లేదు'అనుకున్న గీతపద్యంగూడా సంభాషణకు బెరుకుగా ఉండి, సంగీతం ఎక్కువై అసహజంగా కనబడుతుంది.

శ్రీ విశ్వేశ్వరరావుగారు దీన్ని వచనంలోనే చక్కగా తెలిగిస్తే ఇంతకన్న ఆస్వాద్యం అగునేమో ఆలోచించదగ్గ విషయం.

ఈయన తెలుగులో చెయ్యితిరిగిన రచయిత కావడంవల్ల ఈయనఅనువాదం విశిష్టం అనడానికభ్యంతరం ఏమాత్రంలేదు. కాని ఈయన, మన పూర్వాంధ్రకవులు సంస్కృతానువాదాలలో అవలంబించిన స్వాతంత్ర్యం తీసుకుని ఠాకూరు భావాలను తేటతెలుగులో ప్రస్తరించిచూపితే కవిహృదయాన్ని ఇంకా ఎక్కువమంది సమీపించగల్గి ఉంటారు పాఠకులు—

ఈ అనువాదంలో యథాతథంగా ఉన్న బెంగాల్ సంస్కృతం, అతిశయోక్తి తగ్గిస్తే గ్రంథానికి ఇంకా శోభ కలిగి ఉండును. అయితే మొత్తంమీద-చదివి ఆస్వాదించదగిన నాటిక.

'ఆనందవర్ధన'

# గ్రంథ స్వీకారము

## భారత దేశము : ఆర్థిక వ్యవహారాలు

రచన: శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు గారు. ప్రచురణ: కళాపీఠం, బెజవాడ. వెల: రూపాయిన్నర.

## శ్రీ ధన్వంతరి చరిత్రము

పద్యకావ్యము. రచన: ఓలేటి సూర్యనారాయణ శాస్త్రి గారు, వింజరం, యానాంపోస్టు, తూ. గో. జిల్లా. వెల: రూపాయిన్నర.

## భారత స్త్రీ

మూడంకాల రూపకము. రచన: గుగ్గిగాల వెంకటకృష్ణమూర్తిగారు. ప్రచురణ: స్టాండర్డు ఏజన్సీస్, మద్రాసు. వెల: రూపాయి.

## మహాదేవి అక్కగారి వచనములు

అనువాదకు: జి. టి. అక్కలయ్య దీక్షితులుగారు. ప్రచురణ: వీరశైవ సాహిత్య భాండారము, కిర్ణ, చిక్కపేట, బెంగుళూరు. వెల: ౧౨ అ.

## కాంగ్రెసు వైద్యదళము : మలయా యాత్ర

రచన: చింతలపాటి శివరామశాస్త్రి గారు. ప్రచురణ: శ్రీ హరనాథమురళి, తెనాలి. వెల: రూపాయిన్నర.

## బ్రహ్మచర్యము

అనువాదము: శ్రీ శుద్ధచైతన్యస్వామి. ప్రచురణ: జనోపకారిణీ స్టోర్సు, ప్రొద్దుటూరు.

## స్వరాజ్య సాధనము

రచన: గుడ్డూరు అచ్యుత రామారావుగారు. ప్రచురణ: సరస్వతీ గ్రంథమండలి, కాకరపర్రు. వెల: రూపాయి.

## కలరా

రచయిత: వేమవరపు వెంకటరమణ శర్మగారు, కపిలేశ్వరపురము, తూ. గో. జిల్లా. వెల: ౯ అ.

## ౧. గ్రంథాలయములు : రిజిస్ట్రేషను
## ౨. సభలు సమావేశములు

మొదటిది పోతూరి నాగభూషణంగారి రచన. రెండవది గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిది. రెంటికిని ప్రకాశకులు: దేశకవితామండలి, బెజవాడ. వెలలు: ౬ అ.; రూపాయి పావలా.

## రేడియో

రచన: యల్. కె. విశ్వనాథంగారు, గుంటూరు. వెల: ౪ అ.

## మంగళ ప్రభాతము

గాంధీగారి రచనకు హరే సముద్రము నరసింగరావుగారి (అనంతపురము) అనువాదము. వెల: ౧౦ అ.

## ౧. పద్మావతీచరణచారణచక్రవర్తి

(పద్యనాటిక. ద్వితీయముద్రణము. ౧౨ అ.)

## ౨. రత్నాకరము

(గీతికాసంవాదము. ౧౨ అ.)

## 3. దీక్షిత దుహిత

(పద్యనాటిక. రూపాయ పావలా.)

## ౪. కవిప్రియ

(శిల్పకథ. పద్యనాటిక. రూపాయిన్నర)

ఈ నాలుగున్ను సాహితీ సమితివారి ప్రచురణలు. శ్రీ శివశంకరశాస్త్రిగారి రచనలు.

## భారతాభ్యుదయము

శ్రీ విద్యారణ్య చరిత్రము. యక్షగానము. రచయిత: భీమవరపు సాంబశివశర్మగారు ప్రకాశకులు: శ్రీరామా బుక్ డిపో, సికిందరాబాదు. ౯ అ.

## కర్ణసుందరి

బిల్హణ నాటిక కాంధ్రానువాదము. అనువాదకులు: శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాథ రావుగార్లు. ప్రాప్తిస్థానము: విజయా బుక్ డిపో, వనపర్తి (నైజాము). ౧ రూ.

### నల ప్రవాసము

తొమ్మిది దంకముల నాటకము. గ్రంథకర్త: మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రి గారు. ప్రకాశకులు: సుందరరాం అండ్ సన్సు, తెనాలి. రూపాయిన్నర.

### విద్యార్థిని

సాంఘిక నాటకం. గ్రంథకర్త: ఎసుమర్తి రాఘవరావుగారు. తారా పబ్లికేషన్సు, మద్రాసు ౪ ౧౨ అ.

### ప్రజారాజ్యం

౧౪ రంగాల ఏకాంక నాటకం. రచయితలు: జాస్తి వెంకటనరసయ్య, ధూళిపాళ వెంకటసుబ్రహ్మణ్యము గార్లు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా. ౧౦ అ.

### సామ్రాజ్యము

లూయీఫిషర్ ఆంగ్లరచనకు అనువాదం. అనువాదకులు: పండితారాధ్యుల నాగేశ్వరరావు గారు. పెరంబూరు (మద్రాసు) సంస్కృతి గ్రంథ మండలి ప్రచురణ. ౧ రూ.

### నేటిసమస్యలు

గాంధీ మహాత్ముని రచనకు తత్త్వానందస్వామి అనువాదము. శ్రీ సుగ్గామాల్ గెన్ బుక్ డిపో, బెజవాడ. రూపాయిన్నర.

### సప్త మహావ్రతములు

గాంధీ మహాత్ముని రచనకు బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారి అనువాదము. సుందరరాం అండ్ సన్సు, తెనాలి. ౬ అ.

### ఆరోగ్య ప్రభాకరము

శ్రీ రాఘవేంద్రస్వామి (శ్రీ యోగాశ్రమం, వసూరేపల్లె) రచన, తెనాలి సుందరరాం అండ్ సన్సు ప్రచురణ. ౯ పైసల తపాలాబిళ్ళలు పంపిన మాత్రాన ఆశ్రమములకు, గ్రంథాలయాలకు, భజన మందిరాలకు, ఇత్యాది సంస్థలకు ఉచితం.

### జాతీయ దసరా గీతములు

జాస్తి వెంకట నరసయ్య, ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యము గార్ల రచన. తెనాలి విశ్వజ్ఞమండలి ప్రచురణ. ౨ అ.

### ప్రత్యేక సంచికలు

బరంపురం నుంచి 'వెలుగు' ఉగాది కిరణము, మద్రాసునుంచి 'ఢంకా' సంవత్సరాది సంచిక, 'సూర్యప్రభ' సంచికలను కూడా సాదరంతో స్వీకరించినాము. ప్రత్యేక వ్యాసాలతోనూ, చిత్రాలతోనూ ఇవి వాటివాటి ఆదర్శానుగుణంగా చక్కగా తయారై ముచ్చటగా ఉన్నాయి.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.

